


# ఐక్య ఉపాధ్యాయ

6వ మహాసభల ప్రత్యేక సంచిక



## మైనేని నగర్ గుంటూరు

6వ విద్యావైజ్ఞానిక మహాసభలు

1993 ఆగస్టు 8,9,10 తేదీలు

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్
ఉపాధ్యాయ ప్రదర్శన
6వ. విద్యా వైజ్ఞానిక మహాసభలు, 1993 ఆగస్టు 8,9,10 తేదీలు

సంపుటి: 19
సంచిక: 9

మహాప్రదర్శన దృశ్యము

1993 సెప్టెంబర్
వెల: రు: 6/-

ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ అధికారపత్రిక

THE LARGEST CIRCULATED EDUCATIONAL MONTHLY.

# MESSAGES



Kindly refer to your letter dated April 26, 1993, addressed to the Hon'ble Vice-President. In this context, you may recall that Shri Hanumantha Rao, M.P., alongwith some Federation members, had called on him and extended this invitation for inaugurating the 6th State Level Educational & Cultural Conference at Guntur on 8th and 9th August, 1993.

After having checked the Vice-President's schedule during that month, it appears that he is already pre-occupied with the Parliment Session during that period. Therefore, it would not be possible for the Vice-President to accept your kind invitation.

Nevertheless, the Vice-President extends his best wishes for the success of the proposed Conference

With kind regards,

Yours Sincerely,
(S.K. SHERIFF)
Secretary,
To the Vice-President of India,
New Delhi.



I WISH THE DELIBERATIONS OF SIXTH EDUCATIONAL AND CULTURAL CONFERENCE OF TEACHERS FEDERATION ALL SUCCESS

(K. VIJAYA BHASAKARA REDDY)
Chief Minister of Andhra Pradesh).





The Education set-up in the country need to be revamped, in keeping with the national social ethos.

While at the time of Independence, when India had to catch up with the outside world, emphasis was given to development of higher education. But, now, under changed circumstances, there is a need to give a pointed thrust to primary education.

It is only through increased emphasis on primary education can we hope to increase the rate of literacy in the country.

I am glad that the Sixth Educational and Cultural Conference of the Andhra Pradesh United Teachers Federation is being held in Guntur from August 8-10, 1993. I am sure your deliberations would focus on the need for revamping the educational system, introducing vocational courses, and for introducing the child to the cultural heritage of India. I wish your conference all success.

(Dr. M.CHANNA REDDY)
Raj Bhavan, Madras-600 022.
Governor Tamilnadu.

I have received your letter dated 31.7.93. I am glad to know that your federation is going to hold the Sixth Educational and Cultural Conference in the Second Week of August at Guntur. I wish a grand success of the conference. All the best.

yours sincerely,
(C. RAMACHANDRA REDDY)
Minister for Marketing & Ware Housing,
Hyderabad.

I am glad to receive your invitation to the Sixth Educational and Cultural Conference at Guntur.

Striving to find avenues towards the development of the Children with a rational outlook, scientific temper through vocational methodology is a highly commendable goal which you propose to achieve through this conference.

I would be very much happy to be associated with such a conference but for my pre-fixed official engagements on those dates.

I wish the conference all sucess and God-Speed.

Regards.

Yours Sincerely,
(D. SRINIVAS)
Minister for Rural Development,
Rural Water Supply, Handlooms &
Textiles and Sericulture.

Thank you very much for your letter dated 31st July, 1993 informing me about the Sixth Educational and Cultural Conference being organised under the auspices of Andhra Pradesh United Teacher's Federation from 8th to 10th August, 1993 at Guntur.

I would have loved to attend the conference but for my indisposition for the last few days.

I wish the conference all success.

Yours Sincerely,
(K. JAYASHANKAR)
Vice-Chancellor, Kakatiya University,
Vidyaranyapuri, Warangal.506 009.

DUE TO ORGANISATIONAL REASONS WE ARE UNABLE TO ATTEND THE CONFERENCE AND WISH THE CONFERENCE A GRAND SUCCESS:

(BALAKRISHNAN NAMBIAR)
General Secretary,
Kerala School Teachers Association.

WISHING EVERRY SUCESS

(BALAKRISHNAMMA)

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ ఆరవ విద్యా వైజ్ఞానిక మహాసభలకు పంపించిన ఆహ్వానము అందినది. సంతోషం. కాని కొన్ని ప్రత్యేక కారణాల వలన రాలేకపోవుచున్నాను.

ఈ మహాసభలు దిగ్విజయంగా జరగాలని కోరుకుంటున్నాను. ఈ సభలలో అర్థవంతమైన చర్చలు జరుగుతాయని, ఉపయోగకరమైన నిర్ణయాలు చేయబడతాయని ఆశిస్తున్నాను.

రాబోయే నూతన జనరల్ కౌన్సిలుకు ముందుగానే మనః పూర్వక శుభాకాంక్షలు, నాతరఫున, జనవిజ్ఞాన వేదిక పక్షాన తెలియజేస్తున్నాను.

(రాం మోహనరావు)
అధ్యక్షులు,
జనవిజ్ఞాన వేదిక,
ఆంధ్రప్రదేశ్. నిజామాబాద్.

PHONE NO: VJA: 63763 HYD: 666840

YEARLY SUBSCRIPTION 30-00
SINGLE COPY 3-00

# ఐక్య ఉపాధ్యాయ

కొమ్మారెడ్డి కేశవరెడ్డి
(ప్రధాన సంపాదకుడు)
అప్పారి వెంకటస్వామి
దాచూరి రామిరెడ్డి
నాగటి నారాయణ
ఎం.ఎ.కె. దత్తు

## ఉపాధ్యాయులకు ఉద్యమ కార్యకర్తలకు ఉద్యమాంజలి

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ 6వ విద్యా వైజ్ఞానిక మహాసభలు గుంటూరు మైనేనినగర్‌లో 1993 ఆగస్టు 8,9,10 తేదీలలో పదివేలమంది ప్రతినిధులతో జయప్రదంగా జరిగాయి.

గుంటూరు మహాసభలలో కొన్ని ప్రత్యేకతలున్నాయి. వారం రోజులుగా జరుగుతున్న లారీల సమ్మెతో రవాణా స్థంభించిపోయింది. సరిగ్గా మహాసభల ముందు రోజు రాత్రి కురిసిన వర్షంతో మహాసభ షామియానాలు పడిపోయి, ఏర్పాట్లన్నీ అస్థవ్యస్థమైనాయి. పులిమీదపుట్రలా తెలుగుదేశం ఎం.ఎల్.ఎ శ్రీ శివారెడ్డి హత్యతో అన్నిచోట్ల ఉద్రిక్తత చోటు చేసుకొని రాష్ట్ర వ్యాప్తంగా మహాసభ మొదటిరోజు బంద్ పాటించబడింది.

అయినా ఉక్కు క్రమశిక్షణ కల్గిన యు.టి.ఎఫ్. కార్యకర్తలు, ఉపాధ్యాయులు అవాంతరాలన్నీ అధిగమించి అందరిని ఆశ్చర్య చకితులను చేసి మహాసభల ప్రాంగణానికి అనుకున్న సమయానికి అన్నదానికంటే మిన్నగా తరలివచ్చి, తమకు మరెవ్వరు సాటిలేరని, పోటీకారని నిరూపించిన, చేవగల కార్యకర్తలకు, చైతన్యవంతులైన ఉపాధ్యాయులకు ఉద్యమాంజలి సమర్పించుకుంటున్నాము.

చారిత్రాత్మకమైన రాజమండ్రి మహాసభల పతాకం, నిర్మాణం పటిష్టపరచిన ఖమ్మం మహాసభల పతాకం, మన శక్తిని ప్రతిబింబించిన భీమవరం మహాసభల పతాకం, మన విశ్వరూపానికి అద్దంపట్టిన విజయవాడ మహాసభ పతాకం, సాక్షరతా ఉద్యమ సంకేతమైన నెల్లూరు మహాసభల పతాకం, దారిపొడవునా స్వాగతాలు అందుకొంటూ మహాసభల ప్రాంగణానికి రాగా, అగ్నిపరీక్షకు నిలిచిన గుంటూరు మహాసభల పతాకం వాటికి స్వాగతం పలికి, మొత్తం ఆరుపతాకాల రెపరెపలతో, అవి విరజిమ్మే అరుణారుణ కాంతులతో మన మహాసభలు అపూర్వంగా జరిగాయి.

అమరజీవి మైనేనినగర్‌లో మన విశాల భావాలకు ప్రతీకలైన గోష్టులు నిర్వహించబడగా, అమరజీవి సూర్యనారాయణనగర్‌లో మన నిర్మాణ పటిష్టతకు అవసరమైన డాక్యుమెంట్లు రూపొందించబడగా, అమరజీవి సీతారామాచారినగర్‌లో మన అకడమిక్‌సెల్ విధానాలకు ఆధారమైన వస్తు, సైన్సు చిత్ర, తదితర ప్రదర్శనలు నిర్వహించబడగా మన ఉద్యమం ఉన్నత శిఖరాలు అధిరోహించింది.

ప్రారంభసభ, ప్రతినిధుల సభ, జనచైతన్య సదస్సు, మహిళాసదస్సు, సాహిత్యసదస్సు, విద్యాసదస్సు, దేనికదే ప్రత్యేకత కలవి. గుంటూరు పట్టణాన్ని వూపివేసి, అభిమానుల మనస్సులలో చెరగనిముద్ర వేసి, సామాన్య జనంతో సెహభాష్ అనిపించుకొని, సాటి ఉద్యోగ సంఘాలలో ఆశారేఖలు నింపిన మహా ప్రదర్శన మహాసభలకు హైలైట్. వస్తు, వైజ్ఞానిక ప్రదర్శనలు అందరిని అలరించాయి.




ఉద్యమ నిర్వహణలోనే యు.టి.ఎఫ్.దొక ప్రత్యేకత, కార్యకర్తలదొక విశిష్టత, త్యాగాలతో కూడిన చరిత్ర దానిది, సామాజిక స్పృహతో కూడిన పయనం దానిది. అమరజీవి చెన్నుపాటి ఆశయాలే దాని గమ్యం. అందుకే అచిరకాలంలోనే సాటిలేని మేటి సంఘంగా రూపొంది. ఉపాధ్యాయుల ఆదరాభిమానాలు చూరగొంది.

మహాసభల జయప్రదానికి అహోరాత్రులు కృషి చేసిన కార్యకర్తలకు, ఆదరణతో విరాళాలిచ్చిన దాతలకు, సహకరించిన అభిమానులకు, శ్రమించిన ప్రజాసంఘాలకు చేయూతనిచ్చిన ఆహ్వానసంఘం పెద్దలకు, చైతన్యవంతులైన గుంటూరు ఇతర జిల్లాల కార్యకర్తలకు, అశేష ఉపాధ్యాయ బృందానికి మా హృదయపూర్వక కృతజ్ఞతాభి వందనాలు.

ఈ మహాసభలు మన ఉద్యమచరిత్రలో మరో మైలురాయిగా నిలిచి పోతాయి, మన హృదయాలలో మధుర స్మృతులుగా మిగిలిపోతాయి. మన గమ్యంచేరే వరకు మరింత దీక్షతో మన పయనం కొనసాగిస్తామని వినమ్రతతో విన్నవించుకుంటున్నాం.



# వార్తా ప్రపంచం

## అక్టోబర్ టెలీస్కూలు కార్యక్రమం

| తేదీ | కార్యక్రమం | |
|---|---|---|
| 1-10-93 | పుష్పసంవాదం | 5-8 సం॥ |
| శుక్రవారం | ఎన్నికలు | 9-11 |
| 2-10-93 | మనవిశ్వం 1 | ఉపాధ్యాయ |
| శనివారం | కాగితంతో కళ 2 | శిక్షణా |
| | తక్కువఖర్చుతో బోధనోపకరణాలు | కార్యక్రమాలు |
| 4-10-93 | మంచిఆహారపు అలవాట్లు | 5-8 సం॥ |
| సోమవారం | ఆహారం ఆరోగ్యం | „ |
| | వరంగల్ | 9-11సం॥ |
| 5-10-93 | మాటల ఆటలు-పిలుపుల-బావాలు | 5-8 సం॥ |
| మంగళవారం | గమ్మత్తుమాటలు జంట మాటలు పద్యాలు | |
| | బల్చుకథ | 9-11 సం॥ |
| 6-10-93 | వాతావరణం-గాలికథ-గాలిఎందుకు | |
| బుధవారం | గాలి కాలుష్యం | 5-8 సం॥ |
| | పనికరానిగుడ్డముక్కలతో | |
| | బొమ్మలతయారీ | 9-11సం॥ |
| 7-10-93 | బడాయినక్క | 5-8 సం॥ |
| గురువారం | ఆంధ్రకేసరి | 9-11సం॥ |
| 8-10-93 | చదువుకుంటా | 5-8 సం॥ |
| శుక్రవారం | టిక్కు టిక్కు గడియారం | 9-11సం॥ |
| 9-10-93 | మనవిశ్వం 2 | ఉపాధ్యాయ |
| శనివారం | మెదడకు మేత | శిక్షణా కార్యక్రమాలు |
| 11.10.93 | వ్యాయామము | 5-8 సం॥ |
| సోమవారం | చెవిజాగ్రత్తలు | „ |
| | మహానంది | 9-11సం॥ |
| 12-10-93 | మాటల ఆటలు-ఊతపదాలు-జట్లు | 5-8 సం॥ |
| మంగళవారం | రూపాలు మరియు పద్యాలు | |
| | పంచదార కథ | 9-11సం॥ |
| 13.10.93 | నీరు కథ-నీరు ఎందుకు, నీరుఎక్కడ | |
| బుధవారం | దొరుకుతుంది/మొక్కలు-మొక్కలకు | 5-8 సం॥ |
| | ప్రాణం ఉంటుంది. మొక్కలు భాగాలు | |
| | లెర్నింగ్ లెన్ మరియు | |
| | డ్రాయింగ్ ప్రాక్టీస్ | 9-11సం॥ |
| 14.10.93 | దురాశ | 5-8 సం॥ |
| గురువారం | మూడు చేపలు | „ |
| | బంగారుమామిడి పళ్ళు | 9-11సం॥ |
| 15.10.93 | వెలుగుబాట | 5-8 సం॥ |
| శుక్రవారం | పాలడైరి | 9-11సం॥ |
| | ప్రశ్న | „ |
| 16.10.93 | విజ్ఞాన దర్శిని 1 | ఉపాధ్యాయ |
| శనివారం | కాగితంతో కళ 2 | శిక్షణా |
| | తక్కువఖర్చుతో | కార్యక్రమాలు |
| | బోధనోపకరణాలు | |
| 18.10.93 | ఆహారం | 5-8 సం॥ |
| సోమవారం | మచిలీపట్టణం | 9-11సం॥ |
| 19.10.93 | కాలచక్రం-వారాలు, | |
| | తిథులుకొన్ని పద్యాలు | 5-8 సం॥ |
| మంగళవారం | నీరు దారి స్థితులు | 9-11సం॥ |
| 20.10.93 | నీరుకథ-కాలుష్యం, రంగు, రుచి | |
| బుధవారం | పారిశుధ్యం, మొక్కలు-వేర్లు, విత్తనాలు | |
| | మొక్కఎలా వస్తుంది | 5-8 సం॥ |
| | ఇసుకతో అలంకరణ | 9-11సం॥ |
| 21.10.93 | తెలివి | 5-8 సం॥ |
| గురువారం | ఆరోగ్యం-అనారోగ్యం | 9-11సం॥ |
| 23.10.93 | విజ్ఞాన దర్శిని 2 | ఉపాధ్యాయ |
| శనివారం | కాగితంతో కళ 3 | శిక్షణా |
| | తక్కువ ఖర్చుతో | కార్యక్రమాలు |
| | బోధనోపకరణాలు | |
| 25.10.93 | మన ఆహారం | 5-8 సం॥ |
| సోమవారం | ముక్కు జాగ్రత్తలు | „ |
| | తిరుపతి 1 | 9-11సం॥ |
| 26.10.93 | కాలచక్రం-నెలలు, రుతువులు | 5-8 సం॥ |
| మంగళవారం | పక్షులు రకాలు | 9-11సం॥ |
| 27.10.93 | పువ్వు దాని భాగాలు | 5-8 సం॥ |
| బుధవారం | ఆకులు | „ |
| | రేఖాచిత్రాలు | 9-11 సం॥ |
| 28.10.93 | ఎత్తుకు పై ఎత్తు | 5-8 సం॥ |
| గురువారం | నీతిపద్యాలు | „ |
| | మీ అభిప్రాయాలు- | |
| | మాసమాధానాలు | జాబులు-జవాబులు |
| 29.10.93 | కొబ్బరి చెట్టు | 5-8 సం॥ |
| శుక్రవారం | కొల్లేటి సరస్సు | 9-11సం॥ |
| | పిల్లన గ్రోవి | „ |
| 30.10.93 | విజ్ఞాన దర్శిని 3 | ఉపాధ్యాయ |
| శనివారం | సైన్స్ కిట్ 4 | శిక్షణా కార్యక్రమాలు |

## జె.ఎ.సి. దశల వారీ పోరాట కార్యక్రమం

ఎన్.జి.ఓ.లు, ఉపాధ్యాయులు కార్మికులకు ప్రాతినిధ్యం వహించే జె.ఎ.సి. దశలవారీ పోరాటానికి పిలుపు ఇచ్చింది.

1. **సెక్రటేరియట్ ముందు 14.9.93 ధర్నా:** సెక్రటేరియట్ ముందు వేసిన షామియానాలలో వేలాదిమంది ఉపాధ్యాయులతో 14.9.93న జె.ఎ.సి. ఛైర్మన్ శ్రీ రమణయ్య గారి అధ్యక్షతన ధర్నా జరిగింది. 30పైగా గల వివిధ సంఘాలు తమ తమ బ్యానర్స్‌తో ధర్నాలో పాల్గొన్నాయి.

యు.టి.ఎఫ్. పక్షాన 500 మంది ఉపాధ్యాయులు 22 జిల్లాల నుండి ధర్నాలో పాల్గొన్నారు. యు.టి.ఎఫ్. పక్షాన శ్రీ.డి.రామిరెడ్డి శిబిరంలో సందేశమిచ్చారు. పేకమిటీలోని లోపాలు వెంటనే సవరించాలని, లేనిచో పోరాటం మరింత తీవ్రతరం చేస్తామని నాయకులు చెప్పారు.

2. **29.9.93 డిమాన్‌స్ట్రేషన్, నల్ల బ్యాడ్జీలు:** ఆఫీసుల ముందు లంచ్ అవర్‌లో డిమాన్ స్ట్రేషన్‌లు కలెక్టర్ కార్యాలయం ముందు నల్లబ్యాడ్జీలతో ప్రదర్శనలు చేయాలి.

3. **20.10.93 ధర్నా:** కలెక్టర్ ఆఫీసుల ముందు, పాత తాలూకా హెడ్ క్వార్టర్ల ముందు ధర్నాలు చేయాలి.

4. **నవంబర్ 93:** సెక్రటేరియట్ ముందు ప్రదర్శన నిర్వహించాలి.

5. **ప్రత్యక్షచర్య:** ప్రదర్శన తర్వాత ఏ రోజైనా ప్రత్యక్ష చర్యకు దిగడం జరుగుతుంది.

**జె.ఎ.సి. నాయకుల టూరు:** 27-9-93న తిరుపతిలోను, 4-10-93న విజయవాడలోను, 11-10-93న ఖమ్మంలోను, 25-10-93న విశాఖపట్నంలోను, 30-10-93న మహబూబ్‌నగర్‌లోను జె.ఎ.సి. నాయకులు పర్యటించిసమావేశాలలో పాల్గొందురు.

## ఉద్యమ స్ఫూర్తికి ప్రతీకగా నిలచిన

# యు.టి.ఎఫ్. 6వ విద్యా వైజ్ఞానిక మహాసభలు

**యు.టి.యఫ్.** మహాసభలకు ప్రత్యేకత వున్నది. మహాసభలకు వేలాది మంది ఉపాధ్యాయులు వస్తారు. విద్యావేత్తల ఉపన్యాసాలు వుంటాయి. కళా ప్రదర్శనలు; చిత్రకళా ప్రదర్శనలు సాంస్కృతిక ప్రదర్శనలు వుంటాయి. విద్యార్థులు, ఉపాధ్యాయులు-మొత్తంగా విద్యారంగం ఎదుర్కొంటున్న సమస్యలు విపులంగా చర్చింపబడతాయి. ఒక మహాసభ నుండి మరొక మహాసభ వరకు గల విద్యారంగం పరిస్థితి చర్చింపబడుతుంది. ఆతరువాత కాలంలో


అమరవీరులకు జోహార్లు

చేపట్టవలసిన కార్యక్రమాల రూపకల్పన జరుగుతుంది. ఈ విధంగా యు.టి.ఎఫ్. మహానభలు ఉద్యమ కార్యకర్తలకే గాక ఉపాధ్యాయులందరికీ నూతనోత్తేజాన్ని, ఉద్యమ చైతన్యాన్ని, సామాజికస్ఫూర్తిని యిచ్చి కర్తవ్యోన్ముఖుల్ని చేస్తాయి. అందువలన యు.టి.ఎఫ్. మహాసభలు ఉపాధ్యాయుల హృదయాలలో చిరస్మరణీయాలుగా వుండిపోతాయి. గుంటూరు మహాసభ ఉద్యమ పథంలో మరో మరపురాని ఘట్టం.


జోహార్లు పాటపాడుతున్న కళాకారులు

నిర్ణయం తీసుకొన్నప్పుడు అంతగా వ్యవధిలేదు. ఆ తరువాత జిల్లా కేంద్రాలలో ధర్నా కార్యక్రమాలు చేపట్టవలసి వచ్చింది. ఒంటి పూట బడులు, ఆవెంటనే పదవ తరగతి పరీక్షలు, దాదాపు రెండు నెలలు వేసవి సెలవులు ఆగస్టులో జరపాలంటే పాఠశాలలు తెరచిన తరువాత రెండు నెలల వ్యవధే. ఈ కొద్ది కాలంలోనే ఆర్థిక వనరులు సమకూర్చుకోవాలి. చైతన్య వరచే కార్యక్రమాలను రూపొందించుకోవాలి. ఉద్యమ స్ఫూర్తి నిచ్చే రిపోర్టులను ప్రవేశపెట్టాలి. కళారూపాల్ని సమకూర్చుకోవాలి. ఎగ్జిబిషన్లను ఏర్పాటు చేసుకోవాలి.

కార్యకర్తలు నడుం బిగించారు. కఠోర దీక్ష వహించారు. నిర్విరామంగా కృషి చేశారు. ఉద్యమశక్తికి ఎదురులేదని నిరూపించారు. ఉద్యమ చరిత్రకు మరో సువర్ణాధ్యాయాన్ని చేర్చారు. రాష్ట్ర వ్యాప్తంగా గల ఉద్యమ కార్యకర్తల, శ్రేయోభిలాషుల అండదండలు, ప్రోత్సాహం అందినప్పటికీ ప్రత్యేకంగా పట్టుదలకు, కర్తవ్య నిర్వహణకు ప్రతిరూపాలుగా నిలిచి నిర్విరామంగా కృషి చేసి ఆతిథ్యమిచ్చిన గుంటూరు జిల్లా కార్యకర్తలకు మహాసభలను విజయవంతం చేసిన ఘనత దక్కుతుంది.


పతాకావిష్కరణ చేసిన శ్రీ యం. రాయన్న సందేశం

వర్షాల అదిరింపులు, బందల బెదిరింపులు మన కార్యకర్తలను ఏ మాత్రం అడ్డుకోలేవని, ఉపాధ్యాయులను ఏ విధంగా ఆపుచేయలేవని చరిత్రలో నిరూపించబడిన రోజు ఆగస్టు 8. తెల్లవారే టప్పటికి నేల ఈనినట్లు, నింగి పొంగినట్లు పదివేలమంది ప్రతినిధులు అన్ని అడ్డంకులను అధిగమించి గుంటూరు రావడం అందరినీ ఆశ్చర్యపరచింది. యు.టి.ఎఫ్. ప్రత్యేకతని తెలియజెప్పింది.

### పతాక యాత్రలు:

ఇంతకు ముందు మహాసభలు జరుపుకొన్న రాజమండ్రి, ఖమ్మం, భీమవరం, విజయవాడ, నెల్లూరు పట్టణాల నుండిపతాక యాత్రలు బయలుదేరి ఆయా జిల్లాలలోని ప్రధాన పట్టణాలను, మండల కేంద్రాలను సందర్శించి ఉపాధ్యాయులకు మహాసభల ఆహ్వానాన్ని అందజేస్తూ, సెలయేర్లు, వాగులు, వంకల్ని ఉపనదులను కలుపుకొని మహానదులు ముందుకు సాగినట్లుగా ముందుకు సాగాయి. రాజమండ్రి, భీమవరం నుండి సాగిన పతాకయాత్రకు గన్నవరం వద్ద, ఖమ్మం జిల్లానుండి బయలు దేరి వచ్చిన పతాక యాత్రకు గొల్లపూడి వద్ద కృష్ణా జిల్లా శాఖ సాదరంగా స్వాగతం పలుకగా పతాకయాత్రలు ముందుకు సాగి 7వ తేదీ సాయంత్రానికి

విజయవాడలోని చెన్నుపాటి భవనం చేరుకొన్నాయి. రెండువందల మోటారు సైకిళ్ళపై వచ్చిన 400మంది విజయవాడ మన రాష్ట్ర కార్యాలయంలో స్నాన పానాదులు ముగించుకొని తిరుపతి రెడ్డిగారి ఆతిధ్యాన్ని స్వీకరించి రాత్రికి విశ్రాంతి తీసుకొని 8వ తేదీ ఉదయం 6గంటలకు విజయవాడనుండి బయలుదేరి ప్రకాశం బ్యారేజివద్ద గుంటూరు జిల్లా కార్యకర్తల ఆహ్వానంతో గుంటూరు చేసుకొన్నారు.




సంతాపతీర్మానాలు ప్రవేశపెట్టిన శ్రీ ఎం.నరహరి

అలాగే నెల్లూరు నుండి బయలు దేరిన పతాకయాత్ర జిల్లాలోని పలు పట్టణాలను, పల్లెలను సందర్శిస్తూ ప్రకాశం జిల్లా మీదుగా చిలకలూరి పేట వద్ద స్వాగతం అందుకొని గుంటూరు చేరుకొన్నది.

### పతాకావిష్కరణలు:

గుంటూరు వెంకటేశ్వర విజ్ఞాన మందిర్ ఆవరణలో ప్రత్యేకంగా నెలకొల్పబడిన సూర్యనారాయణ రాజు నగర్‌లో పతాకావిష్కరణలతో ఆగస్టు 8 ఉదయం మహాసభల కార్యక్రమం ప్రారంభమయింది.

### ఉద్యమ పతాకాన్ని

ఉద్యమ పతాకాన్ని సీనియర్ కార్యకర్త శ్రీ యం. రాయన్న ఆవిష్కరించారు. దేశభక్తి గేయాలతో ఉద్యమ స్ఫూర్తినిచ్చే పతాక గేయంతో మహాసభల వాతావరణం వ్యాపించగా మంద్రస్వరంతో అమరవీరులకు జోహార్లర్పించే గేయాన్ని ప్రజానాట్యమండలి నార్నెపాడు దళం పాడుతుండగా అమరవీరుల స్థూపానికి రాష్ట్ర కమిటీ సభ్యులు, ప్రత్యేక ఆహ్వానితులు పూలతో శ్రద్ధాంజలి ఘటించారు.



స్వాగతోపన్యాసం చేస్తున్న శ్రీ సిహెచ్.నాగేశ్వరరావు

అంతకు ముందే మహాసభల ప్రాంగణానికి చేరుకొన్న ఉద్యమ పతాకాలను నాయకులు స్వీకరించారు. మొదటి మహాసభ జరిగిన రాజమండ్రి నుండి వచ్చిన ఉద్యమ పతాకాన్ని శ్రీ జి. చిట్టిబాబు నుండి శ్రీ ఎ. వెంకటస్వామి, ద్వితీయ మహాసభలు జరుపుకొన్న ఖమ్మం నుండి వచ్చిన పతాకాన్ని శ్రీ కె. కృష్ణయ్య నుండి శ్రీ పి. కృష్ణమూర్తి, మూడవ మహాసభలు నిర్వహించిన భీమవరం నుండి వచ్చిన పతాకాన్ని శ్రీ సి.హెచ్. సుభాష్‌చంద్రబోస్ నుండి శ్రీమతి సి. కమలకుమారి, నాల్గవ మహాసభలు ఘనంగా నిర్వహించిన విజయవాడ నుండి వచ్చిన పతాకాన్ని శ్రీ పి. సోమయ్య నుండి శ్రీ ఎ. వెంకటస్వామి, ఐదవ మహాసభలు అత్యంత వైభవంగా జరుపుకొన్న నెల్లూరు నుండి వచ్చిన పతాకాన్ని శ్రీ పి. బాబురెడ్డి నుండి శ్రీ వి. విశ్వనాథం స్వీకరించారు. అనంతరం ఎగ్జిబిషన్‌లోని వివిధ భాగాల ప్రారంభోత్సవాలు వైభవోపేతంగా జరిగాయి.

విజ్ఞాన దాయకమైన వివిధ వస్తువులను సేకరించి ప్రదర్శించడం ఉపాధ్యాయులలోని సృజనాత్మకతకు అలాగే విద్యార్థులలో విజ్ఞానాభిలాషను పెంపొందిస్తాయని, యిలాంటి విజ్ఞాన దాయకమైన కార్యక్రమాలు చేపడుతున్నందుకు యు.టి.యఫ్. ఎంతైనా అభిందనీయమని వస్తు ప్రదర్శన విభాగాన్ని ప్రారంభిస్తూ గుంటూరుజిల్లా విద్యాశాఖాధికారి శ్రీ భీమశంకరశాస్త్రిగారు పేర్కొన్నారు.

అనంతరం చిత్ర ప్రదర్శన విభాగాన్ని ప్రారంభించిన యు.టి.యఫ్. రాష్ట్ర అధ్యక్షులు శ్రీ డి. రామిరెడ్డిగారు ఉపాధ్యాయులలో వివిధ కళానైపుణ్యాలకు ప్రోత్సహించడం, తద్వారా విద్యార్థులలో అణిగిమణిగి వున్న సృజనాత్మకతను ప్రోత్సహించడం యు.టి.యఫ్. తన కర్తవ్యంగా భావిస్తుందని చెప్పారు.




అధ్యక్షోపన్యాసం చేస్తున్న శ్రీ డి.రామిరెడ్డి

పరిసరాల పరిశుభ్రత, ఆరోగ్య పరిరక్షణకు తీసుకొనవలసిన జాగ్రత్తలు బోధనలో అంతర్భాగాలుగా వుండాలని, కాని ఈనాటి పాఠశాలల్లో కనీస వసతులు లేక పోవడం వలన వీటిని వల్లెవేయడమే జరుగుతుందని, ఉపాధ్యాయులు పరిసరాల పరిశుభ్రత ఆరోగ్య పరిరక్షణకు సంబంధించిన అంశాలకు అవసరమైన పరికరాలను రూపొందించి ప్రదర్శించడం ప్రయోజనకరమని ఆరోగ్యప్రదర్శన విభాగాన్ని ప్రారంభిస్తూ యు.టి.యఫ్. రాష్ట్ర కార్యదర్శి శ్రీ వి. బాలసుబ్రహ్మణ్యం చెప్పారు.

సైన్సు సాధించిన విజయాలు సంపన్నులకే చేరుతున్నాయని, వాటిని సామాన్యులకు కూడా అందుబాటులోకి తీసుకొనిరావాలని, సామాన్యుడి కోసం సైన్సు అనే దృక్పథం వుండడం వలననే యు.టి.యఫ్. యిలాంటి ప్రదర్శనను నిర్వహిస్తుందని సైన్సు ప్రదర్శన విభాగాన్ని ప్రారంభిస్తూ తమిళనాడు ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు శ్రీ వై.వి.సుబ్బారావుగారు చెప్పారు.

### స్వాగత ద్వారాలు

బస్ స్టేషన్ నుండి జిన్నాటవర్, హిందూ కాలేజి, వెంకటేశ్వర విజ్ఞానమందిరం, ఎ.సి.కాలేజి (మైనేని నగర్) వరకు గల మార్గమంతటను, మరియు పట్టణంలోని వివిధ కూడళ్ళ వద్దనూ

# వస్తు, వైజ్ఞానిక, క్రీడా వర్క్‌షాప్ దృశ్యాలు



















యు.టి.యఫ్. బేనర్లు, జెండాలు, తోరణాలతో అలంకరించడంతో నగరమంతటా పండుగవాతావరణం అలముకొన్నది. ఎ.సి. కాలేజి (బ్రైనేనినగర్), వెంకటేశ్వర విజ్ఞానమందిర్ (సూర్యనారాయణరాజునగర్), హిందూకాలేజి (సీతారామాచారినగర్)ల ముందు అందంగా అలంకరించబడిన స్వాగత ద్వారాలు అందరినీ విశేషంగా ఆకర్షించాయి.



కార్యదర్శి నివేదిక ప్రవేశపెడుతున్న శ్రీ ఎ.వెంకటస్వామి

## ప్రారంభసభ

నూతన ఆర్థిక పారిశ్రామిక విధానాలలో భాగంగానే విద్యారంగాన్ని ప్రైవేటీకరించేందుకు పెద్ద ఎత్తున పాలకవర్గాలు ప్రయత్నాలు సాగిస్తున్నాయని పశ్చిమబెంగాల్ ఉన్నత విద్యాశాఖ మంత్రి ప్రొఫెసర్ సత్యసాదనచక్రవర్తి గుంటూరులో యు.టి.యఫ్. ఆరవ విద్యా వైజ్ఞానిక మహాసభలను ప్రారంభిస్తూ చెప్పారు. దేశ ఆర్థిక రంగాన్ని ఐ.యం.ఎఫ్. ఆదేశాల మేరకు విదేశీ సంస్థలకు స్వదేశీగుత్త పెట్టుబడి దార్లకు కట్టబెడుతున్న మాదిరిగానే విద్యను కూడా వాణిజ్య వేత్తలకు కట్టబెట్టే ప్రయత్నాలు ప్రారంభమయ్యాయని ఆయన హెచ్చరించారు. ఆర్థిక విధానాల నుండి వేరుచేసి విద్యా విధానాలను చూడరాదని గత అనుభవాలు రుజువు చేశాయని ఆయన అన్నారు.



ఎగ్జిబిషన్ ప్రారంభిస్తున్న డి.ఇ.ఒ. శ్రీ భీమశంకరశాస్త్రి

విద్యని ప్రాథమిక హక్కుగా యిటీవలే సుప్రీం కోర్టు ఒక తీర్పులో పేర్కొన్నదని అయినప్పటికీ మరోవైపు జనార్థనరెడ్డి, వీరప్ప మొయిలీ కమిటీల ద్వారా విద్యని ప్రైవేటీకరించేందుకు ప్రభుత్వం పూనుకొన్నదని చెప్పారు. ఈ కమిటీల సిఫార్సులు అమలులోకి వస్తే, ఉపాధ్యాయుల నియామకం, తొలగింపు లాంటి అన్ని హక్కులు పంచాయతీలకు దఖలు పడతాయని అన్నారు. పంచాయతీ సంస్థలలో ఎక్కువభాగం భూస్వాములు వారి తాబేదార్లు యితర అసాంఘిక శక్తుల చేతుల్లో వున్నందున ఈ ప్రతిపాదన ఎంత ప్రమాదకరమైనదో ఆలోచించవలసిందిగా ఆయన కోరారు. ఒకవేళ ఈ సిఫార్సులే అమలులోకివస్తే కొంతకాలానికి విద్యా సంస్థలు కూడా ఖాయిలా పడతాయని, ఉపాధ్యాయులకు 'గోల్డెన్ హేండ్‌షేక్' యిచ్చి ఉద్వాసన చెప్పే పరిస్థితి వస్తుందని హెచ్చరించారు.

ఉపాధ్యాయులు కేవలం పాఠ్య పుస్తకాలలోని పాఠాలను బోధించడానికి పరిమితం గాక సామాజిక పరిస్థితులను అధ్యయనం చేయాలని, మతోన్మాదం వేర్పాటు వాదం సామ్రాజ్యవాదుల ప్రవేశం లాంటి వాటికి వ్యతిరేకంగా తమవంతు కర్తవ్యాన్ని నిర్వహించాలని శ్రీ చక్రవర్తి కోరారు. ప్రారంభ సభకు యు.టి.యఫ్. అధ్యక్షులు శ్రీ డి. రామిరెడ్డి అధ్యక్షతవహించారు. శ్రీ రామిరెడ్డి మాట్లాడుతూ విద్యారంగానికి పెట్టే పెట్టుబడి సామాజికాభివృద్ధికి పెట్టే పెట్టుబడి అని, అది దీర్ఘకాలిక ప్రయోజనాలను సమకూర్చి పెడుతుందిగాని తక్షణ లాభాలను కాదని, అందువలన మనం మంచి సమాజాన్ని నిర్మించుకోవాలంటే విద్యారంగానికి నిధులను పెంచాలని చెప్పారు. కొన్ని రాష్ట్రాలలో పాఠ్యాంశాలలో మతతత్వాన్ని జొప్పించి ప్రాథమిక స్థాయి నుండి విద్యార్థులను మతఛాందసులను చేసే ప్రయత్నాలు విషఫలితాలనిస్తాయని ఆయన చెప్పారు.



సందేశమిస్తున్న సి.ఐ.టి.యు. నాయకులు శ్రీ కొండ్రగుంట వెంకటేశ్వర్లు

యు.టి.యఫ్. 6వ విద్యా వైజ్ఞానిక మహాసభల ఆహ్వాన సంఘాధ్యక్షులు డాక్టర్ చిగురుపాటి నాగేశ్వరరావు స్వాగతోపన్యాసం చేశారు. స్వాతంత్ర్య పోరాటంలో పన్నుల నిరాకరణలు పలనాటి కన్నెగంటి హనుమంతు, చీరాల - పేరాలలో దుగ్గిరాల గోపాల కృష్ణయ్యలతో ప్రారంభమయ్యాయని, అంటే సహాయ నిరాకరణోద్యమము గుంటూరులోనే ప్రారంభమయ్యిందని, కళలకు కాణాచి, విద్యకి పుట్టినిల్లు, సాహిత్యానికి పట్టుగొమ్మ అయిన గుంటూరులో జరుగుతున్న మహాసభల ప్రతినిధులకు స్వాగతం పలికే అవకాశం లభించినందులకు చాలా ఆనందంగా వుందని చెపుతూ గుంటూరుజిల్లాలో జరుగుతున్న మహాసభలలో చేసే నిర్ణయాలు భవిష్యత్‌కు బాటలు వేసేవిగా వుండాలని ఆకాంక్షించారు. ఉద్యమ పతాకాన్ని ఎగురవేసిన సీనియర్ నాయకులు శ్రీ యం. రాయన్న ప్రసంగిస్తూ ఉపాధ్యాయులు వృత్తి పరమైన సమస్యలకే గాక సామాజిక స్పృహతో పనిచేస్తూ సమాజ పురోగతికి తోడ్పడేలా వారిని చైతన్యవంతులను చేయడం యు.టి.యఫ్. లక్ష్యమని, కాబట్టి ఉపాధ్యాయులు ఉద్యమ సాంప్రదాయాలను నిలబెడుతూ మునుముందుకు సాగాలని ఆయన కోరారు.

బంద్‌లు యితర అడ్డంకులను అధిగమించి రాష్ట్ర వ్యాప్తంగా గల అన్ని జిల్లాల నుండి మహాసభలకు వచ్చిన ప్రతినిధులకు,

నాయకులకు ధన్యవాదాలు తెలియజేసి, మూడురోజుల కార్యక్రమాలలో పాల్గొని మహాసభలను జయప్రదం చేయవలిసిందిగా గుంటూరు జిల్లా శాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ వి.విశ్వనాథం కోరారు.

ఆ సాయంత్రం జరిగిన ప్రతినిధుల సభలో అధ్యక్షవర్గ, సారధ్యసంఘ, అర్హతల సంఘ ఎన్నికలు జరిగాయి.




అధ్యక్ష వర్గ ప్రకటనలు చేస్తున్న పోలిశెట్టి

**అధ్యక్షవర్గం:** శ్రీయుతులు డి.రామిరెడ్డి, జి.లక్ష్మయ్య, యస్.ఆర్.పోలిశెట్టి, కె.భద్రయ్య, యస్.ఆనందనాయుడు, యస్.విజయకుమార్, టి.అంజిరెడ్డి, కె.కేశవరెడ్డి.

**సారధ్యసంఘం:** శ్రీయుతులు ఎ.వెంకటస్వామి, వి.బాలసుబ్రహ్మణ్యం, యం.నరహరి, పి.కృష్ణమూర్తి, కె.జోజయ్య, యం.ఎ.కె.దత్తు, వి.విశ్వనాథం, పి.మహేశ్వరరావు.

**అర్హతలసంఘం:** శ్రీయుతులు యన్.రామకోటేశ్వరరావు, జి.చిట్టిబాబు, యం.రాయన్న, కె.ఆదినారాయణ, డి.కొండాచారి, కె.కృష్ణయ్య, పి.రాజమౌళి, సిహెచ్.సుభాస్‌చంద్రబోస్, యన్.రమణయ్యశాస్త్రి.

ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ.వెంకటస్వామి సంఘ నివేదికను ప్రవేశపెడుతూ నెల్లూరు మహాసభల నుండి గుంటూరు మహాసభల వరకు ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ సాధించిన అభివృద్ధిని, ఈ మధ్యకాలంలో సంభవించిన జాతీయ అంతర్జాతీయ పరిణామాలు,



ఉపన్యసిస్తున్న శ్రీ వై.శివాజీ ఎం.పి.,

అవి సమాజంపైన, విద్యారంగంపైనా, మన సంఘంపై చూపిన ప్రభావం, ఈ కాలంలో సాగించిన ఉద్యమ కార్యకలాపాలను, సాగించిన పోరాటాలను, సాధించిన ఫలితాలను సామాజిక స్ఫూర్తిని కలిగించేందుకు నడిపిన ఉద్యమ తరగతులను సమీక్షించారు. ఆర్థిక నివేదికను కూడా సమర్పించారు.

ఐక్య ఉపాధ్యాయ పత్రిక ప్రధాన సంపాదకులు శ్రీ కె.కేశవరెడ్డి ఉద్యమవాణి అయిన 'ఐక్య ఉపాధ్యాయ' పత్రిక నివేదికను సమర్పిస్తూ పత్రిక వివిధ శీర్షికలతో ఉపాధ్యాయులను ఆకట్టుకొంటూ 20 వేల సర్క్యులేషన్‌తో పురోగమిస్తున్నదని చెప్పారు.

### బహిరంగసభ

ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ సూత్రబద్ధవైఖరితో పురోగమిస్తున్న ప్రజాసంఘమని, వివిధ రాజకీయ పార్టీల అభిప్రాయవేదికగా ఈ సదస్సును నిర్వహించడం ముదావహమని, బతుకలేని బడి పంతుళ్లకు ఒక సంఘాన్ని స్థాపించి వారికి బతుకుబాట చూపించిన అమరజీవి చెన్నుపాటి లక్ష్మయ్య ఆశయాల బాటలో ఉద్యమాన్ని ముందుకు తీసుకొని పోయిన ధన్యజీవులు సుబ్బరాజు, మైనేని, సీతరామాచారి, సూర్యనారాయణరాజులని ప్రజాశక్తి సంపాదకులు, పార్లమెంటు సభ్యులు శ్రీ మోటూరు హనుమంతరావు యు.టి.యఫ్. 6వ విద్యావైజ్ఞానిక మహాసభల సందర్భంగా ఏర్పాటు చేసిన బహిరంగసభలో ప్రసంగిస్తూ చెప్పారు. ఆయన తన ప్రసంగాన్ని కొనసాగిస్తూ ఉపాధ్యాయులు వివిధ రాజకీయాభిప్రాయాలు కలిగి వున్నప్పటికీ ఈనాడు దేశాన్ని పట్టిపీడిస్తున్న లంచగొండి విధానం, నూతన ఆర్థిక పారిశ్రామిక విధానాలు, మతవైషమ్యాలు లాంటి సమస్యలను నిశితంగా అధ్యయనం చేసి మతసామరస్యం, సామాజిక న్యాయం వర్ధిల్లే సమైక్య భారతదేశం కొరకు కృషి చేయవలసిన బాధ్యత వారిపై వున్నదని పేర్కొన్నారు.



వైజ్ఞానిక ప్రదర్శనలు ప్రారంభిస్తున్న సినీనటులు శ్రీ అల్లురామలింగయ్య

బహిరంగసభ యు.టి.యఫ్. అధ్యక్షులు శ్రీ డి.రామిరెడ్డి అధ్యక్షతన జరిగింది. ఉపాధ్యాయుల వృత్తిపరమైన సమస్యలకే పరిమితంగాక ఉపాధ్యాయులను విద్యార్థులను తద్వారా మొత్తం సమాజాన్ని చైతన్యవంతం చేసే కార్యక్రమాలను యు.టి.యఫ్ చేపడుతుందని, అందువలనే అచిరకాలంలోనే అందరి మన్ననలు పొంది పురోగమించగలుగుతుందని శ్రీ రామిరెడ్డి పేర్కొన్నారు.

సి.పి.ఐ. రాష్ట్ర కమిటీ కార్యవర్గ సభ్యులు శ్రీ ఈడ్పుగంటి నాగేశ్వరరావుగారు ప్రసంగిస్తూ భారతదేశం ప్రాచీన నాగరికత విలిసిల్లిన దేశమని, విద్య, విజ్ఞానాలకు కేంద్రంగా భాసిల్లిన దేశమని, కాని నేడు పాలకవర్గాలు అనుసరించే విధానాల కారణంగా విద్య విజ్ఞానం సామాన్యులకు అందుబాటులో లేకుండా పోతున్నాయని, సంపన్నులకు సామాన్యులకు మధ్య గల అంతరము రోజురోజుకి పెరిగిపోతున్నదని, ప్రభుత్వం అనుసరిస్తున్న ప్రైవేటీకరణ కారణంగా యింకా పెరిగిపోతుంది గనుక మేధావులైన ఉపాధ్యాయులు ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా పోరాడవలసిన అవసరముందని చెప్పారు.

ఆంధ్రప్రదేశ్ సహకార శాఖామాత్యులు శ్రీ కన్నా లక్ష్మీనారాయణగారు ప్రసంగిస్తూ ప్రభుత్వరంగంలో వచ్చే నష్టాలను దృష్టిలో వుంచుకొని ప్రైవేటైజేషన్ దిశగా ఆలోచనలు చేయవలసి వస్తుందన్నారు. ఆయన తన ప్రసంగాన్ని కొనసాగిస్తూ ఈనాడు

# మహా ప్రదర్శన ఊరేగింపు దృశ్యాలు

















విద్యార్థులు, యువకులు పెడమార్గాలు పడుతున్నారని, హింస, దౌర్జన్యాలకు దిగుతున్నారని, వారిలో మంచి భావాల బీజాలు వేసి మంచి మార్గంలో నడిపించవలసిన బాధ్యత ఉపాధ్యాయులపై వున్నదని పేర్కొన్నారు.



ఆరుద్రకు శాలువకప్పుతున్న హిజ్ ఎక్సలెన్సీ కృష్ణకాంత్

పార్లమెంటు సభ్యులు, డాక్టర్ వై.శివాజీ ప్రసంగిస్తూ రాష్ట్రం సాలీనా 1600 కోట్లు విద్యపై ఖర్చుపెడుతున్నప్పటికీ ఆశించిన ప్రయోజనాలు సాధింపబడడం లేదని, 50 శాతం కంటే పరీక్షా ఫలితాలు రావడం లేదని చెప్పారు. ఇంకను మంచి ఫలితాలు సాధించేందుకు ఉపాధ్యాయులు కృషి చేయాలని చెప్పారు.

సి.ఐ.టి.యు. నాయకులు శ్రీ కొండ్రగుంట వెంకటేశ్వర్లు ప్రసంగిస్తూ కేంద్ర ప్రభుత్వం అనుసరిస్తున్న నూతన ఆర్థిక, పారిశ్రామిక విధానాల కారణంగా నష్టపోతున్నది కేవలం కార్మికులే కాదని, సాధారణ ప్రజానీకం మొత్తం యిబ్బందులకు గురవుతున్నారని చెప్పారు. సమాజం సంక్షేమంలోనే ఉపాధ్యాయుల సంక్షేమం యిమిడివుందని, కాబట్టి మేధావులుగా ఉపాధ్యాయులు పరిస్థితులను అధ్యయనం చేసి సామాన్య ప్రజానీకం చేపట్టే ప్రతి ఉద్యమానికి చేయూత నివ్వాలని ఆయన ఉపాధ్యాయులకు విజ్ఞప్తి చేశారు.



ప్రసంగిస్తున్న శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య

రాష్ట్ర కార్యదర్శి శ్రీ పి.కృష్ణమూర్తి వందన సమర్పణతో బహిరంగసభ ముగిసింది.

## ప్రజాచైతన్యసభ

ప్రైవేటు పబ్లిక్ రంగాలు విఫలమవుతున్న ప్రస్తుత తరుణంలో జాతిపురోగతికి ఉపాధ్యాయులు మహాత్మాగాంధీ బోధించిన ధర్మకర్తృత్వ పద్ధతిని అనుసరించాలని గవర్నర్ శ్రీ కృష్ణకాంత్ ఉద్బోధించారు. యు.టి.యఫ్. ఆరవ విద్యావైజ్ఞానిక మహాసభల రెండవ రోజున అనగా ఆగస్టు 9 ఉదయం మైనేని నగర్‌లో జరిగిన ప్రజాచైతన్య సభలో గవర్నర్ ముఖ్య అతిథిగా పాల్గొని ప్రసంగించారు. విద్యార్థుల మనసులను ఆలోచనలను ఏకం చేసే విద్యాబోధనలో నూతన ప్రమాణాలను నెలకొల్పాలని గవర్నర్ సూచించారు. జాతీయతా వాదం స్ఫూర్తి నశించి నానాటికి ప్రాంతీయ, కులతత్వాలు పెరిగిపోతున్నందుకు గవర్నర్‌గారు ఆవేదన వ్యక్తం చేశారు. గ్రామసీమలలో ధనవంతులు వారి బిడ్డల చదువులకు పట్టణాలకు వస్తున్నారని, భూమి భుక్తి లేని వారి పిల్లలు మాత్రం ప్రభుత్వ పాఠశాలలలో చదువుతున్నారని అన్నారు. గ్రామీణ ప్రాంతాలలో ఒక ఉపాధ్యాయుడు 70 నుంచి 150 మంది పిల్లలకు చదువు చెప్పవలసి వస్తుందని దీనిని సవాలుగా స్వీకరించాలని ఆయన కోరారు. మనదేశానికి ఎంతో గొప్ప చరిత్ర వున్నదనే విషయాన్ని విద్యార్థులకు వివరించాలని, అంతేగాక దేశంలో అవినీతి, లంచగొండితనం వంటి సమస్యలపై పోరాడేందుకు విద్యార్థులను సన్నద్ధం చేయాలని గవర్నర్ ఉద్బోధించారు.

సభకు అధ్యక్షత వహించిన యు.టి.యఫ్. రాష్ట్ర కార్యదర్శి శ్రీ వి.బాలసుబ్రహ్మణ్యం ప్రసంగిస్తూ యు.టి.యఫ్. కార్యకర్తలు ఉపాధ్యాయుల సమస్యలపైనేగాక జనవిజ్ఞాన వేదిక కార్యక్రమాలలోను, 'సామాన్యుడి కోసం సైన్సు' ఉద్యమంలోను "అక్షరాస్యత



సాహిత్య సదస్సుకు అధ్యక్షత వహించిన శ్రీ వి.బాలసుబ్రహ్మణ్యం

ఉద్యమం"లోను, సారా వ్యతిరేక ఉద్యమంలోను చురుకుగా పనిచేస్తున్నారని అలా పనిచేయడానికి యు.టి.యఫ్.కి గల సామాజిక స్పృహలక్ష్యమే కారణమని చెప్పారు.

సభలో పాల్గొన్న ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు, పద్మభూషణ్ శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య మాట్లాడుతూ ఎందరో మాన్యులూ, సామాన్యులు, తమ సర్వస్వం త్యాగం చేసి పోరాడటం ద్వారానే దేశానికి స్వాతంత్ర్యాన్ని సిద్ధించిందనీ, కాని ఆనాటి విలువలు నేటి సమాజంలో లోపించాయని ఆవేదన వ్యక్తం చేశారు. ఆయన తన ప్రసంగాన్ని కొనసాగిస్తూ సమాజం బాగుపడుతుందనే విశ్వాసం తనకున్నదనీ, జ్ఞానం చైతన్యం మానవత్వంతో కూడిన సమాజాన్ని నిర్మించడం సాధ్యమేనని అందుకు ఉపాధ్యాయులు కృషి చేయాలని పిలుపునిచ్చారు.

సారా మహమ్మారిని పారతోలనిదే సమాజం బాగుపడదని, జనవిజ్ఞాన వేదిక కార్యదర్శి శ్రీ వి.లక్ష్మణరెడ్డి స్పష్టం చేశారు. సారాయిని నిషేధించినంత మాత్రాన లక్ష్యం నెరవేరదని, సారాతో పాటు, బ్రాందీ, విస్కీలాంటి మద్యాలను కూడా నిషేధించేవరకు జనవిజ్ఞాన వేదిక పోరాటం కొనసాగిస్తుందని చెప్పారు.

ప్రముఖకవి, సాహితీవేత్త అయిన శ్రీ ఆరుద్రగారిని గవర్నర్ శ్రీ కృష్ణకాంత్ దుశ్శాలువతో సన్మానించారు.

ఈసభలో గవర్నర్ సతీమణి శ్రీమతి సుమన్ కృష్ణకాంత్,

అఖిల భారత రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల ఫెడరేషన్ ప్రధాన కార్యదర్శి మరియు పార్లమెంటు సభ్యులు శ్రీ సుకోమల్‌సేన్, పార్లమెంటు సభ్యులు శ్రీ వై.శివాజి, గుంటూరు జిల్లా కలెక్టర్ అజేంద్రపాల్ తదితరులు పాల్గొన్నారు.




మహిళా సదస్సుకు అధ్యక్షత వహించిన శ్రీమతి సి.కమలకుమారి

## మహాప్రదర్శన

అరుణారుణ కాంతి పుంజల్లా, దూకుతున్న సెలయేరులా మొదలయి, తరువాత మైదాన ప్రాంతంలో ప్రవహిస్తున్న నదిలా, ఆ తరువాత ఉవ్వెత్తున కెరటాలతో హోరెత్తే సాగరరూపం దాల్చింది మహాప్రదర్శన. మైనేని నగర్ నుండి రోడ్డు మీదకి సాగేటప్పుడు సెలయేరులా కన్పించింది. అందరూ రోడ్డు మీదికి వచ్చిన తరువాత మహానది గోదావరిలా తోచింది. నాలుగువైపుల నుండి ఉపాధ్యాయులు ప్రదర్శనలో చేరడంతో నదులన్నీ కలిసిన సంద్రమే అయింది.

ఉవ్వెత్తు కెరటాల్లా ఎగసే నినాదాలు; బారులుతీరిన పదివేల మందికిపై గా ఉపాధ్యాయునీ, ఉపాధ్యాయులు; ప్రతివాని చేతిలో జెండా; ప్లేకార్డు, బేనరు. రోడ్డుపైన నిలిచి చూసేవారికి అంతం లేని ప్రవాహంలా, ఆదిమధ్యాంతరహితమైన కాలంలా తోచింది మహాప్రదర్శన.




మహిళా సదస్సులో మాట్లాడుతున్న శ్రీమతి పుణ్యవతి

సమస్యలకే పరిమితమైన నినాదాలుగాక నిరక్షరాస్యత, నిరుద్యోగాలను నిర్మూలించాలని, శాస్త్రీయ విద్యని ప్రవేశపెట్టాలని, అధిక ధరలను అరికట్టాలని, అవినీతి ఆక్రమాలు రెడ్‌టేపిజం నశించాలని చేసిన నినాదాలు సాధారణ ప్రజానీకాన్ని విశేషంగా ఆకర్షించాయి. వారువారు చేస్తున్న పనిపాటల్ని ఆపి, వారివారి సమస్యలకు కూడా పరిష్కారం యిలాంటి ఉద్యమాలలో కనిపిస్తాయనే ఆశతో ఆసక్తితో మహాప్రదర్శనను తిలకించారు. నినాదాలను ఆలకించారు. తెలంగాణా జిల్లాల నుండి వచ్చిన ప్రతినిధులు యిచ్చిన నినాదాలు ఉస్తాద్‌నహీ-తాలీమ్ నహీ, దునియాకే ఉస్తాద్ ఏక్‌హై; హమారే మాంగే లేకే రహేంగే, కైసాలేంగే-లడకే లేంగే, కైసా లడేంగే-మిలికే లడేంగే, ఆవాజ్‌దో-హమ్ ఏక్ హై లాంటి నినాదాలు ప్రజల్ని విశేషంగా ఆకర్షించాయి. కొన్నిచోట్ల వారూ గొంతు కలిపారు.

మహాసభల పెద్ద బేనరు పట్టుకొని రాష్ట్ర నాయకత్వం ముందు నడిచింది. రాజమండ్రి మహాసభల నుండి నెల్లూరు మహాసభల వరకు జరిగిన మహాసభలను ప్రతిబింబిస్తూ ఆయా జిల్లాల ముఖ్య కార్యకర్తలు పెద్ద జెండాలను చేబూని వెంట కదిలారు. ఆ వెనుక వివిధ జిల్లాల బేనర్లు పట్టుకొని ప్రతినిధులు మహా ప్రవాహంలా సాగారు. మహాప్రదర్శన ఒక పాయింటు దాటిపోవడానికి గంటకు పైగా పట్టింది.

ఉపాధ్యాయ ఉద్యమంలో యు.టి.యఫ్.కు గల ప్రతిష్ఠకి విశిష్టతకి అద్దం పట్టింది ఈ మహాప్రదర్శన.

## సాహిత్యసదస్సు

నిజమైన కవులు శ్రామికపక్షపాతం చూపుతారని, తమ రచనలను ప్రజల వద్దకు తీసికెళతారని ప్రముఖ కవి, సుప్రసిద్ధ




మహిళాసదస్సులో మాట్లాడుతున్న శ్రీమతి సోనియాగుప్త

సాహితీవేత్త, విమర్శకుడు శ్రీ ఆరుద్ర సాహితీ సదస్సును ప్రారంభిస్తూ చెప్పారు. సాహిత్యం సంపన్నులకు మాత్రమే పరిమితమై యున్న కాలంలో సమాజంలో వ్యవస్థితమై వున్న కుళ్ళును ఎత్తి చూపి, ప్రజలను చైతన్యపరచే విధంగా వారికర్థమయ్యే భాషలో, చెప్పి సామాన్య ప్రజల మధ్యకి కవిత్వాన్ని తీసుకొని వెళ్ళిన వేమన; భాషలో భావంలోనేగాక ప్రక్రియాపరంగా కూడా ఆంధ్ర సాహిత్యానికి ఆధునికతను చేకూర్చిన గురజాడ; ఆకాశపు దారులంట హడావిడిగా వెళ్ళిపోయే కవితారథాన్ని భూమార్గం పట్టించి, భూకంపం పుట్టించి, పీడిత తాడిత అధోజగత్సహోదరుల ఆశలకు ఆలోచనలకు ఆకారం కల్పించిన శ్రీ శ్రీ ప్రజాకవులు; మహాకవులని, అలాంటి మహాకవులు సృష్టించిన మంచి సాహిత్యాన్ని అధ్యయనం చేసి, బిడ్డలలో ఉత్తమ సాహిత్యాభిలాషను కలిగించగలగడం ఉపాధ్యాయులకు మాత్రమే సాధ్యపడుతుందని ఆరుద్ర అన్నారు. బిడ్డలకు విద్యాబుద్ధులు నేర్పాలనే తహతహగల గురువులు కావాలిగాని ద్రోణాచార్యుల లాంటి దొంగ గురువులు సమాజానికి అవసరం లేదని చెప్పారు. బిడ్డలకు, సమసమాజానికి అవసరమైన విద్యాబుద్ధులను నేర్పించాలని ఆరుద్ర ఉపాధ్యాయులకు హితవు చెప్పారు.

సదస్సు ఐక్య ఉపాధ్యాయ పత్రిక ప్రధాన సంపాదకులు శ్రీ కె.కేశవరెడ్డి అధ్యక్షతన జరిగింది. గనిలో పనిలో కార్ఖానాలో నిరంతరం శ్రమిస్తూ, తమ చెమటతో రక్తంతో సమాజం మూలాన్ని

తడుపుతూ ధనం పంటలు పండించే కార్మిక కర్షక జనావళి అభ్యుదయం కొరకు కలం పట్టిన తొలితరం కవులలో ఆరుద్ర ప్రముఖులని కేశవరెడ్డి చెప్పారు. అస్తవ్యస్తంగా వున్న వ్యవస్థ స్వభావాన్ని, అలాంటి వ్యవస్థలో సైన్సు, గణితం, విద్య, విజ్ఞానం నిర్వహించే పాత్రను వివరించి, శాస్త్ర విజ్ఞానంతో సామాన్యుడు పురోగమిస్తే సాధించే ఫలితాలనూ ఆరుద్ర కవిత్వం నుండి సోదాహరణంగా వివరించారు.



సందేశమిస్తున్న ఎన్.జి.ఓ నాయకులు శ్రీ సాంబిరెడ్డి

యు.టి.యఫ్. కార్యదర్శి శ్రీ యం.నరహరి ప్రసంగిస్తూ ఆరుద్ర ఆంధ్ర సాహిత్యానికి చేసిన సేవలను సోదాహరణంగా వివరించారు. ఆంధ్రుల-సంస్కృతి సాంప్రదాయాలను తెలుగు కవిత్వం వివిధ కాలాలలో అభివృద్ధి చెందిన తీరుతెన్నులను వివరిస్తూ ఆరుద్ర ఒక్క చేతిమీదుగా సమగ్రాంధ్ర సాహిత్యాన్ని రచించి ఎనలేని సేవలు చేశారని నరహరి వివరించారు. సరళమైన పదజాలంతో ఆలోచనలను రేకెత్తించే భావాలను ఆరుద్ర కవిత్వం నుండి ఉటంకించి వివరించారు.

## ఉపాధ్యాయినుల సదస్సు

కేబుల్ టి.వి. ద్వారా పాశ్చాత్య సంస్కృతి దిగుమతి అవుతున్నదని, ఈ సంస్కృతి మహిళలను కించపరచే సంస్కృతియని, దీని యొక్క దుష్ప్రభావం సమాజంలోని అన్ని రంగాలపై పడుతుందని ఆల్ ఇండియా వర్కింగ్ ఉమెన్ కన్వీనర్, పార్లమెంటు సభ్యురాలు శ్రీమతి మాలినీభట్టాచార్య మహిళా ఉపాధ్యాయినుల సదస్సును ప్రారంభిస్తూ చెప్పారు. స్వాతంత్ర పోరాటకాలంలో ఉప్పును తయారుచేయడం జాతీయ భావాలకు చిహ్నంగా పరిగణింపబడిందనీ, కాని స్వతంత్ర్య భారతదేశంలో ఉప్పును తయారు చేసేందుకు అదీ గాంధీజీ పాదయాత్ర




సందేశమిస్తున్న ఆక్టా నాయకులు శ్రీ ఎం.జి.మాణిక్యరావు

జరిపిన గుజరాత్ సముద్రతీరాననే ఒక విదేశీ బహుళజాతి సంస్థకు అనుమతి యివ్వడం చాలా విచారకరం అన్నారు. ఆమె తన ఉపన్యాసాన్ని కొనసాగిస్తూ అక్షరాస్యత మహిళలకు నూతన శక్తినిచ్చిందని, సారా వ్యతిరేక ఉద్యమంలో శక్తివంతంగా పాల్గొనేలా చేసిందని, విద్యావంతులైన మహిళలు ఉద్యమాలలో చురుకుగా పాల్గొని అసంఘటిత రంగంలో పనిచేస్తున్న స్త్రీలకు చేయూత నివ్వాలని చెప్పారు.

మహిళలు వారి బాల్యదశ నుండి కూడా 'కాదు', 'కూడదు' లాంటి నిషిద్ధాలతో ఆంక్షలతో పెంచబడుతున్నారని, ఈ ఆంక్షలు వారిలో చొరవను తగ్గిస్తున్నాయని, ప్రస్తుత సామాజిక వ్యవస్థలో ఎలాంటి విప్లవాత్మక మార్పులు రాకుండా యధాతథస్థితి కొనసాగేందుకు అవసరమైన చైతన్యాన్ని కలిగించే సాధనాలుగా ప్రచార సాధనాలు పనిచేస్తున్నాయని, కాబట్టి మహిళలు ముఖ్యంగా ఉపాధ్యాయినులు ఈ వాస్తవాలను అవగతం చేసికొని వృత్తిపరంగాను, సామాజికంగాను ఎదురయ్యేసమస్యల పరిష్కారం కొరకు చేపట్టబడే అన్ని ఉద్యమాలలోను భాగస్వాములు కావాలని రాష్ట్ర మహిళాసంఘ ప్రధాన కార్యదర్శి శ్రీమతి పుణ్యవతి కోరారు. మహిళలు కదిలితే ఉద్యమాలు విజయవంతమవుతాయని అందుకు నిదర్శనాలు అక్షరాస్యతా ఉద్యమం, సారా వ్యతిరేక ఉద్యమం అని వారు చెప్పారు.

సదస్సుకు అధ్యక్షత వహించిన యు.టి.యఫ్. కార్యవర్గ సభ్యురాలు శ్రీమతి సి. కమలకుమారి ప్రసంగిస్తూ సమాజంలో సగభాగంగా వున్న మహిళల శారీరక మేధాశక్తులను ఉత్పత్తి రంగానికి అనుసంధానం చేయకపోతే పురోగమనం సాధ్యపడదనే వాస్తవాన్ని యు.టి.యఫ్. గుర్తించి స్త్రీలను ఉద్యమాలలోనికి రప్పించే పూనికతో ఉపాధ్యాయినుల సదస్సు ఏర్పాటు చేసిందని చెప్పారు. ఉపాధ్యాయినులు ఇంటికి, బడికి పరిమితంగాక వారి సమస్యలను పరిష్కరించుకొనేందుకైనా ఉద్యమాలలోకి రావాలని కోరారు.



సందేశమిస్తున్న ప్రజానాట్యమండలి కార్యదర్శి శ్రీ శాంతారావు

మామిడిపూడి వెంకటరంగయ్య ఫౌండేషన్ డైరెక్టర్ శ్రీమతి శాంతాసిన్హా బాల కార్మికులు, వారు ఎదుర్కొంటున్న సమస్యల్ని గురించి ప్రసంగించారు. ఈ సంస్థ విద్యయొక్క ప్రాధాన్యతను గుర్తించి బాల కార్మికులను పాఠశాల విద్యవైపు మరల్చేందుకు కృషి చేస్తున్నదని, ఉపాధ్యాయులు బిడ్డలను ఆప్యాయంగా ఆదరిస్తూ చదువు చెప్పడం వలననే వారి కార్యక్రమాలు విజయవంతమవుతున్నాయని ఆమె చెప్పారు.

ఈ రోజు దేశ పురోగమనం ఒక మూల మలుపులో నున్నదని, దేశ స్వాతంత్ర్యాన్ని, స్వతంత్ర ఆర్థిక విధానాన్ని, స్వావలంబనను నిలబెట్టుకోవడమో పరాధీనం చేయడమో నిర్ణయించుకోవలసిన సమయంలో ఈనాటి భారతీయులున్నారని ఆక్టా నాయకులు మాజీ ఎం.ఎల్.సి. శ్రీ ఎం.జి.మాణిక్యారావు ప్రతినిధుల సభలో మాట్లాడుతూ చెప్పారు. దేశ భవిష్యత్తును తరగతి గదులలో రూపుదిద్దగల ఉపాధ్యాయులు ప్రస్తుత పరిస్థితిని నిశితంగా అధ్యయనం చేయాలని ఆయన కోరారు. భారతదేశం స్వాతంత్ర్యం సాధించిన నాటి నుండి అవలంబిస్తూ వచ్చిన ఆర్థిక పారిశ్రామిక విధానాలనుండి ప్రస్తుత ప్రభుత్వం పూర్తిగా వైదొలగి పరాధీనానికి దారితీసే నూతన ఆర్థిక పారిశ్రామిక విధానాలను చేపడుతున్నదని, ఈ కారణంగానే ప్రభుత్వ రంగంలో వున్న పరిశ్రమలు ప్రైవేటుపరం చేయబడుతున్నాయని, విద్యారంగాన్ని ప్రైవేటు పరం చేయాలనే ఆలోచన ఈ క్రమంలో అంతర్భాగమేనని, కాబట్టి ఈ ప్రభుత్వం అనుసరిస్తున్న నూతన ఆర్థిక

పారిశ్రామిక విధానాలకు వ్యతిరేకంగా పోరాడేందుకు బలమైన ఉద్యమాలు నిర్మించకుండా ప్రైవేటీకరణను అడ్డుకోనడం అసాధ్యమని ఆయన చెప్పారు. ఉపాధ్యాయులు పోరాడి ఎన్నో వృత్తి పరమైన సమస్యలు సాధించుకొన్నారని కాని ప్రస్తుతం వారి అస్తిత్వాన్ని కాపాడుకునేందుకు ఉద్యమాలు చేపట్టవలసిన సమయం వచ్చిందని శ్రీమాణిక్యారావు చెప్పారు.




సందేశమిస్తున్న ఎస్.ఎఫ్.ఐ.నాయకులు శ్రీ బి.వెంకట్

ఎ.పి.ఎన్.జి.ఓ. సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ సాంబిరెడ్డి సందేశమిస్తూ, యు.టి.ఎఫ్. అననుకూల పరిస్థితులలో కూడా ఇంతమందిని సమీకరించి, మహాసభలు దిగ్విజయంగా నడుపుతున్నందులకు అభినందనలు తెల్పుతూ, ప్రభుత్వ నూతన ఆర్థిక పారిశ్రామిక విధానాలు ఓడించే దానికి పి.ఆర్.సి. లోపాలు సవరించే దానికి కలిసి పోరాటం సాగించుదామని, ఉపాధ్యాయులకు విజ్ఞప్తి చేసింది. రాష్ట్ర ఎస్.ఎఫ్.ఐ. కార్యదర్శి శ్రీ బి.వెంకట్ సందేశమిస్తూ ఉపాధ్యాయులు, విద్యార్థులు అవినాభావ సంబంధం కలవారని, అనేక విషయాలలో కలిసి పనిచేస్తున్నామని, యు.టి.ఎఫ్. రాష్ట్రంలో బలమైనసంఘంగా పనిచేస్తున్నదని, విద్యారంగంలో తగుమార్పులకు మనం కృషి చేయాలని చెప్పారు.

రాష్ట్ర ప్రజానాట్యమండలి కార్యదర్శి శ్రీ శాంతారావుగారు సందేశమిస్తూ, మహాసభలు ఇంత దిగ్విజయంగా నిర్వహిస్తున్నందులకు అభినందనలు తెల్పారు. ఉపాధ్యాయులలో కూడా అనేకమంది కళాకారులు వున్నారని వారు అనేక సందర్భాలలో మాతో కలిసి పనిచేశారని, అక్షర కళాయాత్రలో వారి కృషి కొనియాడదగినదని తెల్పుతూ అభినందనలు తెలిపారు.

పిదప జరిగిన ఎన్నికలలో ఈ క్రింది కార్యదర్శి వర్గం, పత్రిక సంపాదక వర్గం, ఆడిట్ కమిటీ, కార్యవర్గం ఏకగ్రీవంగా ఎన్నికయ్యాయి.

**కార్యవర్గం:** అధ్యక్షులు శ్రీ డి. రామిరెడ్డి, ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి, అసోసియేట్ అధ్యక్షులు శ్రీ ఎన్. రామకోటేశ్వరరావు, కార్యదర్శులు శ్రీయుతులు జి. లక్ష్మయ్య, ఎస్.ఆర్. పోలిశెట్టి, కె. భద్రయ్య, యస్. ఆనందనాయుడు, యస్. విజయకుమార్, వి. బాలసుబ్రహ్మణ్యం, యం. నరహరి, పి. కృష్ణమూర్తి, కె. జోజయ్య, జి. చిట్టిబాబు, శ్రీమతి సి. కమలకుమారి, కె. కేశవరెడ్డి.

**సంపాదకవర్గం:** ప్రధాన సంపాదకుడు: శ్రీ కొమ్మారెడ్డి కేశవరెడ్డి, సంపాదకవర్గం: శ్రీ ఎ. వెంకటస్వామి, శ్రీ డి. రామిరెడ్డి, శ్రీ యం.ఎ.కె. దత్తు, శ్రీ యన్. నారాయణ.

**ఆడిట్ కమిటీ:** శ్రీ యం.ఎ.కె. దత్తు(కన్వీనర్) శ్రీ టి. కొండాచారి, శ్రీ కె. బ్రహ్మజీరావు.

**కార్యవర్గ సభ్యులు:** శ్రీయుతులు బి. మోహనరావు (శ్రీకాకుళం), యం. మురళీధరరావు (విజయనగరం), కె.యస్.ఎన్. శాస్త్రి (విశాఖపట్నం), కె. బ్రహ్మజీరావు (తూర్పుగోదావరి), సిహెచ్. సుభాష్‌చంద్రబోసు(పశ్చిమగోదావరి), పి. వెంకటేశ్వరరావు(కృష్ణ), వి. విశ్వనాథం(గుంటూరు), డి. లక్ష్మిరెడ్డి(ప్రకాశం), పి. బాబురెడ్డి (నెల్లూరు), కె. రామచంద్రారెడ్డి (చిత్తూరు), సి. కృష్ణంరాజు (కడప), యం. రంగస్వామి (కర్నూలు), యన్. శంకరనారాయణ (అనంతపురం), కె. కృష్ణయ్య(ఖమ్మం), పి. దామోదర్(వరంగల్), యస్. వేణు శ్రీ, (కరీంనగర్), యస్. శశికాంత్ (ఆదిలాబాద్), డి. ఓంప్రకాష్ (నల్గొండ), కె. రఘుపతిరెడ్డి (మహబూబ్‌నగర్), ఎం.ఆర్.రెడ్డి, (మెదక్), సి. పురుషోత్తంరాజు (నిజామాబాద్), పి. మాణిక్‌రెడ్డి (రంగారెడ్డి), ఎన్. రమణయ్యశాస్త్రి (హైదరాబాద్), శ్రీమతి పి. ఝాన్సీకుమారి, శ్రీమతి సి.వి. సుగుణ (మహిళా సభ్యులు) కార్యవర్గ సభ్యులుగా ఎన్నికైనారు.

## విద్యా వైజ్ఞానిక చిత్ర వస్తు ప్రదర్శనలు

యు.టి.యఫ్. రాష్ట్ర 6వ విద్యా వైజ్ఞానిక ప్రదర్శనలలో భాగంగా సీతారామాచారినగర్(హిందూకళాశాల)లో ఏర్పాటు చేసిన చిత్రవస్తు ప్రదర్శనలు మహాసభల ప్రతినిధులనే గాక పుర ప్రజల్ని విశేషంగా ఆకర్షించాయి.

ఈ ప్రదర్శనలో స్టాంపులు, నాణాలు, వాల్ డెకరేషన్స్, రంగు రంగుల చిత్రాలు, విద్యార్థులకు బోధించడానికి ఉపయోగపడే



వందన సమర్పణ చేస్తున్న శ్రీ వి.విశ్వనాథం

పరికరాలు, స్త్రీ సమస్యల్ని ప్రతిబింబించే వాల్ పోస్టర్లు, సైన్సు విజ్ఞానానికి సంబంధించిన అంశాలు చోటు చేసుకొన్నాయి.

వెనిగళ్ల జిల్లా ప్రజాపరిషత్ పాఠశాల వారు దారంతో, కోడిగ్రుడ్డు డొప్పలతో, టీతో, పప్పు దినుసులతో, తాటి ఈత ఈనెలతో, గవ్వలతో, పేక ముక్కలతో, కొబ్బరి చిప్పలతో కళాఖండాలను సృష్టించి ప్రదర్శించారు. రకరకాల పక్షులు, జంతువులు, దేశ నాయకుల స్టాంపులను ప్రదర్శించి పలువురిని ఆకర్షించారు. గురజాల అధ్యాపకులు శ్రీ కె.జె. చంద్రపాల్, నవరంగ్ చిత్రకళా నికేతన్ (వెల్లటూరు) వారు ఏర్పాటు చేసిన బాలల చిత్రకళా ప్రదర్శన ఆకర్షణీయంగానే గాక విజ్ఞాన పరమైన విలువలు గలది. ఈ ప్రదర్శనను శ్రీ వెల్లటూరు పూర్ణానందశర్మ ఏర్పాటు చేశారు. ఈ చిత్రాలు బిడ్డల భావనాశక్తికి, కల్పనా పటిమకు, కళానైపుణ్యానికి గీటురాళ్ళుగా వున్నాయి. వాతావరణ కాలుష్యం నివారణకు సంబంధించిన అంశాలను సెయింట్ జోసఫ్ స్కూలు విద్యార్థులు ప్రదర్శించారు. ఖమ్మంజిల్లావారు మైనంతో కళాత్మక వస్తువులు ప్రదర్శించారు.

గ్రామీణ వాతావరణాన్ని, ప్రకృతి దృశ్యాలను కళ్ళకు కట్టినట్లు చూపడమే కాక ఈ ప్రదర్శన జాతీయ సమైక్యత, మతసామరస్యాన్ని కూడా చాలాచక్కగా హృదయాలకు హత్తుకునేలా చెప్పగలిగింది.

ఆహ్వాన సంఘం వారు ప్రజా సంఘాల సహకారంతో వలంటీర్లను సమీకరించి వచ్చిన వేలాది మందికి ఉచిత భోజన, వసతి సౌకర్యాలు కల్పించి రాత్రింబవళ్ళు శ్రమించి అన్ని ఏర్పాట్లు చేశారు. మహాసభలు దిగ్విజయం కావడానికి అసలు కారకులు వీరు. ఎందరో దాతలు విరాళాలిచ్చి తోడ్పడ్డారు.

అన్ని పత్రికలు మహాసభల విశేషాల్ని యు.టి.యఫ్. కార్యక్రమాల తీరుతెన్నులను పతాక శీర్షికలతో ప్రచురించాయి. ఆకాశవాణి, దూరదర్శినివారు కూడా ప్రత్యేక శ్రద్ధతో సభల విశేషాల్ని ప్రసారం చేసి సహకరించారు.

ఈ విధంగా యు.టి.యఫ్. మహాసభ విద్యార్థులు, ఉపాధ్యాయులు మొత్తం విద్యారంగం ఎదుర్కొంటున్న సమస్యల్ని చర్చించింది. ఆలోచనలను రేకెత్తించే వైజ్ఞానిక ప్రదర్శనలు నిర్వహించింది. ఉత్సాహాన్నిఉఊపునే గాక, ఉద్యమ చైతన్యాన్ని పెంచే మహా ప్రదర్శన నిర్వహించింది. హక్కులు-బాధ్యతలు రెండు నేత్రాలని చాటి చెప్పింది. అధ్యయనం, అధ్యాపనం సామాజిక స్పృహ సూత్రాలు ఆచరణాంశాలని చాటి చెప్పింది. ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని రేకెత్తించింది. చైతాన్యాన్ని రగుల్కొల్పింది. జాతీయ సమైక్యత మతసామరస్యాలకు నిబద్ధులుగా వుండాలని నొక్కి చెప్పి దేశభక్తిని ప్రభోధించింది. 'జనంతోనే మనం' అనే విశాల దృక్పథాన్ని చాటి తన ప్రత్యేకతను నిలుపుకొన్నది. ఆశయాల కనుగుణమైన కర్తవ్యదీక్షకు పురికొల్పింది. పలు రాష్ట్రాల నుండి పలు ఉపాధ్యాయ సంఘాలకు చెందిన 10 లక్షల మందికి ప్రాతినిధ్యం వహించే సౌహార్ద్ర ప్రతినిధుల రాకతో దేశవ్యాప్త ప్రగతిశీల ఉద్యమానికి పునాది వేసింది.

యు.టి.యఫ్. మహాసభలకు ఒక ప్రత్యేకత వున్నది. రాజమండ్రి మహాసభకంటే ఖమ్మం మహాసభ, దానికంటే ఆ తరువాత మహాసభ... ఈ విధంగా యు.టి.యఫ్. పట్ల ఉపాధ్యాయుల ఆదరణ, మహాసభలకు వచ్చే ప్రతినిధుల సంఖ్య పెరుగుతూ వస్తున్నది. యు.టి.యఫ్. మహాసభల నిర్వహణకు ఏ హాలూ, ఏ ప్రాంగణం సరిపోని పరిస్థితి వచ్చింది. భవిష్యత్‌లో ప్రత్యేకంగా ప్రతినిధులందరికీ కనీస సదుపాయాలు సమకూర్చ గల ప్రాంగణం ఏర్పాటు చేసుకొంటేనే గాని మహాసభలు నిర్వహించలేని పరిస్థితి వస్తుంది. అలాగని సెలయేరులా దూకే యువకుల ఉత్సాహానికి అడ్డుకట్టవేయాలా! ఉవ్వెత్తున లేచే కెరటాలను ఆగమందామా!

ప్రతినిధులైన మూడు నాలుగు వేలమందికి పరిమితం చేద్దామా అనే ఆలోచనలు లేకపోలేదు. కాని నాల్గు సంవత్సరాల కొకసారి జరిగే ఈ పండుగలు, ఉద్యమ విశ్వరూపాన్ని వీక్షిస్తూ, ఉత్తేజం పొందే అవకాశం లేకుండా చేయడం ఎలా అనే అభిప్రాయమూ కలుగకపోలేదు.

మహాసభల జయప్రదానికి ఆర్థికంగానే గాక, వస్తురూపేణా వచ్చిన సహకారం గణనీయంగానే వున్నది. తూర్పుగోదావరి జిల్లా కార్యకర్తలు 2వేల కొబ్బరికాయలు, 2వేల అరటిఆకులు, 50 మామిడికాయలు తెచ్చారు. పశ్చిమగోదావరిజిల్లా ప్రతినిధులు 1వెయ్యి కొబ్బరికాయలు, 2వందల నిమ్మకాయలు, 2 బస్తాల కరివేపాకు తెచ్చారు. గుంటూరు జిల్లా తెనాలినుండి పురప్రముఖులు శ్రీనూకల రామకోటేశ్వరరావుగారు 10 క్వింటాళ్ళు, శ్రీ నూకల సాంబశివరావుగారు 4 క్వింటాళ్ళు, శ్రీనూకల సత్యనారాయణ ఒక క్వింటాలు, శ్రీ నూకల రాధాకృష్ణమూర్తిగారు ఒక క్వింటాలు బియ్యం ఇచ్చారు. అమరావతినుండి 3 క్వింటాళ్ళు, పెదకూరపాడు నుండి ఒక క్వింటాలు, సత్తెనపల్లి నుండి ఒక క్వింటాలు మొత్తం 22 క్వింటాళ్ళ బియ్యం దాతల నుండి వచ్చాయి. పెదవడ్లపూడి నుండి కాయగూరలు, కరివేపాకు వచ్చాయి.

## 6వ విద్యావైజ్ఞానిక మహాసభలు–గుంటూరు
## 40 సం॥ పైబడిన పురుషులు ఆటల పోటీలు

| వరుస సంఖ్య | విభాగము | స్థానము | పేరు | జిల్లా |
|---|---|---|---|---|
| 1. | 100 మీటర్లపరుగు | మొదటి | శ్రీ ఆర్.సుదర్శనరావు, | చిత్తూర్లు |
| 2. | " | రెండవ | శ్రీ డి. సీతారామమూర్తి | గుంటూరు |
| 3. | " | మూడవ | శ్రీ జె.వి.సుబ్బారావు, | ప్రకాశం |
| 4. | 200 మీ. పరుగు | మొదటి | శ్రీ ఆర్. సుదర్శనరావు, | చిత్తూరు |
| 5. | " | ంండవ | శ్రీ డి. సీతారామమూర్తి, | గుంటూరు |
| 6. | " | మూడవ | శ్రీ జి. సభాపతిరావు, | గుంటూరు |
| 7. | బ్రాడ్ జంప్ | మొదటి | శ్రీ ఆర్. సుదర్శనరావు, | చిత్తూరు |
| 8. | " | రెండవ | శ్రీ టి. సీతారామమూర్తి, | గుంటూరు |
| 9. | " | మూడవ | శ్రీ జి. సభాపతిరావు, | గుంటూరు |
| 10. | షాట్‌పుట్ | మొదటి | శ్రీ జి.సభాపతిరావు | గుంటూరు |
| 11. | " | రెండవ | శ్రీ ఆర్. సుదర్శనరావు | చిత్తూరు |
| 12. | " | మూడవ | శ్రీ జె.వి.సుబ్బారావు, | ప్రకాశం |
| 13. | జావెలెన్ త్రో | మొదటి | శ్రీ ఆర్. సుదర్శనరావు, | చిత్తూరు |
| 14. | " | రెండవ | శ్రీ జి. సభాపతిరావు, | గుంటూరు |
| 15. | " | మూడవ | శ్రీ జె. సుధాకరరావు, | గుంటూరు |
| 16. | 2 కి.మీ. నడక | మొదటి | శ్రీ కె.సి.హెచ్.వి. సుబ్బారెడ్డి, | ప్రకాశం |
| 17. | " | రెండవ | శ్రీ యు. మల్లిఖార్జునశర్మ, | ప్రకాశం |
| 18. | " | మూడవ | శ్రీ పి. సుబ్బారావు, | గుంటూరు |

## 40 సం॥ల పురుషులు

| వరుస సంఖ్య | విభాగము | స్థానము | పేరు | జిల్లా |
|---|---|---|---|---|
| 1. | 100 మీ. | మొదటి | శ్రీ యం. అప్పారావు, | విశాఖ |
| 2. | " | రెండవ | యం. వెంకటరాజు, | తూ.గో. |
| 3. | " | మూడవ | శ్రీ పి. శ్రీనివాసరావు, | విశాఖ |
| 4. | 200 మీ. | మొదటి | శ్రీ యం. అప్పారావు, | విశాఖ |
| 5. | " | రెండవ | శ్రీ పి. శ్రీనివాసరావు, | విశాఖ |
| 6. | " | మూడవ | శ్రీ యం. వెంకటరాజు, | తూ.గో. |
| 7. | బ్రాడ్‌జంప్ | మొదటి | శ్రీ యం. అప్పారావు, | విశాఖ |
| 8. | " | రెండవ | శ్రీ పి. శ్రీనివాసరావు, | విశాఖ |
| 9. | " | మూడవ | శ్రీ కె.ఎం. కృష్ణయ్య, | చిత్తూరు |
| 10. | షాట్‌పుట్ | మొదటి | శ్రీ జి.బాలచంద్రకుమార్, | గుంటూరు. |
| 11. | " | రెండవ | శ్రీ ఎం. అప్పారావు, | విశాఖ |
| 12. | " | మూడవ | శ్రీ పి.జి.గోపాలరావు, | తూ.గో.జిల్లా |
| 13. | జావెలింగ్ త్రో | మొదటి | శ్రీ ఎం. అప్పారావు, | విశాఖ |
| 14. | " | రెండవ | శ్రీ జి. శ్రీనివాసరావు, | గుంటూరు |
| 15. | " | మూడవ | శ్రీ పి.జి.గోపాలరావు, | తూ.గో |
| 16. | 2 కి.మీ.నడక | మొదటి | శ్రీ వి. వెంకటేశ్వరరెడ్డి, | ప్రకాశం |
| 17. | " | రెండవ | శ్రీ కె. పరమేశ్వరరావు, | విశాఖ |
| 18. | " | మూడవ | శ్రీ యు.సుబ్బరాజు, | నెల్లూరు. |

## స్త్రీల క్రీడా విభాగం

| వరుస సంఖ్య | విభాగము | స్థానము | పేరు | జిల్లా |
|---|---|---|---|---|
| 1. | 100 మీ. పరుగు | మొదటి | శ్రీమతి ఆర్.భువనేశ్వరి, | గుంటూరు |
| 2. | " | రెండవ | శ్రీమతి సి.హెచ్.వాసంతి, | ప్రకాశం |
| 3. | " | మూడవ | కుమారి కె. అన్నపూర్ణ, | గుంటూరు |
| 4. | చెంచానిమ్మకాయపరుగు | మొదటి | శ్రీమతి పి. కోటేశ్వరి, | ప్రకాశం |
| 5. | " | రెండవ | " సి.హెచ్.వాసంతి, | ప్రకాశం |
| 6. | " | మూడవ | కుమారి జి. రామలక్ష్మమ్మ, | ప్రకాశం |
| 7. | మ్యూజికల్ చైర్ | మొదటి | కుమారి కె. అన్నపూర్ణ, | గుంటూరు |
| 8. | " | రెండవ | శ్రీమతి సి.హెచ్.వాసంతి, | ప్రకాశం |
| 9. | " | మూడవ | " సి.హెచ్.పద్మ, | గుంటూరు. |
| 10. | 500 మీ. నడక | మొదటి | శ్రీమతి జి. రామలక్ష్మమ్మ, | ప్రకాశం |
| 11. | " | రెండవ | " ఆర్. భువనేశ్వరి, | గుంటూరు |
| 12. | " | మూడవ | " పి. కోటేశ్వరి, | ప్రకాశం |

## ఛాంపియన్లు

1. 40 సం॥ పైబడిన పురుషులు శ్రీ ఆర్. సుదర్శనరావు, (23 పా) చిత్తూరు.
2. 40 సం॥ లోపు పురుషులు శ్రీ యం. అప్పారావు (23 పా) విశాఖ
3. స్త్రీ లవిభాగం శ్రీమతి సి.హెచ్. వాసంతి (9పా.) ప్రకాశం.



# స్వాగతోపన్యాసం

డా॥సిహెచ్.నాగేశ్వరరావు,
ఆహ్వాన సంఘ అధ్యక్షులు.

వేదికపై ఆసీనులై ఉన్న పెద్దలారా, మిత్రులారా, సోదర సోదరీ మణులారా!

అరవై వేల మంది ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులకు, రాష్ట్రంలోని అతి పెద్ద ఉపాధ్యాయ సంఘానికి ప్రాతినిధ్యం వహిస్తూ రాష్ట్రం నాలుగు వైపుల నుండీ ఈ మహాసభలకు విచ్చేసిన మీ అందరికీ స్వాగతం పలుకుతున్నాను. మీతో పాటుగా ఇతర రాష్ట్రాల నుండి కూడా వచ్చిన సౌహార్ద ప్రతినిధులకు, నాయకులకు, వివిధ ప్రజా సంఘాల నేతలకు స్వాగతం పలుకుతున్నాను. మూడు రోజులు జరిగే ఈ మహాసభల సందర్భంగా మీకు అందరికీ ఆతిథ్యం ఇచ్చే అవకాశాన్ని మా గుంటూరు జిల్లాకు కల్పించినందుకు మేము కృతజ్ఞులం.

**చరిత్రలో గుంటూరు సీమ!**

చారిత్రక, శాసన ఆధారాలను బట్టి గత 1500 సం॥లుగా గుంటూరు జిల్లా ప్రశస్తి తెలియవస్తూ ఉంది. నాగార్జునసాగర్ ప్రాంతంలోనే బౌద్ధమతంలో ముఖ్యుడైన నాగార్జునుడు నివసించి విశ్వ విద్యాలయాన్ని నిర్వహించాడు. అమరావతి, భట్టిప్రోలు, ఉండవల్లి మొదలైన అనేక ప్రాంతాల్లో బౌద్ధం దేదీ ప్యమానంగా వెలిగి, సముద్రాల మీదుగా ఆగ్నేయాసియా దేశాలకు సైతం వ్యాపించింది. ఈ నాటికీ అందుబాటులో ఉన్న శిల్పాలను, శిథిలాలను బట్టి అలనాటి ఆంధ్రశిల్పుల నైపుణ్యాన్ని అర్థం చేసుకోవచ్చు.

తెలుగుజాతి చరిత్రలో జగజ్జేగీయ మానంగా విలసిల్లిన రెడ్డి రాజ్య రాజధాని కొండవీడు ఈ గుంటూరు జిల్లాలోనే ఉంది. కులాలకు, మతాలకు అతీతంగా చాపకూడు సిద్ధాంతాన్ని ప్రతిపాదించి, ఆచరించి చూపిన బ్రహ్మనాయుడు, ముక్కు పచ్చలారని వయసులోనే అభినవ అభిమన్యుడిలాగా యుద్ధరంగంలోకి దూకిన బాలచంద్రుడు పల్నాటి సీమ వారే.

**సాహిత్యం–**

తెలుగు సాహిత్యంలో మహోన్నత శిఖరాయమానంగా నిలిచిన శ్రీనాథుడు ఇక్కడి వాడే.

దేశంలో విస్తృతంగా పర్యటించడమే కాక ప్రప్రథమంగా తెలుగు సాహిత్యంలో తెలుగుదేశపు అందచందాలను, పట్టణాలను ప్రజల ఆచార వ్యవహారాలను మనోజ్ఞంగా వర్ణించి అక్షర బద్ధం చేశాడు శ్రీనాథుడు. వసంతోత్సవాలను నిర్వహించిన కుమారగిరిరెడ్డికి అనుంగు చెలికాడుగా నిలిచి తెలుగు సాహిత్యాన్ని సారభవంతం చేశాడు.

అస్పృశ్యతా జాడ్యం ఈనాటికి కొనసాగుతున్న దౌర్భాగ్యపు రోజులకు ఎంతో ముందుగానే అణగారిపోతున్న సోదరుల దైన్యాన్ని, నిష్ఠుర శ్రమను, సమాజం తన దృక్పథాన్ని మార్చుకోవలసిన తీరును, స్వాతంత్ర్యం యొక్క ఆవశ్యకతను వివరిస్తూ విస్తృత కళాఖండంగా, చైతన్య వంతంగా 'మాలపల్లి'గా అక్షర బద్ధం చేసిన ఉన్నవ లక్ష్మీ నారాయణగారు ఇక్కడి వారే.

**కుల మతాలు గీసుకొన్న గీతల జొచ్చి**
**పంజరాన కట్టు వడనునేను**
**నిఖిల లోకమెట్లు నిర్ణయించిన నాకు**
**తరుగులేదు విశ్వనరుడనేను.**

అని ప్రకటించి, తన సోదరుల బాధలను మరో మేఘ సందేశంలాగా గబ్బిలానికి విన్నవించిన గుర్రం జాషువా గారు నడయాడిన సీమ ఇది.

**బుద్ధదేవుని భూమిలో పుట్టినావు**
**సహజ మగు ప్రేమ నీలోన చచ్చెనేమి?**
**అందమును హత్య చేసెడి హంతకుండ**
**మైలపడి పోయె నోయి నీ మనుజ జన్మ**

అని పుష్ప విలాపాన్ని, పుష్పాలధిక్కార స్వరాన్ని మార్దవంగా మంద్రగంభీరంగా వినిపించిన కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి గారు ఈ గడ్డపైనే పుట్టి పెరిగారు.

తెలుగు లెంక, అభినవతిక్కన తుమ్మల సీతారామ్మూర్తి చౌదరిగారు,

**పాడరా ఓ తెలుగువాడా– పాడరా ఓ కలిమి రేడా**
**పాడరా మన తెలుగుదేశపు భవ్య చరితం దివ్యగీతం–**

అన్న కొండేపూడి లక్ష్మీనారాయణ గారు, ప్రముఖ రచయిత, అభ్యుదయ రచయితల సంఘ మూలస్తంభాలలో ఒకరు శ్రీ తుమ్మల వెంకట రామయ్య ఈ జిల్లా వారే.

"పలనాడు వెలలేని మాగాణిరా" అని ఎలుగెత్తి చాటిన పులుపుల వెంకట శివయ్య పుట్టిన గడ్డ. "చేయెత్తి జై కొట్టు

తెలుగోడా-గత మెంతో ఘనకీర్తి కలవాడా" అని ప్రజలలో ఆత్మ విశ్వాసాన్ని, ధైర్యాన్ని, స్థైర్యాన్ని పాదు కొలిపిన గేయం ప్రాణం పోసుకున్నదీ ఈ గడ్డమీదనే. అభ్యుదయ సాహిత్య ఉద్యమంలో ఈ జిల్లా అనితర సాధ్యమైన పాత్రను నిర్వహించింది. అలాగే గ్రంథాలయ ఉద్యమంలో కూడా అశేషమైన పాత్రను నిర్వర్తించింది.

**స్వాతంత్ర్య పోరాటంః-**

ప్రజా కంటకుడైన తెల్లవాడి ప్రభుత్వానికి పన్నులు కట్ట నిరాకరించి, ఆత్మార్పణ చేసిన కన్నెగంటి హనుమంతు, మునిసిపాలిటీకి పన్ను కట్టనని భీష్మ ప్రతిజ్ఞ చేసి చీరాల-పేరాల సత్యాగ్రహాన్ని నిర్వహించి, రామ దండును నిర్మించి తెల్లవాడిని గడగడలాడించిన ఆంధ్ర రత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య గుంటూరు సీమకు వన్నె తెచ్చారు.

నిజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా భూమి కోసం, భుక్తి కోసం పీడన నుంచి విముక్తి కోసం తెలంగాణా రైతాంగం సాగించిన సాయుధ పోరాటానికి నాయకత్వం వహించిన శ్రీ మాకినేని బసవపున్నయ్య నిన్న మొన్నటిదాకా మనమధ్యనే ఉండి ఉత్తేజాన్నిచ్చారు. తెల్లవాడికి వ్యతిరేకంగా సాగిన ఉద్యమాలతో పాటుగా ప్రజలకు వ్యతిరేకమయిన అన్ని విషయాలకు, విధానాలకు వ్యతిరేకంగా జిల్లా ప్రజలు స్పందించారు, స్పందిస్తున్నారు. కార్మికులు, కర్షకులు, విద్యార్థులు, మేధావులు జిల్లా అభివృద్ధికి సముచితమైన పాత్రను నిర్వహిస్తున్నారు.

**సంస్కరణోద్యమంః-**

కుల మత ఛాందసాలకు, మూఢాచారాలకు, అంధ విశ్వాసాలకు వ్యతిరేకంగా ధ్వజమెత్తిన త్రిపురనేని రామస్వామి చౌదరిగారు ఈ జిల్లా వాడే. ఆయన నాటిన హేతువాద బీజాలు అంకురిత, పల్లవిత పుష్పితాలై ఇప్పుడిప్పుడే ఫలవంతమవుతున్నాయి. తిరోగామి చైతన్యం కూడా పెరుగుతున్నందున కవిరాజు గారి ఆశయాలను, బోధనలను మరింత బలంగా ముందుకు తీసుకు పోవలసిన బాధ్యత మనందరి మీద ఉంది.

**ప్రకృతి-పంటలుః-**

కృష్ణానదికి కుడి ప్రక్కనున్న ఈ జిల్లాలో నాగార్జునకొండ ఎత్తిపోతల, నిజాంపట్నం ఓడరేవు వంటి ప్రకృతి సుందరమైన దర్శనీయ స్థలాలెన్నో ఉన్నాయి. ఆంధ్రదేశానికి ధాన్యాగారమని చెప్పుకోదగిన స్థాయిలో రైతులు వాణిజ్య పంటలతో పాటుగా రకరకాల పంటలను పండిస్తున్నారు. ఈనాడు మరోజిల్లాగా ఏర్పడ్డా ప్రపంచ ప్రసిద్ధి వహించిన ఒంగోలు గిత్తలు కూడా నిన్నటి దాకా ఈ జిల్లాలోనివే.

**విద్యారంగంః**

అనేక దశాబ్దాలుగా రాష్ట్రంలో విద్యా కేంద్రంగా గుంటూరు పట్టణం విలసిల్లుతూ ఉంది. అలనాటి నాగార్జునాచార్యుని స్మృతి చిహ్నంగా ఆయన ప్రవచించిన మహోన్నత ఆశయాల వెలుగు జాడలలో నెలకొల్పిన నాగార్జున విశ్వ విద్యాలయం ఇక్కడే ఉంది. విశ్వ విద్యాలయాల్లో అరుదుగా కనిపించే మార్క్స్ అధ్యయన కేంద్రం, బౌద్ధ విజ్ఞాన అధ్యయన కేంద్రం ఈ విశ్వ విద్యాలయంలో నెలకొల్పబడటం సముచితం. గర్వకారణం కూడా.

ఇంతటి చరిత్రా, విశిష్టతా కల్గిన మా గుంటూరు సీమకు మీరంతా తరలివచ్చారు. ఈనాటి విద్యా రంగాన్ని విశ్లేషించబూనుకున్నారు. ఒక గొప్ప విద్యా కేంద్రంగా ఈ సీమకు ఈ అవకాశం లభించడం సముచితమనే నేను భావిస్తున్నాను.

ఈ దేశ భవిష్యత్తు తరగతి గదుల గోడల మధ్యనే నిర్ణయించబడుతుందని ఆనాడు కొఠారీ అన్నారు. తరగతి గదులను సృజనాత్మకంగా సజీవంగా మలుచుకొనేది మీరు. భావి భారత భాగ్య విధాతలకు గురువులు మీరు. శిల్పులు మీరు.

విద్యా రంగాన్ని గురించి వాస్తవాలను చెప్పగలవారు మీరు. ప్రాథమిక విద్యకు పథ నిర్దేశం చేయగలవారు మీరు. ఎవరైనా ఎంత కొమ్ములు తిరిగిన వారైనా మీ విద్యా భిక్షతో ఎదుగవలసిన వారే. దేశ భవిష్యత్తును నిర్ణయించే విద్యా రంగాన్ని మీరు కూలంకషంగా చర్చించండి. నిర్ణయాలు చేయండి.

విద్యా రంగం సక్రమంగా లేదని అందరూ అంటున్నారు. పలు వ్యాఖ్యానాలు చేస్తున్నారు. నిజమే, ఎవ్వరం కాదనలేము అయితే దీనికి ప్రత్యామ్నాయం చూపగలవారెవరు? ఆచరణాత్మక పరిష్కారం సూచించగలవారెవరు? అనుభవాల ప్రాతిపదికగా ఆలోచించగలవారెవరు? ఈ పిల్లి మెడకు గంట కట్టగల వారెవరు? వారు మీరే.

మీరు ఒంటరిగా లేరు. ఎంతో సుసంఘటితంగా ఉన్నారు. మీవెంట జాతి భవిష్యత్తును గురించి తపనపడే మేధావులెంతో మంది ఉన్నారు. ప్రజా స్వామ్యవాదులెందరో ఉన్నారు. మీ వాణికి ఇంత తోడుంది. ఇంత బలముంది.

విద్యా రంగం బాగుంటే దేశం బాగుంటుంది. అంతే కాదు ప్రభుత్వ విద్యా రంగం బావుంటేనే మీరు బావుంటారు. బాధ్యతలు లేని హక్కులు లేవు. పునాది పొయ్యాక ఇక ఏమీ మిగలదు. ఈ రోజు విద్యారంగం దాదాపు ప్రైవేటురంగం పరమవుతుంది. ప్రభుత్వం విద్యారంగాన్ని భారమనుకొంటోంది. పేదలకు దీంతో విద్య మరీ భారమవుతుంది. దీంతో పాటు మీకూ భద్రత కరువవుతుంది. ఆలోచించండి మన ఉనికికే ముప్పు వాటిల్లే ప్రమాదముంది.

గట్టిగా, మరింత గట్టిగా మీవాణి వినిపించండి. నిశితంగా సునిశితంగా పరిస్థితిని పర్యాలోకించండి. ప్రపంచానికి మీగొంతు వినిపించాలి. మత్తు వదిలించాలి. పది మందిని మేల్కొలపాలి. కర్తవ్యోన్ముఖుల్ని చేయాలి.

ఈ కర్తవ్య నిర్వహణలో మా విశ్వాసాల్ని మీరు వమ్ము చేయరనే నమ్మకం మాకుంది. మీ కృషి విజయవంతం కావాలి. ఈ మహాసభ చరితార్థం కావాలి. చరిత్రాత్మకమూ కావాలి.

మా ఆతిథ్యాన్ని స్వీకరిస్తున్నందుకు మరోసారి ధన్యవాదాలు! మీకు శుభాకాంక్షలు.

భవదీయ,
దాచిగురుపాటి వాగేశ్వరరావు,
అధ్యక్షులు,
ఆహ్వాన సంఘం.




# అధ్యక్షోపన్యాసము

శ్రీ డి.రామిరెడ్డి,
అధ్యక్షులు:

వేదిక నలంకరించిన పెద్దలారా!
మహాసభ ప్రతినిధులారా! సౌహార్ద ప్రతినిధులారా!
సోదర సంఘ నాయకులారా
పుర ప్రముఖులారా, విద్యావేత్తలారా

**పత్రికా ప్రతినిధులారా!**

ఎన్నో వ్యయప్రయాసలకోర్చిసుదూర ప్రాంతాల నుండి ఈ సభకు విచ్చేసిన మీకందరకు స్వాగతం .... సుస్వాగతం.

మన 5వ మహాసభలు 1989 జూన్ 22-25 తేదీలలో నెల్లూరులో అత్యంత వైభవంగా జరిగాయి.

ఈ మధ్య కాలంలో ప్రపంచ వ్యాప్తంగా అన్ని రంగాలలో అనేకమార్పులు జరిగాయి. సోవియట్ యూనియన్ పతనం తర్వాత ఏకధృవ ప్రపంచం పెత్తనం చేస్తోంది. దానితో వర్ధమాన దేశాల ఆర్థిక,సాంఘిక జీవనాలను శాసించే అనేక ప్రయత్నాలు జరుగుతున్నాయి. వాటిననుసరించే మన దేశంలో నూతన ఆర్థిక విధానాలు, పారిశ్రామిక విధానాలు, విద్యా విధానాలు రూపొందుతున్నాయి.

స్వాతంత్ర్యం వచ్చి నాలుగున్నర దశాబ్దాలైనా రాజ్యాంగంలో నిర్దేశించినట్లు 14 సం॥లోపు వారందరికీ నిర్బంధంగా విద్య గరపడం గగన కుసుమంగానే ఉంది. 1991 జనాభా లెక్కల ప్రకారం భారతదేశంలో అక్షరాస్యతా శాతం 52.11 ఉండగా ఆంధ్రప్రదేశ్‌లో 45.11. భారతదేశంలో పురుషులలో అక్షరాస్యతా శాతం 63.86 ఉండగా స్త్రీలలో 39.42 ఉంది. జనాభాలో 1000 మంది పురుషులకు 929 స్త్రీలు. 1981 జనాభా లెక్కలతో పోల్చితే 5% స్త్రీ జనాభా తగ్గింది. అయినా జనాభాలో దాదాపు సగం మంది ఉన్న మహిళలు 60% నిరక్షరాస్యులుగా మిగిలిపోవడం మనకు ఆందోళన కలిగిస్తున్నది.

ఆంధ్రప్రదేశ్‌లో పరిస్థితి కూడా దీనికి భిన్నంగాలేదు. మన రాష్ట్రంలో వేయిమంది పురుషులకు 972 మంది స్త్రీలు ఉన్నారు. కాని పురుషులలో అక్షరాస్యత 56.24% ఉండగా, స్త్రీలలో 33.71% ఉంది. షెడ్యూల్డ్ కులాలు, వెనుకబడిన తరగతులలో ఈ నిరక్షరాస్యత ఎక్కువగా వుంది. మన రాష్ట్రంలో 1 నుండి 7వ తరగతులలో దాదాపు 90.5 లక్షల మంది విద్యార్థులుండగా యస్.సి.యస్.టి.ల పిల్లలు 23 లక్షల మంది మాత్రమే ఉన్నారు.

పాఠశాలలో చేరిన తర్వాత మధ్యలో పాఠశాలలు వదిలివెళ్ళిన వారి సంఖ్య అత్యధికంగా ఉంది. ఈ వదిలి వెళ్ళడం 1 నుండి 8 తరగతులలోపు బాలురు 58.80% ఉండగా, బాలికలలో 67.55% ఉంది. సగటున అప్పర్ ప్రైమరీ స్థాయిలో 44%, సెకండరీ స్థాయిలో 52% ఉండగా అండర్ గ్రాడ్యుయేట్ స్థాయిలో 50%, పోస్టు గ్రాడ్యుయేట్ స్థాయిలో 83%, రిసెర్చ్‌లో 92% వదిలి పోతున్నారు. జనాభా పెరుగుతోంది. అక్షరాస్యులు పెరుగుతున్నారు, నిరక్షరాస్యత పెరుగుతోంది.

విద్య సామాజికాభివృద్ధికి పెట్టుబడిగా కాక సేవాధర్మంగా ప్రభుత్వం భావించినందు వల్లనే ఈ పరిస్థితులేర్పడ్డాయి. ప్రపంచంలో ఈనాడు అభివృద్ధి చెందిన అన్ని దేశాలు విద్య మీద ఎక్కువ డబ్బు ఖర్చు చేస్తున్నాయి. కాని మన దేశంలో మొదటి పంచవర్ష ప్రణాళికలో 7.86 శాతం కేటాయిస్తే, 7వ ప్రణాళికలో 3.5 శాతం కేటాయించారు. అందులో కూడా ప్రాథమిక విద్యకు అధికంగా కేటాయించి పటిష్టపరచవలసి ఉండగా మొదటి పంచవర్ష ప్రణాళికలో ప్రాథమిక విద్యకు 56% కేటాయించి సెకండరీ విద్యకు 13%, యూనివర్శిటీ విద్యకు 9%, సాంకేతిక విద్యకు 9%, ఇతరాలకు 13% కేటాయించారు. 7వ ప్రణాళికలో వరుసగా, 36%,16%,19%,18%, 11% కేటాయించారు. దీనిని బట్టి బడ్జెట్ కేటాయింపులోనే ప్రాథమిక విద్య నిర్లక్ష్యం చేయబడింది. ఆ విధంగా 41/2 దశాబ్దాలుగా ప్రాథమిక విద్య నిర్లక్ష్యం చేయబడింది. 5వ ఆల్ ఇండియా విద్య సర్వే ప్రకారం ప్రాథమిక పాఠశాలలు 1986 నాటికి బహిరంగ స్థలాలలో చెట్ల క్రింద 13.50%, మధ్య రకం భవనాలు, 13.75%, గట్టి భవనాలు 72.75% ఉన్నాయి.

ఉపాధ్యాయులు లేని పాఠశాలలు 0.50% ఉంటే ఏకోపాధ్యాయ పాఠశాలలు 27.96%. ఇద్దరుఉపాధ్యాయులు 32.38%, ముగ్గురు టీచర్లు15.18%, 4 టీచర్లు 8.91%, 5గురు టీచర్లు 15.07

కొన్ని రాష్ట్రాలలో పాఠ్యపుస్తకాలలో మతఛాందస భావాలను చొప్పించే ప్రయత్నం, చరిత్రను వక్రీకరించే ప్రయత్నం జరుగుతోంది.

శరవేగంతో పెరుగుతున్న శాస్త్ర సాంకేతిక విజ్ఞానాని కనుగుణంగా మన సిలబస్ మారాలి. పాఠ్యపుస్తకాలు మారాలి. అన్నింటికన్నా ఉపాధ్యాయులు ఆలోచనా పరంగా మారాలి. మన విజ్ఞానాన్ని నిరంతరం పెంపొందించుకునే కృషి జరగాలి. మన బోధనా పద్ధతులు మారాలి. విద్యార్థికి చెప్పడం కన్నా విద్యార్థిలోని నిద్రాణమైన శక్తులను మేల్కొలిపి నేర్చుకొనేలా శాస్త్రీయమైన విద్యా పద్ధతి అవలంబించాలి. ప్రతి పని వారు తన పని ముట్లతో శాస్త్ర విజ్ఞాన ఫలితాలను బట్టి మార్పు చేసుకుంటున్నారు. కాని మనలో యింకా ఆ మార్పు రాలేదు. ద్వాపరయుగకాలంనాటి పద్ధతులలోనే భాషా బోధన జరుగుతోంది. అనేక పనికిరాని వస్తువులను బోధనోపకరణాలుగా ఉపయోగించి 'Low cost No cost' బోధనా విధానం రావాలి.

నకిలీ పాఠ్యపుస్తకాలను గూర్చి గతంలో వినలేదు. ప్రభుత్వ అసమర్థత విధానాల వల్ల నకిలీ పుస్తకాలు నాట్యమాడుతున్నాయి. పుస్తకాల భారం ప్రజల నడ్డి విరుస్తోంది.

పరీక్ష విధానం అపహాస్యం పాలౌతోంది. ఎంతో పకడ్బందీగా నడుపుతున్నామని చెప్పిన ఎం.సెట్ పేపర్లు లీకయినాయి. ఐ.ఎ.ఎస్. పరీక్ష పత్రాలు కూడా లీకవుతున్నాయి. అందుచే ఈ పరీక్ష విధానంలో కూడా విప్లవాత్మక మార్పులు రావాలి.

ఉద్యోగాలకు డిగ్రీలకు ఉన్న లింకు వల్ల ఈ రోజు చదువులయెడ గౌరవమైనా మిగిలి ఉంది. ఆ కొద్ది బంధాన్ని కూడా ప్రభుత్వం తెగగొడతా నంటోంది. అదే జరిగితే విద్యాలయాల అధోగతి మరింత తీవ్రతరమవుతుంది.

నేడు విద్య వ్యాపారంగా మారింది. పరిశ్రమలు స్థాపించినట్లు ధనికులు ప్రైవేటు పాఠశాలలు పెద్ద ఎత్తున స్థాపిస్తున్నారు. పరిశ్రమలలో ఉన్న అన్ని రకాల పోటీ విధానాలు అవలంభిస్తున్నారు. ఆకర్షణ కొరకు అన్ని రకాల తప్పుడు పద్ధతులకు పాల్పడుతున్నారు. దాని పర్యవసానమే 7వ తరగతి నుండి యం.సెట్ వరకూ అన్ని పబ్లిక్ పరీక్షల పేపగు లీకవుతున్నాయి. ఆంగ్లభాషపై మోజు పెంచుతున్నారు. మమ్మీ,డాడీ సంస్కృతి పెరిగిపోతోంది.

ప్రజల అజ్ఞానాన్ని ఆధారం చేసుకొని ప్రజాస్వామ్యాన్ని అన్ని విధాల అపహాస్యం చేస్తున్నారు. ఈ దుష్ఫలితాలు సమాజం అనుభవిస్తోంది. సంపద కొందరి సొత్తయితే అనర్థాలు అందరి ఆస్తి అవుతున్నాయి. ఈ సమాజంలో చదువుకున్న మేధావి వర్గానికి చెందిన మనం ఈ పరిణామాలు చూస్తూ ఊరు కోరాదు. అన్ని రకాల పరిణామాలను నిరంతరం అధ్యయనం చేయాలి. ప్రపంచంలో అనేక విప్లవాలకు మేధావులే బీజాలైనారు. మనం కూడా నేటి చారిత్రక పరిణామాలలో ఆ కీలక పాత్ర వహించాలి.

మన రాష్ట్రంలో అక్షరాస్యత ఉద్యమం నడుస్తోంది. యిది ప్రభుత్వ బాధ్యతగా కాక సమాజ బాధ్యతగా భావించే బి.జి.వి.యస్. లాంటి స్వచ్ఛంద సంస్థల సంఘీభావంతో ఈ ఉద్యమం నడుస్తోంది. జనజ్ఞాన నేత్రం తెరుచుకుంటే వారిలో చైతన్యం రగుల్కొంటే, సమాజంలో రుగ్మతలు భస్మమవుతాయి. మంత్రాలకు వానలు కురవవు. తంత్రాలకు తంటాలు తీరవు.

అందుకే " అధ్యయనం అధ్యాపనం సామాజిక స్పృహ" లక్ష్యం గాగల మనం ఈ సామాజిక ఉద్యమంలో భాగస్వాముల మవుతామని ప్రతిజ్ఞ గైకొందాం. యిప్పటికే ఈ అంశంలో ముందున్న మన నెల్లూరు, గోదావరి సోదరులను అభినందిస్తూ వారి బాటలో పయనిద్దాం.

ఈ మహాసభ 3 రోజులలో సమాజంలోని అన్ని అంశాలను చర్చించేందుకు అనేకరకాల సదస్సులునిర్వహిస్తున్నాం. అన్ని రంగాల మేధావులను పరిపాలనా దక్షులను ఆహ్వానించాం. అనేక యితర రాష్ట్రాల నుండి, అన్ని సోదర సంఘాల తరపున మన మహాసభలను తిలకించడానికి ప్రతినిధులు వచ్చారు. వారందరికి ప్రత్యేకంగా ధన్యవాదాలు తెలుపుచున్నాను.

మన సంఘం ఉక్కు క్రమశిక్షణకు పెట్టింది పేరు. దాని కనుగుణంగా ఈ 3 రోజుల కార్యక్రమాలు జయప్రదం చేయడానికి అందరూ తోడ్పడతారని ఆశిస్తున్నాను.



# సంఘ నివేదిక

శ్రీ ఎ. వెంకటస్వామి
ప్రధాన కార్యదర్శి

అధ్యక్షా!
కామ్రేడ్స్

19 సంవత్సరాలు నిండిన ఉద్యమం 20వ సంవత్సరములో అడుగుపెట్టిన వేళ, దాని రథసారధులుగా, అడుగడుగునా అవాంతరాలు ఎదుర్కొంటూ, ఈ 19 సంవత్సరాలు ప్రగతి పథంలో ఉద్యమాన్ని నడిపి, 6వ విద్యా మహాసభలకు తరలిచ్చిన తమందరకు స్వాగతం.

అమరజీవి చెన్నుపాటి ఆశయాలకను గుణంగా 1974 ఆగస్టు 10న అవతరించి, అన్ని ప్రాంతాల, అన్ని కేడర్ల, అన్ని యాజమాన్యాల ఉపాధ్యాయులను ఒక త్రాటిపైకి తెచ్చి, ఆంధ్ర నాట అతి పెద్ద సంఘంగా ఎదిగి, చారిత్రికకర్తవ్యం నెరవేర్చుతున్న సంస్థ యు.టి.ఎఫ్.

దాని ప్రగతిని, సూత్రబద్ధ వైఖరిని అడుగడుగునా చాటి చెప్పిన విధంగా ప్రథమ మహాసభ రాజమండ్రిలో 1974 అక్టోబరు 20, 21 తేదీలు, ద్వితీయ మహాసభ 1977 ఆగస్టు 17, 18 ఖమ్మంలోను, తృతీయ మహాసభ 1981 ఆగస్టు 16,17,18 భీమవరంలోను, చతుర్ధ మహాసభ 1986 జనవరి 8, 9, 10 విజయవాడలోను, పంచమ మహాసభ 1989 - 22, 23, 24, 25 నెల్లూరులోను జరుపుకున్నాము.

ఆ మహాసభలు ఒక్కొక్కటి ఒక్కో విషయానికి పునాదులు వేశాయి. ప్రతిదీ మన ఉద్యమ చైతన్యాన్ని పెంచి పోషించింది. పెద్ద సంఘంగా అవతరింపజేసింది. ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారంలో అగ్రభాగాన నిలిచింది. ఉపాధ్యాయులు అపూర్వంగా ఆదరించారు. ప్రభుత్వ గుర్తింపు పొంది జాయింట్ స్టాఫ్ కౌన్సిల్‌లో సభ్యత్వం కూడా పొందగలిగాము.

ఉద్యమం, ఉపాధ్యాయులు, విద్యారంగం ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారం నిమిత్తం కృషిచేస్తున్న మనం అసలు ఆ సమస్యలు ఎందువల్ల ఉత్పన్నమౌతున్నాయో కూడా తెలుసుకోవాలి. అంటే ప్రస్తుతం సమాజం ఎదుర్కొంటున్న ఇబ్బందులు పరిష్కరించాలి. అందుకు అనివార్యంగా జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులు అవగాహన చేసుకోవాలి.

ప్రపంచ పరిస్థితిలో చాలా మార్పు వచ్చింది. సోవియట్ యూనియన్, తూర్పు యూరప్ దేశాలలో సోషలిస్టు వ్యవస్థ కుప్పకూలిన తర్వాత, అమెరికన్ సామ్రాజ్యవాదం, తన చెప్పు చేతలలో ప్రపంచమంతా నడవాలని తంటాలు పడుతున్నది. ఐ.రా.స.ని తన చెప్పుచేతలలో పెట్టుకొని, ఇతర దేశాల ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం హద్దుమీరి చేసుకొంటున్నది.

రెండు జర్మనీలను కలిపేదానికి చూపిన ఆదుర్దా, రెండు కొరియాలను కలిపేదానికి చూపడం లేదు. పైగా దక్షిణ కొరియాలో సైనిక విన్యాసాలు సాగించింది. ఇరాక్‌పై గల్ఫ్ యుద్ధ సమయంలో దాడిచేసింది చాలక, అర్థంలేని వాదనలతో తిరిగి రాకెట్‌లతో ఇటీవల దాడిచేసింది. అంగోలా, మొజాంబిక్‌లలో కూడా జోక్యం చేసుకున్నది. సోమాలియాలో వచ్చిన కరువును ఆధారం చేసుకొని సైన్యాన్ని దింపింది. ఇజ్రాయిల్‌కు సహకారం అందిస్తూనే వుంది.

రష్యా, ఇండియాతో చేసుకున్న రాకెట్ ఒప్పందాన్ని రద్దు చేయించేదానికి నిరంతరం అడ్డువడుతున్నది. బ్రెజిల్, థాయిలాండ్‌లతో పాటు స్పెషల్ 301 ఇండియాపై కూడా రుద్దింది. ఈ సూత్రం ప్రకారం అమెరికాకు జరిగే మన ఎగుమతులపై విపరీత సుంకం విధించబడుతుంది.

7 దేశాలు (అమెరికా, కెనడా, ఇంగ్లాండ్, ఇటలీ, ఫ్రాన్స్, జర్మనీ, జపాన్) వారిలో వారికి వైరుధ్యాలు వున్నా ప్రపంచంలోని దేశాలను తమ పాదాక్రాంతం చేసుకోవాలని తాపత్రయపడుతున్నాయి. వారి దేశాల పరిస్థితి చూస్తే అమెరికాలో 7, బ్రిటన్‌లో 10, స్పెయిన్‌లో 16, జపాన్‌లో 2, ఇటలీలో 9, శాతం నిరుద్యోగం వుంది. జి. 7 దేశాలన్నిటా పారిశ్రామిక ఉత్పత్తి 5 నుండి 2.8శాతం తగ్గింది. విదేశీ అప్పులు చూస్తే అమెరికా ఒక్కటే 15 లక్షల కోట్ల డాలర్లతో అవస్థలు పడుతున్నది. జపాన్‌తో వ్యాపారంలో నిలువలేక దానిపై కూడా ఆంక్షలు పెడుతున్నది.

గాట్ అధ్యక్షుడుగా వున్న ఆర్థర్ డంకెల్ ప్రపంచ దేశాలు పాటించవలసిన సూత్రాల గురించి ఒక డ్రాఫ్టు రూపొందించాడు. అది డంకెల్ ప్రతిపాదనగా పేరుపొందింది. దానిని అన్ని దేశాలు పాటించాలని ఈ దేశాలు వత్తిడి చేస్తున్నాయి. ఇది అంగీకరిస్తే విత్తనాలు, మందులు పేటెంట్ హక్కులు మన చేతుల్లో వుండవు. స్వదేశీ, విదేశీ బేధముండరాదట. నిందితుడు పేటెంట్ హక్కులు ఉల్లంఘించలేదని నిరూపించుకోవాలట. అణుశక్తిరంగంలో కూడా వారికి లొంగి ఉండాలట. పరిశ్రమల లైసెన్సులు ఇచ్చే అధికారం ఆయా దేశాలకు ఉండరాదట. బ్యాంకింగ్, ఇన్సూరెన్స్ అంతర్జాతీయ పోటీకి నిలబడాలట. స్వదేశీ పరిశ్రమలకు రక్షణ కల్పించరాదట. ముడి పదార్థాల దిగుమతికి షరతులు ఉండరాదట. విదేశీ పెట్టుబడులకు పరిమితి ఉండరాదట. ఉత్పాదనలో కొంత భాగాన్ని ఎగుమతి చేయమని చెప్పరాదట. సాంకేతిక విధానం దిగుమతికి స్వేచ్ఛ ఉండాలట. ఈ ప్రధానమైన షరతులు అందులో వున్నాయి. ఇవి అంగీకరిస్తే పంటలు, పరిశ్రమలు, విదేశీయుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి ఉండాలి.

దక్షిణాఫ్రికాలో అధికార మార్పిడికి అనేక అవాంతరాలు కల్పిస్తున్నారు. శ్వేత జాతీయులకే ఓటింగు హక్కు కలిగి ఇప్పటి వరకు అల్ప సంఖ్యాకులే అధికారం చెలాయించారు. అధిక సంఖ్యాకులైన 80 శాతం నల్లజాతి వారు అణచివేయడ్డారు. ప్రపంచ

ప్రజల వ్యతిరేకత వలననూ, నల్లజాతి వారి పోరాట ఫలితంగానూ నెల్సన్ మండేలాను విడుదలచేసి, ఎ.ఎన్.సి. ఇతర పార్టీలపై నిషేధాన్ని తొలగించినప్పటికి యింకా కుట్రలు జరుగుతూనే వున్నాయి. కమ్యూనిస్టు పార్టీ నేత క్రిస్‌హానీ హత్య ఇందుకు ఉదాహరణ.

1994 ఏప్రిల్‌లో అందరికి ఓటింగ్ హక్కుతో, ఎన్నికలకు అంగీకరించిన డిక్లార్క్ నల్లజాతి ఐ.పి.ఎఫ్. పార్టీ పెట్టేఅడ్డంకులు, శ్వేత జాతిపార్టీ ప్రత్యేక దేశం వాదనల మధ్యజాప్యం చేస్తున్నారు. ఎ.డబ్ల్యు.బి. దుండగుల దాడులతో శాంతిభద్రతలకు విఘాతం కల్గుతుంది.

చైనాపై అమెరికా చేస్తున్న వత్తిడులను తట్టుకుంటూ అది పురోగమిస్తున్నది. 1997 హాంకాంగ్‌ను చైనాకు అప్ప గించవలసియున్నది. దానికి కూడా హాకాంగ్ గవర్నరు ద్వారా అడ్డంకులు కల్పిస్తున్నది. క్యూబాకు ఇటీవల అమెరికా ప్రజలు మానవతా దృక్పథంతో నిత్యజీవితావసర వస్తువులు పంపిస్తూ ఉంటే అడ్డంకులు కల్పిస్తే జయప్రదంగా అధిగమించారు. వియత్నాం, ఉత్తర కొరియా సోషలిస్టు దేశాలుగా మనుగడ సాగిస్తున్నాయి.

ఆఫ్ఘనిస్తాన్‌లో మొజాహిద్దీన్ గ్రూపులు పరస్పరం కలహించుకుంటూ శాంతి భద్రతలు లేకుండా చేస్తున్నాయి. పాకిస్తాన్‌లో అధ్యక్షుడు, ప్రధాని మధ్య వచ్చిన కలతలను ఆధారం చేసుకొని తిరిగి సైన్యం అధికారం హస్తగతం చేసుకున్నది. బంగ్లాదేశ్‌లో ప్రస్తుతం ఎన్నికైన ప్రభుత్వమే అధికారంలో వున్నది. బర్మాలో ఆండసాని కుమార్తె ఎన్నికలలో పూర్తి మెజారిటీ సాధించినా సైన్యం అధికారం అప్పగించలేదు. శ్రీలంకలో దేశాధ్యక్షుడు ప్రేమదాస ఎల్.టి.టి.ఇ. తీవ్రవాదుల చేతిలో ప్రాణాలు కోల్పోయారు.

సామ్రాజ్యవాదులు తృతీయ ప్రపంచ దేశాలను విపరీతంగా దోపిడీ చేస్తున్నారు. సంవత్సరానికి ఆ దేశాలు వడ్డీ రూపేణా 726 బిలియన్ డాలర్లు చెల్లిస్తున్నాయి. ఇది 1990లో పేరుకుపోయిన అసలు కన్నా ఎక్కువ. అలీనోద్యమం కొడిగట్టిన దీపంలా వుంది. ఐక్యరాజ్య సమితి, అమెరికా పోలీసు పాత్రకు ముద్రవేసేదిగా దిగజారింది. థాయిలాండ్, కంబోడియా,సోమాలియాలలో దాని పాత్ర, దీనిని రుజువు చేస్తున్నది. ఈ పరిస్థితుల నుండి బయటపడేదానికి వర్ధమాన దేశాలు సమైక్యంగా వ్యవహరించి, తమ మనుగడకు, ప్రపంచ మార్పుకు కృషిచేయాలి.

1992 డిసెంబరు 6 భారత దేశ చరిత్రలోనే దుర్దినం. చారిత్రిక కట్టడమైన బాబ్రీ మసీదును మతశక్తులు కూలగొట్టి, మన సెక్యులర్ వ్యవస్థను మలినపరిచాయి. అధికార పార్టీ అలసత్వం, మతోన్మాద శక్తులకు వూతమిచ్చింది. దేశవ్యాప్తంగా జరిగిన మత కొట్లాటలలో అనేక వందల మంది అసువులుబాశారు. బొంబాయి, కలకత్తా ప్రేలుడుసంఘటనలు శాంతి భద్రతలనే సవాలు చేశాయి.

పంజాబులో ఖలిస్తాన్ ఉగ్రవాద చర్యలు కొంత అదుపులో వున్నా, కాశ్మీర్ తీవ్రవాదులు ఇప్పటికీ పట్టు కల్గి వున్నారు. అస్సాం ప్రభుత్వంతో బోడో తీవ్రవాదులు ప్రాంతీయ స్వయం ప్రతిపత్తి మండలికి ఒప్పందానికి రావడం శుభసూచకం. అలాగే జార్ఖండ్ ప్రాంతం స్వయం ప్రతిపత్తి మండలానికి జరుగుతున్న కృషి ఆహ్వానించతగ్గదే.

కేంద్ర నూతన ఆర్థిక, పారిశ్రామిక విధానాలు దేశ స్వావలంబనకు దెబ్బకొట్టి, విదేశాలకు ద్వారాలు తెరచింది. ఐ.ఎం.ఎఫ్., వరల్డ్ బ్యాంక్ షరతులు తీర్చే వైపు బడ్జెట్ ప్రతిపాదనలు వున్నాయి. బడ్జెట్‌కు ముందే 10,000 కోట్ల రూపాయలు పన్నుల ద్వారా సమీకరించే చర్యలు గైకొన్నది. అదే సమయంలో సంపన్న వర్గాలకు 4,522 కోట్ల రూపాయలు రాయితీలు ప్రసాదించింది.

బ్యాంకులలో హర్షద్ మెహతా 5000 కోట్ల రూపాయల కుంభకోణం అన్నిటి కన్నా పెద్దది. ఇందులో పెద్దల హస్తం వున్నదనేది ప్రస్తుతం చర్చనీయాంశం. స్విస్ కోర్టు తీర్పు ప్రకారం బోఫోర్సు కుంభకోణం తిరిగి వెలుగులోకి వచ్చింది. మధ్య దళారుల పేర్లు బయట పడ్డాయి. అసలు ముద్దాయి తెలియవలసి ఉన్నది.

విదేశీ అప్పులు 25,000 లక్షల కోట్లు, స్వదేశీ అప్పులు 25,000 లక్షల కోట్లు ఉన్నాయి. ప్రతి భారతీయుడి తలపై రు.10,000/-ల అప్పులు ఉన్నాయట. ప్రతి సంవత్సరం చెల్లించే వడ్డీ మరింత భారంగా ఉన్నది.

ఉద్యోగ అవకాశాలు రోజు రోజుకు క్షీణిస్తున్నాయి. మూతపడిన పరిశ్రమలలోని కార్మికులు వీధులలో పడుతున్నారు. ప్రైవేటీకరణ పేరుతో కారుచౌకగా ప్రభుత్వ పరిశ్రమల షేర్లు విక్రయిస్తున్నారు. బ్యాంకులు రైల్వేలు, ఎల్.ఐ.సి.ల లో గోల్డెన్ హేండ్‌షేక్ పేరుతో 20 లక్షల మంది ఉద్యోగులను తొలగించారు. అది రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు కూడా వర్తింపజేసే ఆలోచనలు సాగుతున్నాయి. రాజకీయాలలో అవినీతి రాజ్యమేలుతున్నది. నైతిక విలువలకు చోటు లేకుండా పోయింది. పార్టీల మార్పిడితో పబ్బం గడుపుకోవటం పెరిగిపోయింది. ఇప్పటికి కేంద్ర ప్రభుత్వం మూడుసార్లు అవిశ్వాసాన్ని ఎదుర్కొని, పై విధానాలు అనుసరించి పదవిలో కొనసాగుతున్నది.

మనరాష్ట్రంలో పాలక పక్షానికి పూర్తి మెజారిటీ వున్నా మూడు సంవత్సరాలలో ముగ్గురు ముఖ్య మంత్రులు మారారు. హైద్రాబాద్ అల్లర్ల సందర్భంలో ఒకరు, మెడికల్, డెంటల్ కాలేజీల పై కోర్టు తీర్పు వల్ల మరొకరు రాజీనామా ఇవ్వవలసి వచ్చింది.

ఆంధ్రప్రదేశ్‌లో ఉపాధ్యాయుడు ముఖ్యమంత్రిగా వచ్చినా, మన సమస్యలు పరిష్కరింపబడలేదు. ఆ తర్వాత వచ్చిన వారి నుండి మనం ఆశించిన ఫలితాలు దక్కలేదు. సామాన్యులపై పరోక్షంగా పన్నులు పడి అనేక రెట్లు ధరలు పెరిగాయి. బస్సు రేట్లు, పాల రేట్లు పెంచారు. ఇప్పుడు ఎంట్రీ టాక్స్ పేరుతో ఎక్కడ లేని విధంగా రేట్లు పెరిగాయి.

ఆంధ్రనాట మహిళలు సాగించిన మహోజ్వల పోరాటం కారణంగా వెంటనే నెల్లూరులో, మిగతా రాష్ట్రమంతా అక్టోబర్ 2 నుండి సారా నిషేధానికి ప్రభుత్వం అంగీకరించవలసి వచ్చింది. ఇది భారతదేశానికి ఆదర్శ ప్రాయమైన పోరాటం.

విద్యారంగాన్ని ప్రయివేటు పరం చేసే దానికి ప్రభుత్వం ప్రయత్నాలు చేస్తున్నది. పాలకులు తమ బాధ్యత తప్పించుకునే దానికి ఆ రంగానికి పొగడ్తలు అందిస్తూ నూటికి 80 మంది చదువుకొనే పాఠశాలలను చిన్నచూపు చూస్తున్నారు. 20వేల పోస్టులు ఇప్పటికీ నింపలేదు.

## నెల్లూరు 5వ మహాసభల తర్వాత

1989 జూన్ నెలలో నెల్లూరులో 5వ మహాసభలు జరిగాయి. ఫ్యాప్టో విధానాలు, దాని ఒంటెద్దు పోకడల కారణంగా మనం దాని నుండి విడివడి నాల్గు సంఘాలతో జాక్టాగా ఏర్పడి 1989 మార్చి, అక్టోబర్ నెలలలో పోరాటం సాగించి, అతి ముఖ్యమైన విషయాలు పరిష్కారం నిమిత్తం అగ్రిమెంట్ కుదుర్చుకోవటం జరిగింది.

యు.టి.ఎఫ్. జనరల్ కౌన్సిల్ నిర్ణయం మేరకు 1989 సెప్టెంబర్ 5 నుండి 19 వరకు ముఖ్యమంత్రికి 50,000 కార్డులు పోస్టుచేయడం జరిగింది. సెప్టెంబర్20,21,22 తేదీలలో మండలాల ముందు ధర్నాలు, 89 అక్టోబర్ 6న జిల్లా కేంద్రాలలో ధర్నాలు జరిగాయి. ఫలితంగా విద్యా శాఖ కార్యదర్శి పాఠశాల విద్యా డైరెక్టర్‌తో చర్చలు జరిపి కొన్ని సమస్యలు పరిష్కరింపబడ్డాయి.

ఈ సందర్భంలోనే శాసన మండలి ఏర్పాటుకు ప్రయత్నాలు జరుగుచుండగా, అసెంబ్లీలోను, పార్లమెంటులోను, ప్రాథమికోపాధ్యాయులకు ఓటింగ్ హక్కు, శాసన మండలి నియోజక

వర్గాల పునర్ విభజన గురించి చర్చ జరుగునట్లు కృషి చేయుటకు దేశ ప్రధానికి ప్రతి పాఠశాల నుండి 23-5-93న 50వేల కార్డులు పోస్టు చేయబడ్డాయ్. న్యాయ శాఖా మంత్రికి మన శాఖల నుండి టెలిగ్రాములు ఇప్పించటం జరిగింది. పార్లమెంటులోను, అసెంబ్లీలోను చర్చ జరిగింది. అయితే ఈలోగా శాసన మండలి ఏర్పాటు వెనకపట్టు పట్టింది.

హైద్రాబాద్‌లో జరిగిన మత ఘర్షణలకు నిరసనగా, 1991 జనవరి 30న హైద్రాబాద్‌లో అందరితో కలసి, రాష్ట్ర వ్యాప్తంగా మనం మాత్రమే మత సామరస్య ప్రదర్శనలు నిర్వహించాము. ఉపాధ్యాయులలో ఉత్సాహం, ప్రజలలో మంచి కదలిక, అధికారుల నుండి మంచి ప్రోత్సాహం వచ్చింది.

1991 సెప్టెంబర్ 4న నల్లబ్యాడ్జీలతో పనిచేసి, సెప్టెంబర్ 10,11,12,13 తేదీలలో మండల, పట్టణ కేంద్రాలలో ధర్నాలు, సెప్టెంబర్ 20న జిల్లా కేంద్రాలలో ధర్నాలు నిర్వహించబడ్డాయి. 47 సమస్యలతో ముఖ్యమంత్రికి విజ్ఞాపన పత్రం అందజేయబడింది.

1991 ఏప్రిల్‌లో ప్రభుత్వానికి నోటీసు యిచ్చి ప్రత్యక్ష చర్యకు జాక్టా పక్షాన నాల్గు సంఘాలు సిద్ధపడ్డాయి. కేబినెట్ కమిటీ, అధికారులతో 1991 ఏప్రిల్ 25,26 తేదీలలో చర్చలు జరిపి ఒప్పందానికి రావడం జరిగింది. వాటిలో పే కమిటీ నియామకం కరువు భత్యం పెంపుదల పరిష్కరింపబడ్డాయి.

1991 ఆగస్టు 28 నుండి 31 వరకు రాష్ట్ర వ్యాప్తంగా మండల కార్యాలయాల ముందు 20 వేల మంది ధర్నాలు చేశారు. 1991 సెప్టెంబర్ 4 నుండి 10 వరకు కలెక్టర్ కార్యాలయాల ముందు 5వేల మంది ధర్నాలు చేశారు. హైద్రాబాద్‌లో 1991 సెప్టెంబర్ 16న జాక్టా పక్షాన 3వేల మంది ధర్నా చేశారు. అందులో 2000 మంది మన కార్యకర్తలు పాల్గొన్నారు. సెప్టెంబర్ 17 నుండి రిలే నిరాహార దీక్షలు జరిగాయి. 500 మంది ఉపాధ్యాయులు పాల్గొన్నారు. అసెంబ్లీలో 304 నిబంధన క్రింద చర్చ జరిగింది. రికవరీలన్నీ రద్దు చేస్తామన్నారు.

1992 మార్చి 5,6 తేదీలలో జిల్లా కేంద్రాలలో రిలే నిరాహార దీక్షలు, 7వ తేదీ ధర్నాలు జరిగాయి. హైద్రాబాద్‌లో సెక్రటేరియట్ ముందు 27-3-92న 1000 మందితో ధర్నా జరిగింది. 92 మార్చి 28,29,30,31 తేదీలలో జాక్టా పక్షాన రిలే నిరాహార దీక్షలు జరిగాయి.

## 1-8-92 నుండి 31-7-93 వరకు

ఈ సంవత్సరం అత్యంత కీలకమైన సమయం. మనం అత్యంత ప్రధాన కర్తవ్యాలు నెరవేర్చాము. కొన్ని విజయాలు సాధించాము. కేంద్ర ప్రభుత్వం చేపట్టిన నూతన ఆర్థిక, పారిశ్రామిక విధానాల ఫలితంగా ఉద్యోగులు, కార్మిక వర్గం అనేక ఇబ్బందులు ఎదుర్కొన్నారు. ప్రజల బాధలు వర్ణనాతీతం. అన్నిటి ధరలు ఆకాశానికి ఎగిరాయి.

గోల్డెన్ హాండ్‌షేక్ పేరుతో 20 లక్షల మంది నిరుద్యోగు లయ్యారు. పాఠశాలల్లో ఖాళీ పోస్టులు నింపుటలేదు. బిజూపట్నాయక్ కమిటీ రిపోర్టు ప్రకారం, జీతాలు, కరువు భత్యం పెంచరాదని, ఎల్.టి.సి. రద్దు చేయాలని, శలవు అమ్ముకొనే విధానం తీసివేయాలని ఆలోచనలు సాగుచున్నాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులు, కార్మికులు 1991 నవంబరు 29న, 1992 జూన్ 16న దేశవ్యాప్తంగా సమ్మె చేశారు. వారికి మన మద్దతు తెలియజేసి, ప్రదర్శనలు జరిపాం.

## ఛలో ఢిల్లీ

1992 నవంబరు 25 పార్లమెంటు ముందు ప్రదర్శనకు పిలుపు యివ్వబడింది. ఢిల్లీలో విపరీతమైనచలి. అయినా పట్టుదలతో ఢిల్లీ ఎర్రకోట నుండి పార్లమెంటు ఎదుట బోట్‌క్లబ్ వరకు పది లక్షల మందితో అపూర్వంగా మహా ప్రదర్శన జరిగింది.

మన రాష్ట్రం నుండి యు.టి.యఫ్. పక్షాన 80 మంది మాత్రమే అందులో పాల్గొన్నాము. ఇంకా వస్తామన్నా చలి కారణంగా మనం నిరుత్సాహపరిచాము. విజయనగరం 3,తూర్పుగోదావరి 9, పశ్చిమగోదావరి 10, కృష్ణ 4, గుంటూరు 4, ప్రకాశం 9, కడప 2, కర్నూలు 4, అనంతపురం3, ఖమ్మం 5, నల్గొండ 3, మహబూబ్‌నగర్ 3, హైద్రాబాద్ 13, ఆదిలాబాదు 4 మొత్తం 80 మంది పాల్గొన్నారు. బోట్‌క్లబ్ వద్ద బ్రహ్మాండమైన బహిరంగ సభ జరిగింది. వెంటనే ప్రభుత్వం తన విధానాలు విడనాడుకోవాలని, లేనిచో మరింత తీవ్రతర కార్యక్రమం చేపట్టగలమని ఉద్యోగులు హెచ్చరించారు.

ఫలితంగా నిలిచిపోయిన కరువు భత్యం సాధించుకున్నాము. పి.ఆర్.సి. రిపోర్టులు అమలు జరిగాయి. అయినా ప్రభుత్వం తన విధానాలు విడనాడలేదు. తిరిగి సెప్టెంబర్ 9న పోరాటానికి పిలుపుయివ్వటం జరిగింది.

## ఏజన్సీ సదస్సు

తూర్పుగోదావరి జిల్లాలో 1992 ఆగస్టు 8,9 తేదీలు ఆర్. చోడవరంలో అత్యంత జయప్రదంగా ఏజన్సీ సదస్సు జరిగింది. వర్షం కురుస్తున్నా 9 జిల్లాల నుండి ఏజన్సీ టీచర్లు 1000 మంది హాజరయ్యారు. విధానపత్రం ప్రవేశపెట్టబడింది. చర్చలు జరిగాయి. మంత్రి సమరసింహారెడ్డి, అధికారులు పాల్గొన్నారు. ట్రయిబల్ వెల్‌ఫేర్ కమీషనర్‌గార్కి 41 సమస్యలతో మెమోరాండం అందజేసి చర్చించాం. తూర్పుగోదావరి జిల్లా సమర్ధవంతంగా సభలు నిర్వహించింది. ఆ జిల్లాలోని 7 ఏజన్సీ మండలాలలోని ఉపాధ్యాయులు మహాసభలకు ఆర్థికంగా విరాళాలు ఇచ్చి ఆదుకున్నారు. ఇతర జిల్లాల నుండి కూడా సహకారం అందింది.

26-10-92న హైద్రాబాద్ ట్రయిబల్ వెల్‌ఫేర్ కమీషనర్ గారితో చర్చలు జరిగాయి. 45 అంశాలపై ఒప్పందం కుదిరింది. కొన్నిటిపై మాత్రమే ఉత్తర్వులు వచ్చాయి. మిగిలినవి రావలసి వుంది.

## యు.టి.యఫ్. పోరాట కార్యక్రమం ఛలో అసెంబ్లీ

జనరల్‌కౌన్సిల్ ఛలో అసెంబ్లీ పోరాటానికి పిలుపు యిచ్చింది. ఈ కార్యక్రమానికి మన సభ్యులలో మంచి వూపు వచ్చింది. 25 సమస్యలతో ప్రభుత్వానికి నోటీసు ఇచ్చాము. విరివిగా కరపత్రాలు వేశాము. విస్తృత ప్రచారం జరిగింది.

1992 సెప్టెంబర్21న 5000 మందితో ఇందిరాపార్కు నుండి బయలుదేరిన మహా ప్రదర్శన 2 గంటలకు పైగా ట్రాఫిక్‌ని ఆపివేసి 7 కిలోమీటర్లు సాగి లాల్‌బహదూర్ స్టేడియం వద్దకు చేరుకున్నది. ప్రతినిధి వర్గం స్పీకరుకు మెమోరాండం అందజేసింది. అసెంబ్లీలో విషయాలు ప్రస్తావించబడ్డాయి.

ఇటీవలి కాలంలో ఇంత ప్రదర్శన జరగలేదు. మన కార్యకర్తల శక్తి ఉద్యమ బలం ఇతరులు గమనించక తప్పలేదు. ఐక్య కార్యాచరణ సమైక్యంగా పోరాటం సాగించేదానికి అంగీకరించవలసి వచ్చింది.

ఉద్యమ చరిత్రనే మలుపుతిప్పిన ఈ మహా ప్రదర్శన జయప్రదంగా నిర్వహించినందులకు, ఉపాధ్యాయులకు, ఉద్యమ కార్యకర్తలకు అభినందనలు తెల్పుకుంటున్నాం. ఈ ప్రదర్శనలో తూర్పుగోదావరి ప్రథమ స్థానం. పశ్చిమగోదావరి, ప్రకాశం ద్వితీయ, తృతీయ స్థానాలు పొందాయి. మిగిలిన వారందరూ కోటాలు మించి వచ్చారు.

## ఫ్యాప్టో జాక్టా పోరాట కార్యక్రమం

విడివిడిగా పోరాట కార్యక్రమం సాగిస్తున్న రెండు గ్రంటులు ఒకటిగా "యాక్షన్ కమిటీ ఫ్యాప్టో అండ్ జాక్టా" పేరుతో 7.1.93న ఏర్పడి, నల్గురు స్టీరింగ్ కమిటీగా నిర్ణయించుకొని 15 సమస్యలతో ప్రభుత్వానికి నోటీసు యిచ్చి దశలవారీ కార్యక్రమానికి పిలుపు యిచ్చింది. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి అన్ని జిల్లాల కలెక్టర్‌లకు 3.2.93న నోటీసు యివ్వడం జరిగింది. అదేరోజుప్రెస్ కాన్ఫరెన్సు జరిపి మార్చి 5 నుండి నిరవధిక సమ్మెకు కూడా పిలుపు యివ్వడం జరిగింది.

జిల్లా కలెక్టర్ కార్యాలయాల ముందు 22.2.93న ధర్నాలు అత్యంత జయప్రదంగా జరిగాయి. అన్ని జిల్లాలలో వేయినుండి రెండు వేలవరకు ప్రతినిధులు ధర్నాలలో పాల్గొన్నారు. మొత్తం 19 సంఘాలు కలిసి యిచ్చిన పిలుపు ఉపాధ్యాయులలో మంచి వాతావరణం తెచ్చింది. ప్రభుత్వంలో కదలిక వచ్చింది. హైద్రాబాదులో ధర్నాకు ప్రభుత్వం పర్మిషనునిరాకరిస్తే నిరసనగా నిలబడి ధర్నాచేసి, స్పీకర్ ద్వారా ముఖ్యమంత్రికి మన నిరసన అందజేశాము.

రాష్ట్రాన్ని 8 బ్లాకులుగా విభజించి ఫిబ్రవరి 24 నుండి 28 వరకు జిల్లాల టూరు జరిగింది. స్వల్ప వ్యవధిలో ఇది జరిగినా జిల్లాలోని ఉపాధ్యాయులలో మంచి వూపు వచ్చింది. అన్ని సమావేశాలలో వందల కొలది ఉపాధ్యాయులు పాల్గొని జయప్రదం చేశారు. సమ్మెకు తమ సంసిద్ధత తెలిపారు. పరిస్థితులు గమనించిన ప్రభుత్వం ఏక్షన్ కమిటీతో చర్చలు సాగించింది.

### చర్చలు – ఫలితాలు

1993 ఫిబ్రవరి 6,7 తేదీలలో విద్యాశాఖ కార్యదర్శి, పాఠశాల విద్యా డైరెక్టరు, ఇతర అధికారుల సమక్షంలో చర్చలు జరిగాయి. జిల్లాల్లో జరిగిన ధర్నాలు, ఉపాధ్యాయుల సంసిద్ధత గమనించిన తర్వాత ప్రభుత్వంలో మరింత కదలిక వచ్చింది. స్పీకరు గారికి మనం యిచ్చిన మెమోరాండం ముఖ్యమంత్రిగార్కి చేరింది. రాష్ట్ర వ్యాప్తంగా 10వ తరగతి పరీక్షలు నిర్వహించలేమని అధికారుల నుండి రిపోర్టులు వచ్చాయి. ఫలితంగా 1993 మార్చి 1 తిరిగి చర్చలు మొదలయ్యాయి.

1.3.93 చర్చలు గత అగ్రిమెంటు అమలు జరిగిన తీరు గురించి, 2.3.93న జరిగిన చర్చలు మనం ఇచ్చిన 15 సమస్యలలో పదింటిపై కేంద్రీకరించి జరిగాయి. విద్యాశాఖ ఫైనాన్సు వారితో 3.3.93న చర్చించింది. తిరిగి 4.3.93న విద్యాశాఖ, ఫైనాన్సు సెక్రటరీలూ ఇద్దరూ కలిసి మనతో చర్చలు జరిపారు. చివరకు కర్నూలు వెళ్ళివచ్చిన ముఖ్యమంత్రి గారితో ఫైనలు చేసుకొని, అర్ధరాత్రి గం. 12.00 లకు విద్యా మంత్రి సమక్షంలో అగ్రిమెంటుపై సంతకాలు జరిగాయి.

1. కేటగిరి 3 ఉపాధ్యాయులకు 1550-3050 స్కేలు అంగీకరించి ఉత్తర్వులు ఇచ్చారు.
2. కేటగిరి 2 ఉపాధ్యాయులకు 1991 జూన్‌లోగా టెస్టులు పాసయి ఉంటే 1.12.82 నుండి 15 సంవత్సరాల స్కేలు అంగీకరించారు. ఉత్తర్వులు కూడా వచ్చాయి.
3. అన్‌క్వాలిఫైడ్ కాలం 10-15 స్కేళ్ళకు బి.ఇ.డి.లకు అంగీకరించబడింది.
4. అదనపు ఇంక్రిమెంట్లు ఇచ్చుటకు సెకండరీ గ్రేడ్‌క్వాలిఫికేషన్ ఉండాలనే నిబంధన తొలగించుటకు అంగీకరించారు. ఉత్తర్వులు కూడా వచ్చాయి.
5. పంచాయతీ రాజ్ ఉపాధ్యాయులకు 1993-1996 బ్లాక్ పిరియడ్‌కు ఎల్.టి.సి. అంగీకరించారు. గతంలో వాడుకున్న వారికి బిల్లులు చెల్లించుటకు ఒప్పుకున్నారు. ఉత్తర్వులు కూడా వచ్చాయి.
6. ప్రావిన్సియలైజ్ అయిన వారికి ప్రమోషన్ అవకాశాల గురించి వెంటనే ఇస్తామన్నారు.
7. ఎయిడెడ్, మున్సిపల్ వారి జీతాలను బడ్జెట్ కంట్రోలు నుండి తొలగించి రెగ్యులర్‌గా యిస్తామన్నారు.
8. ఎయిడెడ్ వారికి 1986 పి.ఆర్.సి.లో రావలసిన రు.600/- అడ్‌హాక్ మొత్తం చెల్లిస్తామన్నారు. ఉత్తర్వులు వచ్చాయి కాని గ్రాంటు ఇంకా విడుదల కాలేదు.

మిగిలిన సమస్యలు సెలక్షన్ గ్రేడు రికవరీ 878 సూపర్ న్యూమరరీ పోస్టులు, ఏజన్సీ అలవెన్స్‌లు, పని చేసిన రోజులను బట్టి ఎరండ్ లీవ్ మొదలైనవి ఒక నెల రోజుల లోపల చర్చలు జరిపి ఒప్పందానికి రావడానికి అంగీకరించబడింది.

ఇంత వరకు తిరిగి చర్చలు జరగలేదు. పై 8లో మూడు సమస్యలపై ఇంకా ఉత్తర్వులు రాలేదు.

## పే కమిటీ రిపోర్టు–వివరాలు

1991 ఏప్రిల్ 25 అగ్రిమెంట్ ప్రకారం 1991 ఆగస్టులో పే కమీషనర్‌గా శ్రీ శంకరగుడుస్వామి నియమింపబడ్డారు. నవంబర్ 29న మనం పి.ఆర్.సి.కి రిపోర్టు యిచ్చాం. శాస్త్రీయ దృక్పథంతో మనం పే కమిటీకి సూచనలు చేశాం. ఛటోపాధ్యాయ స్కేల్స్ దృష్టిలో పెట్టుకున్నాం. కొఠారి కమిటీ రికమండేషన్ పరిగణనలోనికి తీసుకున్నాం. వేజెస్ కమిటీ రిపోర్టు 15వ త్రైపాక్షిక సమావేశ సూచనలు వివరించి స్కేల్స్ యిమ్మన్నాం.

ఆయన 92 జూన్ 9న మనలను చర్చలకు పిలిచారు. మనం చెప్పినవి స్పష్టంగా వివరించాం. ఆధారాలు చూపించాం. అనాలసిస్ చెప్పాం. వివరంగా చర్చించాం. పరిశీలించి తప్పక ప్రభుత్వానికి సూచనలు చేస్తాను అన్నారు. వారికి 1992 ఆగస్టుతో టైం అయిపోగా మరో ఆరు మాసాలు పొడిగించటం జరిగింది. ఆందోళన చేయగా 1-7-92 నుండి తాత్కాలిక సహాయం రు.100/-ల చొప్పున ఇచ్చారు.

చివరకు పే కమీషనర్ 8-4-93న ప్రభుత్వానికి రిపోర్టు ఇచ్చారు. 15-4-93న జరిగిన కేబినెట్ దానిని ఆమోదించి ప్రకటించింది.

పే కమిటీ రిపోర్టు 1-1-93నుండి అమలు జరుపుతూ 1-4-93 నుండి ఆర్థిక సహాయం అన్నారు. రు.100-500 మించి పెరుగుదల వుండరాదన్నారు. వుంటే క్రిందిస్టేజిలో ఫిక్సేషన్ చేసి పి.పి.గా పెడతామన్నారు.

వెయిటేజి 10 శాతం ఇస్తామన్నారు. ఇంటి అద్దె తగ్గించి 16, 10,8 శాతంగా ప్రకటించారు. ఇకముందు పెరగబోవు డి.ఏ.లు కేంద్రం పెంచిన ప్రతి పాయింటుకు 0.55,0.463, 0.422 శాతం ఇస్తామన్నారు.

ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీమ్ 8,16,24కు మార్చారు. 24 సంవత్సరములకు స్కేలు గాక ఒక ఇంక్రిమెంట్ ఇస్తామన్నారు. మాస్టర్ స్కేలు అంటూ ఇంక్రిమెంట్ రేటు ఘోరంగా దిగజార్చి వేశారు. 27 స్కేల్స్ 32గా పెంచారు.

స్కేల్స్ మాత్రం మనం అడిగిన నాటికి దగ్గరగా ఇచ్చారు. మొత్తం 83 శాతం కరువు భత్యం మెర్జ్ చేశారు. ఇచ్చిన తాత్కాలిక సహాయం తిరిగి కట్టమన్నారు.

కొఠారి ప్రతి 5 సంవత్సరముల కొకసారి పే రివిజన్

జరపాలన్నారు. ఆ ప్రకారం ఈ పి.ఆర్.సి. 1-7-91 నుండి అమలు జరగాలి. లేక తాత్కాలిక సహాయం ఇచ్చిన 1.6.92 నుండి గాని, 83 శాతం కరువు భత్యం అమలు జరిపిన 1.7.92 నుండి గాని అమలు జరపాలి. కేంద్రం వలే 20 శాతం వెయిటేజీ యివ్వాలి. తాత్కాలిక సహాయం పేలో మెర్జ్ చేయాలి.

ఇంటి అద్దె పాత శాతం పునరుద్ధరించాలి. అదనపు ఇంక్రిమెంట్లు వుంచాలి. రిటైరైన వారికి తగ్గించిన గ్రాట్యుటీ పెంచాలి. పెన్షన్ రేటు, కమ్యుటేషన్ చేసుకునే డబ్బు తగ్గించే ఆలోచన విరమించాలి. పి.ఆర్.సి. వల్ల లాభాలు రావలసి వుండగా, కోతలు పడే పరిస్థితి పోవాలి.

అందుకు అందరితో కలిసి గాని విడిగా గాని మనం పోరాట కార్యక్రమం చేపట్టవలసి వుంది. అందుకు ఈ మహాసభ తగు సూచనలు చేయాలని కోరుతున్నాను.

## రాయబారాలు

ప్రతినెల అధికారులను కలిసి రాయబారములు చేస్తున్నాం. సమావేశాలు ఆమోదించిన తీర్మానాలు వారికి అందజేస్తున్నాం. తక్షణం ఎదురైన అనేక సమస్యలు అధికారుల దృష్టిలో వుంచుతున్నాం. అగ్రిమెంట్లో అంగీకరించిన విషయాలపై జి.ఓల విడుదలకు కృషి చేస్తున్నాం. వచ్చిన జి.ఓ.లపైన సవరణలకు కృషి చేస్తున్నాం. కోర్టు తీర్పులు వచ్చిన సందర్భంలో ఇంక్రిమెంట్ తేదీకి ఇంక్రిమెంట్ గురించి గాని, క్వాలిఫైడ్ టీచర్ల గురించి గాని, ఏజన్సీ అలవెన్స్‌ల గురించి గాని, తగు ఉత్తర్వులకు కృషి చేస్తున్నాం.

కోర్టు తీర్పులపై కొందరు ఉపాధ్యాయులను దోపిడీ చేస్తూ వుంటే మనం దానిని అడ్డుకొని తక్కువ ఖర్చుతో అదే రిట్స్ వేయించి స్టేలు తేవడం జరిగింది. వాటిని అందరికీ వర్తింపచేయమని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశాం.

జిల్లాలలో మండల, పట్టణ పరిధిలో మన శాఖలు సాగిస్తున్న పోరాటాలకు మద్దతుగా లెటర్స్ పెట్టి సమస్యలు వెంటనే పరిష్కరించమని కోరుతున్నాము. ఆయా స్థాయిలలో జరిగే మీటింగులలో మనం పాల్గొనుచున్నాము.

హైద్రాబాద్ ఆఫీసులో అసోసియేట్ అధ్యక్షులు శ్రీ రామ కోటేశ్వరరావు గారు వుండి బాధ్యతలు చూస్తున్నారు. వివిధ జనరల్ వ్యక్తి గత సమస్యల పరిష్కారానికి కృషి చేస్తున్నారు. వారితో అధ్యక్ష ప్రధాన కార్యదర్శులు కలిసి వివిధ సమస్యలపై అధికారులతో రాయబారాలు జరపడం జరుగుచున్నది.

గౌ.ముఖ్యమంత్రిని శ్రీ జి.లక్ష్మయ్య "డైస్-నాన్" సమస్యపై శ్రీ బోడేపూడి వెంకటేశ్వరరావు ఎం.ఎల్.ఏ. గారితో కలిసి మహజరు సమర్పించాం. పంచాయతీరాజ్ శాఖామాత్యులు శ్రీ డి.నరసింహారెడ్డి గారిని కలుసుకొని బదిలీలపై చర్చించి మన సంఘ సూచనలతో మహజరు సమర్పించాం. విద్యాశాఖామాత్యులు శ్రీ పి.వి. రంగారావు గారిని కలుసుకొని వివిధ పాఠశాలల్లో ఖాళీ పోస్టులను భర్తీ చేయాలని, ముఖ్యంగా ప్రధానోపాధ్యాయుల పోస్టులు వెంటనే పూరించాలని మహజరు సమర్పించాం.

పంచాయతీరాజ్, పాఠశాల విద్యా శాఖల కార్యదర్శులతోను, పంచాయతీరాజ్, ట్రైబల్ వెల్ఫేర్, పరీక్షల కమీషనర్లతోను, ఎ.జి. ఆఫీసులోను, వివిధ సమస్యల పరిష్కారానికి అనేక పర్యాయాలు రాయబారాలు చేశాం. ఉపాధ్యాయులకు ఎల్.టి.సి. గుర్తింపు, ఏజన్సీ అలవెన్స్‌లు 1-3-93 తర్వాత పొడిగింపు, పండగ అడ్వాన్స్‌ల గ్రాంటు పెంపుదల, బి.ఇడి.లకు సెకండరీ పోస్టుల కల్పన, ఎంప్లాయీస్ వెల్ఫేర్ ఫండ్ టీచర్ వెల్ఫేర్ ఫండ్‌కు బదలాయింపు, ఏజన్సీ ఉపాధ్యాయుల సమస్యలపై చర్చల తర్వాత యిచ్చిన మినిట్స్ అమలు, ఇంక్రిమెంట్ రికవరీల చెల్లింపు, బి.సి.ఏ. బకాయిల చెల్లింపు, కార్యాలయాల యింటి పన్ను మినహాయింపు మున్నగు సమస్యలపై ప్రాతినిధ్యం చేశాం. గన్నవరం మండల ఉపాధ్యాయుల సమస్య, 21 పండితుల సమస్య, కృష్ణాజిల్లాలో అక్రమ ప్రమోషన్లపై ప్రత్యేకంగా అనేక వ్యక్తిగత ఉపాధ్యాయుల సమస్యలపై ప్రాతినిధ్యం చేశాం. అసెంబ్లీలో 301 క్రింద, కట్‌మోషన్ క్రింద కూడా ఆయా సమస్యలపై కేంద్రీకరించడం జరిగింది. 2. ఫ్యాప్టో, జాక్టా సంయుక్త సమావేశాలు ఈ సమావేశాలు హైదరాబాదులో అనేకసార్లు జరగటానికి మన సంఘం గట్టి కృషిచేసింది. దాని ఫలితంగానే దశలవారీ పోరాట కార్యక్రమం జరపాలనే నిర్ణయం, ఫ్యాప్టో, జాక్టా కలిసి యాక్షన్ కమిటీ, స్టీరింగ్ కమిటీలు ఏర్పడటం, జాక్టా పక్షాన వివిధ జిల్లాలలో కన్వీనర్లు ఎన్నుకోబడటం, 22-2-93న జిల్లా కలెక్టర్ల కార్యాలయాల ముందు, హైదరాబాద్‌లో సచివాలయం వద్ద ధర్నాలు నిర్వహించడం, మార్చిలో నిరవధిక సమ్మెకు పిలుపునివ్వడం, తత్ఫలితంగా జరిగిన చర్చలనంతరం ఒక ఒప్పందం కుదిరిన మీదట జి.ఓలు, పి.ఆర్.సి. పొందగలగడం జరిగిందనేది మనం మరచిపోరాదు. సెమినార్లు - జూన్ 4వ తేదీ నుండి 7వ తేదీ వరకు ఆల్ ఇండియా ఫెడరేషన్ ఆఫ్ యూనివర్శిటీ అండ్ కాలేజీ టీచర్స్ ఆర్గనైజేషన్ (AIFUCTO) తరపున ఆహ్వానం వచ్చింది. "ప్రైవేటైజేషన్ మరియు ప్రాబ్లెమ్స్ ఆఫ్ ఫైండింగ్ యూనివర్సిటీస్" అనే సబ్జెక్టుపై సెమినార్ జరిగింది. శ్రీయుతులు ప్రొ. మల్లారెడ్డి, ప్రొ. ఎస్.కె. వర్మ, ప్రొ. జయశంకర్ మరియు వివిధ రాష్ట్రాల నుండి వచ్చిన ప్రతినిధులు చర్చలో పాల్గొని పత్రాలు సమర్పించారు. కాలేజీ ఫీజులు పెంచరాదని, ఇంతకు ముందు ఫిలాంత్రఫీ ఇన్ బిజినెస్ ఆలోచనని, ఇప్పుడు బిజినెస్ ఇన్ ఫిలాంత్రఫీ అనియు ఆలోచనని, సెంట్రల్ కాలేజీలకు 80%, మిగిలిన కాలేజీలకు 20% ఫండ్స్ ఇవ్వడం అన్యాయమని, హయ్యర్ ఎడ్యుకేషన్‌లో ప్రైవేటైజేషన్ పనికిరాదని అభిప్రాయాలు వెల్లడించారు.

జూలై 8వ తేదీన హైదరాబాద్‌లో జూబిలీ హాలులో మేనేజిమెంటు ఆఫ్ ఎడ్యుకేషన్‌పై సెమినార్ జరిగింది. విద్యామంత్రి, విద్యాశాఖ కార్యదర్శి, ప్రభుత్వోద్యోగులు, విద్యావేత్తలు, మాజీ ఎం.ఎల్.సి.లు, జిల్లా కలెక్టర్లు, ఎం.ఎల్.ఏ.లు, ఉపాధ్యాయ సంఘాల నాయకులు పాల్గొన్నారు. యు.టి.ఎఫ్. పక్షాన మనం పాల్గొన్నాం. మూడంచెల పద్ధతిలో పంచాయతీరాజ్ విద్యను కేంద్రీకరించే భాగంగా, ఎలిమెంటరీ పాఠశాలలను పంచాయత్ బోర్డులకప్పగించాలని, యు.పి.జడ్.పి. పాఠశాలలను పూర్వంలాగే ఉంచాలని నిర్ణయాలు ప్రభుత్వం తీసుకుంటోంది. విద్యామంత్రిగారు మనముందు కొన్ని ప్రశ్నలుంచారు.

| | | | |
|---|---|---|---|
| 1. సిలబస్ను ఎవరు రూపొందించాలి? | రాష్ట్ర పరిధిలోనా | జిల్లా పరిధిలోనా? | పంచాయతీ పరిధిలోనా? |
| 2. పాఠ్య గ్రంథాలనుఎవరు ముద్రించాలి? | " | " | " |
| 3. ఉపాధ్యాయులనెవరు నియమించాలి? | " | " | " |
| 4. పరీక్షలు ఎవరు నిర్వహించాలి? | " | " | " |
| 5. పాఠ్య గ్రంథాలు ఎవరు వ్రాయాలి? | " | " | " |
| 6. వీటన్నిటికి ఎవరు బాధ్యతవహించాలి? | " | " | " |

పంచాయతీలకధికారాలు పరిపాలనాపరమైనవి ఇవ్వరాదని, భౌతిక సౌకర్యాలు, భవన నిర్మాణం, క్రమశిక్షణ మున్నగు విషయాలలో

వారు ప్రధాన పాత్ర వహించాలని, పాఠ్యగ్రంథాల రచనలో ఆయా తరగతులు బోధించు ఉపాధ్యాయులు ప్రముఖ పాత్ర వహించాలని, పరీక్షా విధానంలో మార్పులు తేవాలని, మూడు అంచెలలోను విద్యా బోర్డులు ఏర్పాటు చేయాలని అభిప్రాయాలు వెల్లడించాము. ఒక సంఘం వారు రెండంచెల పాలనా పద్ధతి ఉండాలన్నారు. యు.పి. స్కూళ్ళ వరకు మండల పరిధిలోను, హైస్కూళ్ళు జి.ప్ర.ప. పరిధిలోను ఉండాలన్నారు. కామన్ పరీక్షల బోర్డులను ఎత్తివేయాలన్నారు. విద్యావేత్తలు కొఠారి కమీషన్ రిపోర్టుమేరకు రాజకీయా తీతమైన స్వచ్ఛంద విద్యా బోర్డులకు విద్యను అప్పగించాలన్నారు.

జూన్ 17న స్టేట్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎడ్యుకేషన్ టెక్నాలజీ (ఎస్.ఐ.ఇ.టి.) రామంతపూర్ హైదరాబాద్ సంస్థ డైరెక్టర్ శ్రీ జి.వి. సుబ్బారావు మన సంఘాన్ని ఆహ్వానించారు. ఇతర సంఘాలతో పాటు, ఎలిమెంటరీ పాఠశాలల పిల్లలకు, టి.వి. ద్వారా విద్య గరపుటకు కావలసిన పాటలు, గేయాలు, పద్యాలు, కథలు, నాటి కలు, బుర్రకథలు మొదలగునవి ఆయా పాఠ్యగ్రంథాల సిలబస్ ననుసరించి పాఠాలు అందజేయుటకు గాను ఉపాధ్యాయులలో అభిరుచి, సామర్థ్యంగల వారికి ప్రోగ్రాం అవకాశాలిస్తామని, అందుకు ఉపాధ్యాయులు సహకరించాలని కోరారు. ఖమ్మంజిల్లాలోని యు.టి.యఫ్. అకడమిక్ సెల్ పక్షాన ప్రోగ్రాం యివ్వవచ్చని వారికి చెప్పాం. వారు రూపొందించిన సిలబస్, టైంటేబుల్ మన మాసపత్రికలో ప్రతినెల ప్రచురించాలని, పాఠశాలల్లో ఈ అవకాశం వినియోగించు కోవాలని వారు కోరారు.

## జాయింట్ స్టాఫ్ కౌన్సిల్‌లో సభ్యత్వం

యు.టి.యఫ్. కు 1988 జనవరి 13న నెం.15లో జాయింట్ స్టాఫ్ కౌన్సిలులో సభ్యత్వం వచ్చింది. ప్రభుత్వ గుర్తింపు పొందుటకు 50 వేల కార్డులు పోస్టుచేసి, ఆందోళనకు దిగవలసి వచ్చింది. ప్రభుత్వ గుర్తింపు పొందిన 41 సంఘాలలో జాయింట్ స్టాఫ్ కౌన్సిల్‌లో 34 మాత్రమే సభ్యత్వం కల్గివున్నాయి, మిగిలిన 7 సంఘాలకు సభ్యత్వం లేదు.

అందుచేత 92 సెప్టెంబరు 6 నుండి 15 వరకు ఆందోళనా కార్యక్రమం చేపట్టవలసి వచ్చింది. రాష్ట్ర వ్యాప్తంగా అన్ని జిల్లాల నుండి 50 వేల కార్డులు పోస్టు చేయగా ప్రభుత్వం కదలి యు.టి.యఫ్.తో సహా మిగిలిన 6 సంఘాలకు జాయింట్ స్టాఫ్ కౌన్సిల్‌లో సభ్యత్వం కల్పిస్తూ జి.ఓ. యం.యస్. నెం.716, తేదీ 26-12-92న ఉత్తర్వు ఇచ్చింది.

జాయింట్ స్టాఫ్ కౌన్సిలులో 2వ గ్రూపులో ఉపాధ్యాయ సంఘాలు 4 ఉండగా మనం మూడవ వరుసలో వున్నాము. మొదట ప్రైమరీ టీచర్స్ అసోసియేషన్, తర్వాత డ్రాయింగ్ మరియు మ్యూజిక్, ఆ తర్వాత యు.టి.యఫ్. చివర పి.ఆర్.టి.యు. వున్నది. ఆ వరుసలో ప్రాతినిధ్యం వస్తుంది అప్పుడు 21 రోజుల సి.యల్స్ వస్తాయి. ప్రస్తుతం మొదటి సంఘం టరం జరుగుచున్నది.

## క్యూబాకు బియ్యం

క్యూబా పశ్చిమార్ధ గోళంలో వున్న సోషలిస్టు దేశం. దానిని ఎలాగయినా లొంగదీసుకోవాలని అమెరికా అష్టకష్టాలు పడుతున్నది. దాని పంచదార ఉత్పత్తులు అమ్ముడు కాకుండా చేయడమే కాదు, ఆహార పదార్థాలు ఆ దేశానికి అందకుండా చేస్తున్నది. మానవ హక్కుల గురించి నీతులు చెప్పే అమెరికా వైఖరిని ఖండిస్తూ భారతదేశం నుండి అనేక స్వచ్ఛంద సంస్థలు, వ్యక్తులు బియ్యం పంపించుటకు పిలుపు యిచ్చారు. మన సంఘం కూడా దానితో చేతులు కలిపింది. అన్ని శాఖలు స్పందించి బియ్యం సేకరించి పంపించాయి. వాటిని మనం వారికి అందజేశాం. మన పిలుపు రాక ముందే చాలా జిల్లాలు వసూలు చేసి పంపించాయి. మన ద్వారా వెళ్ళినవి మాత్రమే ఇక్కడ ఇస్తున్నాము.

| | |
|---|---|
| 1. గుంటూరు జిల్లా నుండి | రు. 3500.00 |
| 2. తూర్పుగోదావరిజిల్లా నుండి | రు.3220.00 |
| 3. ఖమ్మం జిల్లా నుండి | రు.2470.00 |
| 4. కృష్ణా జిల్లా నుండి | రు. 1508.00 |
| 5. వరంగల్ జిల్లా నుండి | రు. 622.00 |
| 6. నల్గొండజిల్లా నుండి | రు. 420.00 |
| 7. మహబూబ్‌నగర్‌జిల్లా నుండి | రు. 355.00 |
| మొత్తం పంపించినది | రు. 12,095.00 |

## సోదర సంఘాల మహాసభలు

పశ్చిమబెంగాలు సెకండరీ టీచర్సు సంఘం అక్టోబరు 16, 17, 18న మహాసభలు జరుపుకోగా మన సంఘం పక్షాన శ్రీయుతులు ఎ. వెంకటస్వామి, ఎన్. రామకోటేశ్వరరావు, కె. కేశవరెడ్డి, కె.జోజయ్య వెళ్ళడం జరిగింది. పశ్చిమబెంగాలు ప్రయిమరీ టీచర్సు సంఘం పక్షాన నవంబరు 21, 22, 23 తేదీలలో మహాసభలు జరిగిన వృడు శ్రీయుతులు ఎస్.ఆర్. పోలిశెట్టి, సుభాస్‌చంద్రబోసు, పి. సోమయ్య, పి. వెంకటేశ్వరరావు గారలు వెళ్ళడం జరిగింది.

అలాగే త్రిపుర ప్రయిమరీ టీచర్సు నుండి ఆహ్వానం రాగా తీరిక లేక వెళ్ళలేక పోయాం. దూరమేగాక, అక్కడ శాంతి భద్రతల సమస్య కూడా వున్నది. కేరళలో మహాసభలు జరగవలసి వున్నది.

## అమరజీవుల వర్ధంతి సభలు

అమరజీవి చెన్నుపాటి 24వ వర్ధంతి సభలు రాష్ట్ర వ్యాప్తంగా అన్ని జిల్లాలలోను, చాలా మండల, పట్టణ కేంద్రాలలో జరిగాయి. యు.టి.యఫ్. పెట్టిన తర్వాత శ్రీ పి.వి. సుబ్బరాజు, శ్రీ వి. చంద్రమౌళి గారలు మరణించారు. నెల్లూరు మహాసభలు, గుంటూరు మహాసభల మధ్య కాలంలో ముగ్గురు రాష్ట్రబాధ్యులు మరణించారు.

1974 నుండి ఐక్య ఉపాధ్యాయ పత్రిక ప్రధాన సంపాదకులుగా పనిచేస్తున్న శ్రీ మైనేనిగారు 1990 జనవరి 12న అకస్మాత్తుగా గుండెపోటు వచ్చి మరణించారు. వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ వాదెళ్ళ సీతారామాచారిగారు 5.7.91న మరణించారు. తూర్పుగోదావరి జిల్లా ఉద్యమ నిర్మాత, రాష్ట్రసబ్‌కమిటీ సభ్యులు శ్రీ వి. సూర్యనారాయణరాజు 26.3.93న మరణించిరి. ఇంత స్వల్పకాలంలో ముగ్గురు ముఖ్యకార్యకర్తలు మరణించుటం, ఉద్యమానికి తీరని లోటు. వారి సంతాపసభలు జరిగాయి. వందలాదిమంది ఉపాధ్యాయులు పాల్గొన్నారు. అత్యంత జయప్రదంగా జరిగాయి.

శ్రీ మైనేని పేర గుంటూరులో భవనం నిర్మించబడింది. శ్రీ సూర్యనారాయణ రాజుపేర కాకినాడలో భవనం పై హాలు నిర్మించుటకు పిలుపుయిచ్చారు. ప్రతి సంవత్సరం చెన్నుపాటి సంతాపసభలు రాష్ట్రవ్యాప్తంగా జరుగుతున్నాయి. మిగిలిన అమరజీవుల సంతాపసభలు ఆయా జిల్లాలు ప్రతిసంవత్సరం జరిపి, వారి ఆశయాలకు అంకితమై, ఉద్యమాన్ని నిర్వహించుటకు దీక్షగైకొనాలి.

చెన్నుపాటి జీవిత చరిత్ర సేకరించి ప్రచురించాలని శ్రీ ఇ. అప్పారావు గారికి బాధ్యత ఇవ్వగానే సేకరించారు. దానిని ప్రచురించవలసివున్నది.

## యు.టి.ఎఫ్. భవనాలు

1. విజయవాడలో చెన్నుపాటి పేర 9.12.78న స్వంత భవనం ఏర్పాటుచేసుకొని, అక్కడనుండి రాష్ట్ర కార్యాలయ నిర్వహణ, ఐక్య ఉపాధ్యాయపత్రిక ప్రచురించడం, అధ్యాపకదర్శినిలు ప్రచురించడం చేస్తున్నాం.
2. హైదరాబాదులో ఉద్యమ అవసరాలకు, 10.9.83న భవనం కొనుక్కొని కార్యకలాపాలు నిర్వహించుచున్నాము.
3. తూర్పుగోదావరి: కాకినాడలో మంచి భవనం నిర్మించుకొని 14.7.1990న ప్రారంభించటం జరిగింది. దానిపై శ్రీ వి. సూర్యనారాయణరాజుగారి పేర హాలు నిర్మించుటకు ఏర్పాట్లు చేస్తున్నారు.
4. పశ్చిమగోదావరి : జిల్లా కేంద్రమయిన ఏలూరులో రెండు అంతస్తుల భవనం నిర్మించి శ్రీ పి.వి. సుబ్బరాజుగారి పేరుపెట్టి 22.12.90న ప్రారంభోత్సవం చేశారు.
5. గుంటూరు : గుంటూరు జిల్లాశాఖ కార్యాలయం శ్రీ మైనేని పేర నిర్మించి, 12.1.91న ప్రారంభించిరి. మన ఉద్యమ కార్యకర్త శ్రీ వై.ఎల్. నారాయణగారి కుమారుడు కెప్టెన్ ప్రసాద్ పేర హాలు నిర్మించుటకు రు.50 వేలు యివ్వగా మీటింగుహాలు నిర్మించారు.
6. ప్రకాశం : ఒంగోలులో జిల్లా ఆఫీసు భవనం కొన్నారు. దానిపై మీటింగుహాలువేసి 1989 డిశెంబరులో ప్రారంభించుకున్నారు.
7. నెల్లూరు: చాలాకాలం క్రితం భవనం కొని దానిని కూల్చి నూతన భవనం నిర్మించి 9.2.91న ప్రారంభం చేశారు.
8. చిత్తూరు: తిరుపతిలో జిల్లా ఆఫీసు భవనం నిర్మించుకొని 16.8.92న ప్రారంభించారు.
9. నల్గొండ: స్థలం చాలా పెద్దదే కొన్నారు. దానిలోముందు ఆఫీసుకు ఒక భవనం నిర్మించి 23.7.91న ప్రారంభించారు. హాలు నిర్మించుటకు ప్రక్కనే చాలా స్థలం వుంది.
10. ఖమ్మం : అందరికంటే ముందు స్థలం కొన్నారు. దానిలో అన్ని జిల్లాల కంటె పెద్ద భవనం, రెండు అంతస్తులలో ప్రస్తుతం నిర్మించుతున్నారు.
11. మహబూబ్‌నగర్ : స్థలం చాలావున్నాముందు ఆఫీసు నిర్వహించుటకు చిన్న భవనం నిర్మించుకున్నారు. హాలు నిర్మించుటకు కృషిచేయాలి.
12. కరీంనగర్, వరంగల్ జిల్లాలో స్థలం, బ్యాంకులో కొంత డబ్బు ఉంది.
13. కృష్ణాజిల్లా బందరులో భవన నిర్మాణానికి స్థలానికి అగ్రిమెంటు జరిగింది. అమలాపురం, మధిర, కలువాయి, కల్వకుర్తిలలో స్థానిక ఆఫీసులకు భవనాలు వున్నాయి. కోటలో, ఘనపూర్‌లలో స్థలాలు వున్నాయి.

మన భవనాలు, సంఘకార్యకలాపాల నిర్వహణకు, పనిమీద వచ్చిన కార్యకర్తల వసతికి, విద్యా విజ్ఞాన సమావేశాలకు ఉపయోగపడుచున్నవి.

## మహిళా సదస్సులు

ఉపాధ్యాయులలో మహిళలు మూడవ వంతు ఉన్నారు. కాని ఉద్యమాలలో పనిచేసేవారు నామమాత్రమే వున్నారు. ఇంటిచాకిరి, పిల్లల పోషణేగాక వారు సామాజిక యిబ్బందులు ఎన్నో ఎదుర్కోవాలి. వారికి అన్నీ సమస్యలే.

యు.టి.ఎఫ్. అందుకే అన్నిజిల్లాలలో మహిళా సదస్సులు నిర్వహించి కన్వీనర్‌లను ఎన్నికచేసి మహాసభలో ఒక సదస్సు నిర్వహించాలని తలపెట్టింది. దీనికి మంచి స్పందన వచ్చింది. చాలామంది మహిళలు ముందుకువచ్చారు.

భవిష్యత్‌లో దీనిని కొనసాగించాలి. మరింత నిర్మాణయుతంగా పనిచేయించాలి. సమస్యల పరిష్కారానికి కార్యక్రమం చేపట్టాలి.

## ఐక్య ఉపాధ్యాయ ప్రచురణలు

ఉపాధ్యాయుల జీవితాలు జి.ఓ.లతో ముడిపడివున్నాయి. చాలా జి.ఓ.ల లభ్యం కాని పరిస్థితి ఏర్పడింది. అందుచేత యు.టి.ఎఫ్. ప్రచురణల విభాగం పక్షాన 1981లో అధ్యాపకదర్శిని-1 ప్రచురించాం. అది కొనసాగిస్తూ ఇప్పటికి 10 భాగాలు తీసుకువచ్చాం. వాటిని ఉపాధ్యాయులు సాదరంగా ఆహ్వానించి సముచితంగా ఆదరించారు. కొన్ని భాగాలు మూడు ముద్రణలు కూడా అయ్యాయి. ప్రస్తుతం 6, 7, 9 మహాసభల నాటికి తేవాలని అన్నీ సిద్ధం చేసినా ఆ పనిచేయలేకపోయాం.

ప్రతి సంవత్సరం మనం డైరీలు ప్రచురిస్తున్నాం. దానికి మనమే ఆద్యులం. ఈ సంవత్సరం మరిన్ని కొత్త విషయాలు చేర్చి దానిని తీసుకువచ్చాం. జిల్లాలవారిగా 1993 డైరీలు-తూర్పుగోదావరి 3361, పశ్చిమగోదావరి 2862, ప్రకాశం 2263, ఖమ్మం 2036, నెల్లూరు 1901, గుంటూరు 1723, కృష్ణ 1453, నల్గొండ 1167, చిత్తూరు 1102, మహబూబ్‌నగర్ 1001, వరంగల్ 663, ఆదిలాబాద్ 506, అనంతపురం 400, కర్నూల్ 345, కరీంనగర్ 315, కడప 300, శ్రీకాకుళం 284, హైద్రాబాద్ 266, విశాఖపట్నం 211, నిజాంబాద్ 163, విజయనగరం 158, రంగారెడ్డి 85, మెదక్ 17, ఇతరములు 533. మొత్తం 23115 డైరీలు ఖర్చు అయ్యాయి. అలాగే ప్రచురణల విభాగం పక్షాన వ్యాయామదర్శిని, గోర్కి కథలు 2 భాగాలు, తీసుకువచ్చాము. నిబంధనావళి, పాలసీ దీని పేరుతోనే ప్రచురిస్తూ వున్నాము.

## యు.టి.ఎఫ్. అకడమిక్ సెల్

అధ్యయనం, అధ్యాపనం, సామాజిక స్పృహ మన సూత్రాలు అందుకు టీచర్సు నిత్యం అధ్యయనం చేస్తూ వృత్తికి అంకితమై పనిచేయాలి. హక్కులు, బాధ్యతలు 2 నేత్రాలు. అందుచేత బాధ్యతలు సక్రమంగా నిర్వహించే దానికి వృత్తినైపుణ్యం సంపాదించాలి. అందుకుగాను మనం అకడమిక్ సెల్ ఏర్పాటుచేశాం. దానికి శ్రీ టి. సంజీవరావుగారు డైరెక్టరుగా, శ్రీ ఎం.ఎ.కె. దత్తుగారు కార్యదర్శిగా మన సెల్‌పనిచేస్తున్నది. ప్రతిసం॥ మధ్యప్రదేశ్‌లోగల ఏకలవ్య విద్యా సంస్థ వారి శిక్షణా కార్యక్రమాలకు హాజరై లోకాస్టు టీచింగ్ ఎయిడ్స్ తయారుచేయడం, అందునిమిత్తంజిల్లాలలో క్లాసులు, వర్క్‌షాపులు నిర్వహిస్తున్నాము. ఖమ్మంజిల్లావారు మరింత కృషి చేశారు. జిల్లాలో ఎగ్జిబిషన్ నిర్వహించారు. సైన్సుపై ఒకపుస్తకం కూడా ప్రచురించారు.

ఈ సం. బ్రెడ్ (బేసిక్ రీసెర్చ్ ఎడ్యుకేషన్ డెవలప్‌మెంట్ సొసైటీ)వారు మన సహకారంతో ఏప్రిల్ 14న 10వ తరగతి విద్యార్థులకు రాష్ట్రవ్యాప్తంగా 35 కేంద్రాలలో మెరిట్ పరీక్షలు నిర్వహించారు. వారికి బహుమతులు ఇవ్వడం జరిగింది. గుంటూరు మొదటిది, పశ్చిమగోదావరి రెండవ, విజయనగరం మూడవ బహుమతులు పొందాయి. విజయవాడ పట్టణశాఖ 10వ తరగతి విద్యార్థులకు టెస్టుపేపర్లు ముద్రించి కొంతకృషి చేసింది.

## యు.టి.యఫ్. వార్తలు

యు.టి.ఎఫ్. వార్తలు ప్రారంభించి 12 సంవత్సరాలు పూర్తి అయింది. పుష్కరకాలంలో అది ఎంతో కృషి చేసింది. కార్యకర్తలకు కరదీపికగా వెలుగొందింది. ఉద్యమ వార్తలు అందించింది. ప్రతినెల

రెగ్యులర్‌గా తేవడం జరుగుచున్నది.

ఇవిగాక ప్రతి నెల అర్జంటు సర్క్యులర్లు పంపుతున్నాము. కరపత్రాలు ప్రచురిస్తున్నాము. పి.ఆర్.సి.లాంటి పుస్తకాలు వేస్తున్నాము.

## సంఘ నిర్మాణం

సరైన సంఘానికి నిర్మాణం అత్యంత ముఖ్యమైనది. అందుకే మనం దానికి అంత ప్రధానమైన స్థానాన్ని ఇస్తున్నాము. ప్రతి సంవత్సరం సభ్యత్వం చేర్చడం, ఆమేరకు నిర్మాణం చేయడం, కొత్త బాడీలు ఎన్నుకోవడం, మండలం నుండి రాష్ట్ర స్థాయి వరకు మనం చేస్తున్నాం.

2సంవత్సరాలకొకసారి ఉద్యమ క్లాసులు నిర్వహించి కార్యకర్తలకు శిక్షణ ఇస్తున్నాము. 91-92లో వివిధ జిల్లాలలో 1227 మందికి శిక్షణ యివ్వడం జరిగింది. ఇటీవల జిల్లాశాఖలే బాధ్యత తీసుకొని కొన్ని మండలాలలో శిక్షణ యిస్తున్నాయి. ఇది చాలా శుభ సూచకం. దానిని కొనసాగించాలి.

ఉపాధ్యాయులు, కార్యకర్తలు ఏదో ఒకపనిలో నిమగ్నమయి వుండాలి. నిత్యం జనానికి పదును పెట్టకపోతే నీరసం వస్తుంది. ఉద్యమంలో ఉత్తేజం, వూపు లేకుండా పోతాయి. ఆశయాలకు అంకితమవటం తగ్గుతుంది. అందుకే గోష్టులు, సెమినార్లు, మహాసభలు నిర్వహించడం జరుగుచున్నది.

## సంఘ సంక్షేమం

సమిష్టి పనికి సమావేశాలు ముఖ్యం. అది ప్రతి నెలా జరగనిదే ఉద్యమం బలపడదు. అందుకని మనం మండలం, పట్టణ, జిల్లా శాఖలలో రెగ్యులర్‌గా సమావేశాలు జరపాలని తెలియజేస్తుంటాం. రాష్ట్ర సమావేశాలు అలాగే జరుగుతుంటాయి.

**1992 ఆగస్టు 22, 23 జనరల్ కౌన్సిల్, విజయవాడ**
**1992 సెప్టెంబర్ 20 కార్యవర్గం, హైద్రాబాదు**
**1992 అక్టోబర్ 10 సబ్ కమిటి, విజయవాడ**
**1992 నవంబర్ 1 సబ్ కమిటి, గుంటూరు**
**1992 డిసెంబరు 26 కార్యవర్గం, విజయవాడ**
**1993 జనవరి 16 జనరల్ కౌన్సిల్, గుంటూరు**
**1993 ఫిబ్రవరి 6 సబ్ కమిటి, విజయవాడ**
**1993 మార్చి 14 కార్యవర్గం, విజయవాడ**
**1993 ఏప్రిల్ 25 సబ్ కమిటి, విజయవాడ**
**1993 మే 14 సబ్ కమిటి, గుంటూరు**
**1993 జూన్ 9 కార్యవర్గం, విజయవాడ**
**1993 జూలై 18 సబ్ కమిటి, విజయవాడ**

మొత్తం ఈ నివేదికా కాలంలో 2 కౌన్సిలు సమావేశాలు, 4కార్యవర్గాలు, 6 సబ్ కమిటీ సమావేశాలు మొత్తం 12 సమావేశాలు జరిగాయి. మన ఉద్యమానికి నేటితో 19సంవత్సరాలు నిండి 20వ సంవత్సరంలో అడుగుపెట్టాం. సూత్రబద్ధంగా వ్యవహరిస్తున్నాం కాబట్టే రాష్ట్రంలో పెద్ద సంఘంగా ఎదిగాం. సరిగా కదిలితే 60వేల సభ్యత్వం ఒక లెక్కలోనిదికాదు. మనం సరిగా పనిచేస్తున్నామని, నీతి నిజాయితీలతో వ్యవహరిస్తామని, వసూలు చేసిన ప్రతి పైసాకు లెక్క చూపుతామని, ప్రతి పరీక్షా సమయంలోను ఉపాధ్యాయుల పక్షాన నిలుస్తున్నామని మనలను నమ్మినవారు మరొక 40వేల మంది వరకు వున్నారు. అంటే మనం సరిగా ప్లాను ప్రకారం పనిచేస్తే మన సభ్యత్వం లక్ష దాటుతుంది.

సమాజంలో అనేక అవలక్షణాలున్నాయి. వాటి ప్రభావం ఉపాధ్యాయులపై పడుచున్నది. కొంతశాతం వాటికి లొంగిపోతున్నారు. వారిని చూపి అందరిని ఆ గాటను కడుతున్న వారు వున్నారు. వాటిని సరిజేసుకోవాలి.

కాన్వెంటుల మోజులో వున్న ప్రజలను సరిచేసి, వారి పిల్లలను మన పాఠశాలలకు ఆకర్షించవలసినది పోయి, మనమే వాటిలోపడి కొట్టుకుపోతూ ఉండటం ఆత్మహత్యా సదృశ్యం. దానిని వెంటనే సరిచేసుకోవాలి.

అక్షరాస్యత ఉద్యమంలో మనం అగ్రభాగాన ఉండి పనిచేశాం. సారా ఉద్యమానికి శక్తి కొలది సహకరించాం. మత సామరస్యానికి మనం గళం విప్పాం. సెక్యులరిజానికి అంకితమై పనిచేస్తున్నాం. సమైక్య భారత నిర్మాణానికి కృషి చేస్తున్నాం. అన్ని గాలులను తట్టుకొని, అవకాశవాదానికి కొట్టుకుపోక, అసలైన చెన్నుపాటి వారసులంగా, శక్తివంతమైన యు.టి.ఎఫ్. సైనికులుగా నిరంతరం పనిచేస్తున్న వాళ్ళం మనం.

## మన జిల్లా శాఖల నిర్మాణం

**1. శ్రీకాకుళం:** జిల్లాలో కార్యకర్తలు పెరిగారు. విస్తరించే దానికి కృషి చేస్తున్నారు. జిల్లా అధికారులతో నిత్యం పోరాటం సాగించవలసి వస్తున్నది. అధ్యక్షులుగా శ్రీ పి.మహేశ్వరరావు, ప్రధాన కార్యదర్శిగా శ్రీ.బి.మోహనరావు పనిచేస్తున్నారు.

**2. విజయనగరం:** నిర్మాణయుతంగా పనిచేస్తున్నారు. ఉద్యమం విస్తరించే పరిస్థితులు ఏర్పడ్డాయి. సమస్యలపై కృషి చేస్తున్నారు. అధ్యక్షులుగా శ్రీ.ఎం.రామమూర్తి పంతులు, ప్రధాన కార్యదర్శిగా శ్రీ ఎం.మురళీధరరావు పనిచేస్తున్నారు.

**3. విశాఖపట్టణం:** ఉద్యమం మరికొన్ని మండలాలకు విస్తరించింది. కార్యకర్తల మధ్య సమన్వయం లేదు. సమావేశాలకు హాజరు తక్కువ. అధ్యక్షులుగా శ్రీ.బి.ఈశ్వరరావు, ప్రధాన కార్యదర్శిగా శ్రీ కె.ఎస్.ఎన్.శాస్త్రి పనిచేస్తున్నారు.

**4. తూర్పుగోదావరి:** సభ్యత్వం, పత్రికలలో అగ్రభాగాన వున్న జిల్లా. జిల్లాలో ఉద్యమం నిర్మించిన వి.సూర్యనారాయణరాజు మరణం ఆ జిల్లాకు పెద్ద లోటు. అయినా ఉద్యమాన్ని కాపాడుకుంటూ ఉద్యమిస్తున్నారు. అధ్యక్షులుగా శ్రీ.కె.బ్రహ్మాజీరావు, ప్రధాన కార్యదర్శిగా శ్రీ జి.చిట్టిబాబు, అసోసియేట్ అధ్యక్షులుగా శ్రీ జి.ఆంజనేయులు పనిచేస్తున్నారు.

**5.పశ్చిమగోదావరి:** గతం కంటె సభ్యత్వం పెరిగింది. జీవిత చందాలలో అగ్రస్థానంలో ఉన్నారు. సమస్యలపై కృషి చేస్తున్నారు. భవనం అప్పు తీర్చవలసి వుంది. అధ్యక్షులుగా శ్రీ ఎస్.ఆర్.పోలిశెట్టి, ప్రధాన కార్యదర్శిగా శ్రీ సిహెచ్.సుభాష్ చంద్రబోస్, గౌరవ అధ్యక్షులుగా శ్రీ.కె.రాఘవరాజు పనిచేస్తున్నారు.

**6. కృష్ణా:** సభ్యత్వం పెరుగుదల లేదు. జిల్లా ఆఫీసులలో మంచి కృషి వుంది. బందరులో భవన నిర్మాణానికి కృషి చేస్తున్నారు. అధ్యక్షులుగా శ్రీ పి.సోమయ్య, ప్రధాన కార్యదర్శిగా శ్రీ.పి. వెంకటేశ్వరరావు, అసోసియేట్ అధ్యక్షులుగా శ్రీ మల్లికార్జునరావు పనిచేస్తున్నారు.

**7. గుంటూరు:** సభ్యత్వం, పత్రిక ఇంకా పెరగాలి. కార్యకర్తలు ఎక్కువ మంది వున్నారు. మహాసభలు నిర్వహించుచున్న జిల్లా అధ్యక్షులుగా శ్రీ టి.అంజిరెడ్డి, ప్రధాన కార్యదర్శిగా శ్రీ వి.విశ్వనాథం పనిచేస్తున్నారు.

**8. ప్రకాశం:** ఈ సంవత్సరం సభ్యత్వం ఆరువేల వరకు పెరిగింది. విద్యాగోష్టులు ఎక్కువగా నిర్వహించారు. సమస్యలపై కృషి చేస్తున్నారు. అధ్యక్షులుగా శ్రీ కె.ఆదినారాయణ, అసోసియేట్ అధ్యక్షులుగా శ్రీ ఎం.పానకాలరావు, ప్రధాన కార్యదర్శిగా శ్రీ పి.లక్ష్మీరెడ్డి పనిచేస్తున్నారు.

**9. నెల్లూరు:** సభ్యత్వం ఎక్కువగా వున్న జిల్లాలలో ఒకటి. పత్రిక జనరల్ క్యాంపైన్‌లో రికార్డు నెలకొల్పారు. అధ్యక్షులుగా శ్రీ టి.కొండాచారి, ప్రధాన కార్యదర్శిగా శ్రీ పి.బాబు రెడ్డి పనిచేస్తున్నారు.

**10. చిత్తూరు:** సభ్యత్వం నిలకడగా వుంది. ప్రాథమిక రంగానికి ఉద్యమం విస్తరించాలి. అధ్యక్షులుగా శ్రీ ఎస్. ఆనందనాయుడు, ప్రధాన కార్యదర్శిగా శ్రీ కె. రామచంద్రారెడ్డి, అసోసియేట్ అధ్యక్షులుగా శ్రీ వీరాస్వామి పనిచేస్తున్నారు.

**11. కడప:** గతం కంటేసభ్యత్వంపెరిగింది. ఇంకా ఎరిగే అవకాశాలువున్నాయి.అధ్యక్షులుగా శ్రీ బి. సుబ్బారెడ్డి, ప్రధాన కార్యదర్శిగా శ్రీసి.కృష్ణంరాజు, అసోసియేట్ అధ్యక్షులుగా శ్రీడి.రామిరెడ్డి పనిచేస్తున్నారు.

**12. కర్నూలు:** సభ్యత్వం రాష్ట్రం సహకరిస్తే మరింత పెరుగుతుంది. అధ్యక్షులుగా శ్రీ ఎ.చెన్నకేశవరెడ్డి, ప్రధాన కార్యదర్శిగా శ్రీఎం.రంగస్వామి, అసోసియేట్ అధ్యక్షులుగా శ్రీటి.కృష్ణయ్య పనిచేస్తున్నారు.

**13. అనంతపురం:** సభ్యత్వం పెరిగే అవకాశాలున్నాయి. అధ్యక్షులుగా శ్రీపి.ఎం.ఖాన్, ప్రధాన కార్యదర్శిగా శ్రీ ఎన్.శంకరనారాయణ పనిచేస్తున్నారు.

**14.ఖమ్మం:** నిర్మాణంలోగాని, కార్యకర్తల సంఖ్యలోగాని బలమైన జిల్లా. మీటింగు హాలు నిర్మాణానికి కృషి చేస్తున్నారు. అధ్యక్షులుగా శ్రీఎన్.నారాయణ, ప్రధాన కార్యదర్శిగా శ్రీ కె.కృష్ణయ్య పనిచేస్తున్నారు.

**15. వరంగల్:** సభ్యత్వం పెరగాలి. కార్యకర్తలు వున్నవారైనా మరింతగా కదలాలి. శ్రీఎస్.సోమయ్య అధ్యక్షులుగా, శ్రీపి.దామోదర్ ప్రధాన కార్యదర్శిగా పనిచేస్తున్నారు.

**16. కరీంనగర్:** నిర్మాణయుతంగా పనిచేస్తున్న జిల్లా. ఖర్చులో పొదుపు వీరి ప్రత్యేకత. అధ్యక్షులుగా శ్రీ ఎం.డి.హబీబుద్దీన్, ప్రధాన కార్యదర్శిగా శ్రీ ఎస్.వేణు శ్రీ పనిచేస్తున్నారు.

**17. ఆదిలాబాద్:** విశాలమైన జిల్లా. సభ్యత్వం మరింత పెరిగేదానికి శ్రమించాలి. అధ్యక్షులుగా ఆర్.రాజన్న, ప్రధాన కార్యదర్శిగా శ్రీ ఎస్.శశికాంత్ పనిచేస్తున్నారు.

**18. నల్గొండ:** సభ్యత్వం పెరిగింది. సమస్యలపై కృషి చేస్తున్నారు. అధ్యక్షులుగా శ్రీ ఎస్. ఆంజనేయులు, ప్రధాన కార్యదర్శిగా శ్రీ డి.ఓంప్రకాష్ పనిచేస్తున్నారు.

**19. మహబూబ్‌నగర్:** సభ్యత్వం పెరిగింది. సమావేశాలు ఇంకా జరగాలి. అధ్యక్షులుగా శ్రీ ఎస్.విజయకుమార్, ప్రధాన కార్యదర్శిగా శ్రీ కె.రఘుపతిరెడ్డి, అసోసియేట్ అధ్యక్షులుగా శ్రీ ఎం.డి. ఖమ్రుద్దీన్ పనిచేస్తున్నారు.

**20. నిజామాబాద్:** సభ్యత్వంతక్కువగా వున్నది. మారుమూల జిల్లాలలో ఇది ఒకటి. ఇంకా విస్తరించాలి. అధ్యక్షులుగా శ్రీ ఎ.పోశెట్టి, ప్రధాన కార్యదర్శిగా శ్రీసి.పురుషోత్తంరాజు పనిచేస్తున్నారు.

**21. మెదక్:** సభ్యత్వం వివరాలుగాని, మండలనిర్మాణాల గురించిగాని వివరాలు తెలియవు. అందుచే జిల్లాకు కన్వీనర్‌గా శ్రీ ఎం.ఆర్. రెడ్డిని నియమించటం జరిగింది.

**22. రంగారెడ్డి:** గతం కంటే నిర్మాణం పెరిగింది. సభ్యత్వం పెంపుకు కృషి జరిగింది. అధ్యక్షులుగా శ్రీ శంకరరెడ్డి, ప్రధానకార్యదర్శిగా శ్రీపి.మాణిక్‌రెడ్డి పనిచేస్తున్నారు.

**23. హైదరాబాద్:** రాజధాని కేంద్రంలో వున్న జిల్లా. జిల్లా సభ్యత్వం,పత్రిక చందాలు పెరగాలి. అధ్యక్షులుగా శ్రీఎం.నరేందర్‌రెడ్డి, ప్రధానకార్యదర్శిగా శ్రీఎన్.రమణయ్యశాస్త్రి పనిచేస్తున్నారు.

మనం ఆలిండియా సెకండరీ టీచర్స్ ఫెడరేషన్‌లో సభ్యులుగా వున్నాము. కాని అది సరిగా పనిచేయటం లేదు. పోరాట కార్యక్రమాలు లేవు. అసలు ఏ కార్యక్రమములు చేపట్టరు.

ప్రపంచ ఉపాధ్యాయ సంఘం సోవియట్ పతనం తర్వాత అస్థిరత్వం కోల్పోయింది. ప్రపంచంలో వున్న మూడు సంఘాలు కలిసి పోయేదానికి కృషి ప్రారంభమైనట్లు తెలుస్తున్నది. ఏం జరుగుతుందో వేచి చూద్దాం.

రాష్ట్రంలో ముగ్గురు హోల్ టైమర్లుగా వుండి పనిచేస్తున్నాము. మరొకరి అవసరం ఉంది. తమ పనులు చూసుకొంటూ మరొక ఇద్దరు సహకరిస్తున్నారు. విజయవాడలో నల్గురు గుమాస్తాలు, హైద్రాబాద్‌లో ఒకరు వున్నారు. ఆఫీసుకు కావలసిన అన్ని సౌకర్యాలు ఏర్పాటు చేసుకొన్నాము.

## మన ఆఫీసులోని వస్తువులు

**విజయవాడ ఆఫీసు:**

ఇనుప బీరువాలు 2, కర్రబీరువాలు 6, ఇనుప అద్దాల బీరువాలు 3, ఇనుపరాక్‌లు 3, కర్రడాయర్లు 8, ఇనుపడ్రాయర్ 1, గ్లాస్ డ్రాయర్ 1, ఇనుపసొరుగు డ్రాయర్లు 2, ఎలక్ట్రానిక్ టైపు మిషన్ గోద్రెజ్ 1, మైక్ సెట్ 1, కర్ర కుర్చీలు 4, ఇనుప కుర్చీలు చేతులున్నవి 6, ఇనుప కుర్చీలు 32,మీటింగ్ టేబులు 1, స్టూల్స్ 6, ఇనుప మంచాలు3, ఇనుప బకెట్స్ 7, జంపఖానాలు 5, టైపు మిషన్‌లు 2, డూప్లికేటింగ్ 1, రేడియో 1, టేపు రికార్డరు 1, గోడ గడియారాలు 3, సీలింగ్ ఫ్యాన్‌లు 20, స్టాండ్ ఫ్యాన్ 1, ఫ్లాస్కు 1, స్టీల్ నీళ్ళ డ్రమ్ము 1, స్టీల్ గాసులు 13, వంట సామానులు 20, ఇనుప నీళ్ళడ్రమ్ము 1, జెట్ నీళ్ళమోటారు 1, సైకిల్ 1, తూనిక కాటాలు 2, కలర్ టి.వి.1 గలవు.

**హైదరాబాద్ ఆఫీసు:**

ఇనుప టేబుల్స్ 2, కర్రటేబుల్స్ 2, ఇనుప కుర్చీలు (చేతులవి) 2, స్టీల్ కుర్చీలు 15, ఇనుప మంచాలు 5, రేక్స్ 2, సీలింగ్ ఫ్యాన్‌లు 10, స్టాండు ఫ్యాన్ 1, జంపఖానాలు 5, ఇనుప బీరువాలు 6, టైపుమిషన్‌లు 2, డూప్లికేటింగ్ 1, స్టూల్స్ 6, జెట్ నీళ్ళమోటారు 1, స్టీల్ నీళ్ళడ్రమ్ము 1, రేడియో 1, గ్యాస్ స్టవ్ 1, సైకిల్ 1, వంటపాత్రలు 20, మైక్ సెట్ 1, టి.వి.1 గలవు.

ఇవిగాక జిల్లా ఆఫీసులలో గల సామానులు ఇక్కడ ఇవ్వబడలేదు.

మహాసభకు గుంటూరుజిల్లావారు ఆహ్వానసంఘంగా ఏర్పడి, నిర్విరామంగా కృషి చేస్తున్నారు. మన ఉద్యమ చరిత్రలో ఈ మహాసభ మరొక మైలు రాయిగా నిలుస్తుంది.

## భవిష్యత్ కార్యక్రమం

ప్రైవేటైజేషన్‌పై పోరాట కార్యక్రమం చేపట్టాలి. సమస్యల పరిష్కారంలో ప్రభుత్వ నిర్లక్ష్యవైఖరి వ్యతిరేకించాలి.

అవినీతికి వ్యతిరేకంగా రాజీలేని పోరాటం సాగించాలి. ఏజన్సీ, సింగరేణి పాఠశాలల సమస్యల పరిష్కారానికి కృషి చేయాలి.

కామ్రేడ్స్ 12 మాసాల సంఘ కార్యకలాపాల గురించే గాక గత మహాసభ నుండి ఇప్పటి వరకు సంక్షిప్తంగా మీ ముందు నివేదిక ఉంచాను. పరిశీలించి నిర్మాణాత్మకమైన సూచనలతో పరిపుష్టం చేయండి.

భవదీయుడు,

ఎ.వెంకటస్వామి,

ప్రధాన కార్యదర్శి.



# పత్రికా నివేదిక

శ్రీ కె. కేశవరెడ్డి
ప్రధాన సంపాదకుడు

అధ్యక్షా!
స్టేట్ కౌన్సిల్ సభ్యులారా!
మహాశయులారా!

అవినీతి, అన్యాయం, అక్రమాలకు వ్యతిరేకంగా నికరంగా నిలబడి ఉపాధ్యాయులలో చైతన్యస్ఫూర్తిని కలిగిస్తూ ఉద్యమాన్ని మునుముందుకు నడిపిస్తున్న మీకు ఐక్య ఉపాధ్యాయ పత్రిక సంపాదకవర్గం పక్షాన యివే ఉద్యమాభివందనాలు.

5వ రాష్ట్ర మహాసభల సందర్భంగా 89 జూన్‌లో నెల్లూరులో అప్పటివరకు గల పత్రిక పరిస్థితిని సమీక్షించుకున్నాం. ఆంధ్రప్రదేశ్ నడిబొడ్డూ, ఉద్యమాల గనిగడ్డా, విద్యా, విజ్ఞాన, సాహిత్య, సాంస్కృతిక కేంద్రమూ అయిన గుంటూరు పట్టణంలో ఆరవ విద్యావైజ్ఞానిక మహాసభలు జరుపుకొంటున్న సందర్భంగా పత్రికాపరంగా మనం ఏమేరకు పురోగమించిందీ సమీక్షించుకుంటున్నాం.

గత నాలుగు సంవత్సరాల కాలంలో ఉద్యమ వాణిగా మన పత్రిక సాధించిన పురోగతినీ, ఉద్యమ ప్రచార సాధనంగా దాని కృషినీ, విద్యావైజ్ఞానిక మాసపత్రికలలో దాని ప్రత్యేకతనూ, పత్రికా నిర్వహణలో ఎదురైన ఆటుపోట్లనూ, వాటినధిగమించడానికి తీసుకొన్న చర్యల్నీ సంపాదకవర్గం పక్షాన సంగ్రహంగా మీముంధుంచుతున్నాం.

నెల్లూరు మహాసభల ప్రత్యేక సంచిక అందంగా, ఆకర్షణీయంగానేగాక సామాజిక సమస్యలకు ముఖ్యంగా విద్యారంగాన్ని ఎదుర్కొనే వివిధ సమస్యలకు అద్దంపట్టి, కాన్వెంటు చదువులు, ఛటోపాధ్యాయ కమీషన్ సిఫార్సులపై డాక్యుమెంట్లు అందించి మహాసభలకు రానివారికి కూడా మహాసభల దృశ్యాలను చూపెట్టి అలరించింది; ఆహ్లాదపరచింది; ఉత్తేజపరచింది.

సమాజంలో సగంమంది నిరక్షరాస్యులొకవైపు, ఉపాధ్యాయులుగా పనిచేసేందుకు అన్ని అర్హతలు కలిగివుండి నిరుద్యోగులుగా మిగిలివున్న యువతీయుకులొకవైపూ; విద్య, వైద్యం, ఆరోగ్యాలను అందరికీ అందుబాటులోకి, అనుభవంలోకి తీసుకొని రావలసిన ప్రభుత్వాలు ఆ బాధ్యతలను విస్మరించి మార్కెట్టు ఆర్థిక విధానం ఎత్తుకి చిత్తయి ప్రైవేటీకరణవైపు తీస్తున్న పరుగులు-; అంగటిలో అన్ని నిత్యావసర వస్తువులలాగానే అమ్ముడుపోతున్న విద్యవైద్యం; రుణాల ఊబిలో కూరుకుపోతున్న దేశం, నానాటికీ పెరుగుతున్న ధరలు, తరుగుతున్న ఉపాధ్యాయుల, ఉద్యోగుల, కార్మికుల, యితర కష్టజీవుల నిజవేతనాలు; అసలు సమస్యల నుండి ప్రజల ఆలోచనలను ప్రక్కదారి పట్టించేందుకు విజృంభిస్తున్న కులమత, విచ్ఛిన్నకర, హింసావాద శక్తులూ; ప్రజల ఆలోచనలకు చిచ్చుగొట్టే తాత్కాలిక ఉద్రేకాలను రెచ్చగొట్టే సెక్స్, క్రైం, థ్రిల్లింగ్, సస్పెన్స్, దౌర్జన్యం, హింస, బీభత్సాలతో కూడిన సాహిత్యం, యివన్నీ కారుమేఘాలుగా క్రమ్ముకుంటున్న సమాజంలో పరిమితుల మేరకు కాంతి పుంజాలను ప్రసరింపజేసే బాధ్యతను సంపాదకవర్గం గుర్తిస్తున్నది. ఆశయాల బాటలో పత్రికను నడిపేందుకు కృషిచేస్తున్నది.

## సంపాదకీయాలు–కార్టూన్లు

రాతలో ఒక పేజీలో గూడా చెప్పలేని భావాన్ని కార్టూన్ ద్వారా హృదయానికి హత్తుకొనేలా చెప్పవచ్చు. కార్టూన్ గుండెకు కుదుపునిస్తుంది. ఆలోచనలను గిలకొడుతుంది. ఈ ప్రక్రియను బాగా ఉపయోగించుకొన గలుగుతున్నాం. మచ్చుకి కొన్ని. 'ఉరుకులు పరుగులూ తీస్తున్న ధరలు అందుకోలేక అలమటిస్తున్న సామాన్యుల మొరలు'-వ్యాఖ్యతో ఆకాశాన్నంటే ధరలపై కార్టూన్ 'సన్మానాల హారులతో శాలువాల బరువు, సమస్యల పరిష్కారానికి సమాధానాల కరువు' వ్యాఖ్యతో ఉపాధ్యాయ దినోత్సవంపై కార్టూను.

వారానికి ఐదు రోజుల పని అనే నావతో విద్యార్థిని ఉత్తీర్ణతా తీరానికి చేర్చలేక సతమతమవుతున్న ఉపాధ్యాయుని చిత్రించిన కార్టూను. పరిశ్రమలనే ఆవుకి నాలుగు గడ్డిపరకలను అందిస్తూ లాభాలు అనే పాలను పిండుకొనడానికి ప్రైవేటు యాజమాన్యాలకు అనుమతి యిస్తున్న ప్రభుత్వాన్ని చిత్రించిన కార్టూనూ.

ఇలా కార్టూనులన్నీ సామాజిక విద్యారంగ సమస్యల్ని చిత్రించినవే.

సంపాదకీయాలు ఆయా సమయాల్లో సామాజిక సమస్యలను ముఖ్యంగా విద్యారంగ వైఫల్యాలను బట్ట బయలుచేస్తూ పాఠకులను ఆలోచింపజేసేవిగాను, కార్యకర్తలకు కర్తవ్యబోధ చేసేవిగాను, ఉద్యమపరంగా వారిని మునుముందుకు నడిపించేవిగాను వుంటున్నాయని పలువురి ప్రశంసల నందుకుంటున్నాయి.

మన కవర్ పేజీలలో వివిధ జిల్లాలలో జరిగిన పోరాట కార్యక్రమాలకు, ఉద్యమతరగతులకు సంబంధించిన ఫోటోలను ప్రచురిస్తున్నాం.

## ఇతర శీర్షికలు

ఉపాధ్యాయులకు వృత్తిపరమైన, విజ్ఞానపరమైన సమాచారాన్ని అందజేయడమేగాక వారిని పోరాటాలకు సన్నద్ధులుగాచేసే వివిధ శీర్షికలను నిర్వహిస్తున్నాం.

### ఉద్యమ సంబంధమైనవి

సంపాదకీయం, వార్తాప్రపంచం, గుసగుసలు, సభలు, రాయబారాలు, పోరాటాలు-ఫలితాలు, ప్రాతినిధ్యాలు-పరిష్కారాలు, పాఠకుల అభిప్రాయాలు, సంపాదకలేఖలు.

## వృత్తిపరమైనవి

ప్రశ్నోత్తరాలు, నియమనిబంధనలు, సమస్యాతోరణం, బదిలీలు కావాలా? ప్రభుత్వ ఉత్తర్వులు, డి.ఎ. టేబుల్స్.

విద్యాసంబంధమైనవి

విద్యావిధానం-తీరుతెన్నులు, విదేశీవిద్యా విధానం, పాఠ్యగ్రంథాల స్వరూప స్వభావాలు.

## విజ్ఞాన సంబంధమైనవి

విజ్ఞానవీధి, మనం-మన ఆరోగ్యం, క్రీడారంగం, మీకు తెలుసా?, ఆలోచించండి.

## సాహిత్య సంబంధమైనవి

కథలు-గేయాలు, మీరు చదివారా?, గ్రంథస్వీకారం.

## కథలు – గేయాలు

శీర్షికకు తగినట్లు కథల్ని ప్రచురించలేక పోతున్నాం. పేజీల పరిమితి అడ్డు వస్తున్నది. అందువలన పేజీలోని ఒక కాలానికి మించని కథల్ని మాత్రం ప్రచురించగలుగుతున్నాం. మంచి శిల్పంతో వ్రాయబడిన మినీ కథలో సందేశం సూటిగా హృదయాన్ని తాకుతుంది. ఆలోచనలను రేపుతుంది. ఇందుకు ఉదాహరణలుగా 'కంకర రాయి', 'సమాన హక్కులు', 'మందలింపు' అను పేర్కొనవచ్చు. అలాగే శ్రీయతి రాజులుగారి 'ప్రక్కదారి', 'ప్రతిభకి గుర్తింపు', మద్దూరి సూర్యనారాయణ మూర్తిగారి 'వైకుంఠంలో ఇంటర్వ్యూ', స్వామిగారి "అవకాశవాదం", "పక్షపాతం" ఎన్నదగినకథలు. ఈకాలంలో మనంప్రచురించిన గేయాలు సమాజంలోని అస్తవ్యస్త పరిస్థితులను ఎత్తిచూపేవి, స్తబ్దతగా నున్నవారి వెన్నుచరిచి కర్తవ్య బోధచేసేవి, భవితవ్యాన్ని నిర్దేశించేవి, మంచినీ మానవతను గుబాళింపజేసేవి, శాంతివనంలో కాంతిపూలు పూయించేవి, జాతి దీపాలను వెలిగించేవి, విద్యను లాభాలతో తూచే వ్యవస్థకి భాష్యాలు చెప్పేవి, చైతన్యం కోసం తూర్పుపడే ఆవేదనను ధ్వనింపజేసేవి, ఏ ప్రమాణాలతో కొలిచినా సమున్నతమైనవి.

'విమర్శల వడగండ్లు విరివిగా పడుతుంటే
పొగడ్తల వర్షం అక్కడక్కడా కురుస్తుంటే
మనకెందుకులే అని మౌనంగా కూర్చుంటే
పెరుగుదల మృగ్యం-తరుగుదల తథ్యం'

--ఇంద్రసేనారెడ్డి.

"చదువుసారమనెడి చమురుతో వెలిగేటి
దివ్య కాంతులీను దివ్వెనీవు
దివ్వెనంటి జాతి దీపాలు వెలుగనా"

- ఎ. గోపాలకృష్ణ

"అల్లుకొన్న సాలెగూళ్ళను తుడిచిపెట్టు
దేశపురోగమనానికి నడుంకట్టు
దీక్షతో ప్రగతి పథంలో పయనించు
శాంతివనంలో కాంతిపూలు పూయించు"

--రామచంద్రారెడ్డి

అనల్పమైన అక్షరశక్తివి
తన మస్తిష్కంలో నింపుకొన్న మగువను
వరకట్నం బంతులాటలో
విసిరి నేలకేసి బాదితే
నాటు బాంబై పేలుతుంది
కాటేసి తీరుతుంది"

శ్రీ మన్నారాయణ

"దగాపడిన మోము
కన్నీరింకిన కళ్ళు
శూన్య దృక్కులతో స్త్రీమూర్తి
విరాసక్తమైన ఆమె చూపులు
ఈ వ్యవస్థకి చెప్పే భాష్యాలు"

-పి.నరసింహం

"చదువు కొన్న అజ్ఞానులున్న
సమాజం మనది
విద్యను లాభాలతో తూస్తున్నందు
కొచ్చిన ఫలితమిది"

-వి.వి.నారాయణ

నాగభైరవ కోటేశ్వరరావు గారి 'మాష్టారికో విజ్ఞప్తి', 'గుండెల్ని ప్రసాదించు', 'విజయం నీ బానిస చాలా గొప్ప ప్రబోధాత్మక గేయాలు. శ్రీ కర్రా కార్తికేయ శర్మ గారి 'కాన్వెంటు పవనాలు' మాటల బొమ్మలు', 'కర్షుడు', 'ఇన్విజిలేషన్‌లు కవితా ఖండాలు. అలాగే శ్రీ బి.ఆర్.కె.పి.హెచ్.రాజు గారి 'సాక్ష్యమా నీ వెక్కడ?', 'లాకప్ శవాక్రోశం' 'మరోనాడు స్వేచ్ఛా కోకిలనై" కవితలు శ్రీ కొర్రపాటి గారి 'బడిపంతులు', శ్రీ జల్ల చలమయ్య గారి 'ఎక్కడ వేస్తావోయ్ లంగరు'?, ఎన్నదగిన కవితలు. ఇంకా జి. శ్రీమన్నారాయణ, పాటిబండ్ల శ్రీమన్నారాయణ కవితలు ఉన్నత ప్రమాణాలకు నిదర్శనాలుగా ఉన్నాయి.

## విజ్ఞాన దాయకమైన వ్యాసాలు

అకడమిక్ విషయాలపై పాఠశాల విద్యా సంచాలకులు శ్రీ టి.వెంకారెడ్డి గారి వ్యాసాలు. 'అక్షర దీపంపై శ్రీ వి.బాలసుబ్రహ్మణ్యం గారి వ్యాసాలు, ఆర్థిక విషయాలపై శ్రీ ఎస్.ఆనందనాయుడు గారి వ్యాసాలు, విద్యా విధానం-తీరుతెన్నులపై శ్రీఎల్.శివన్నారాయణ గారి వ్యాసాలు శ్రీ టి.జి.సంజీవరావుగారి వ్యాసాలు విజ్ఞానదాయకమైనవి.

శ్రీ డి.రామిరెడ్డి గారి "నూతన విద్యా సంవత్సరం- ఉపాధ్యాయుల సమస్యలు', శ్రీ ఎ.వెంకటస్వామిగారి ఉపాధ్యాయ ఉద్యమ చరిత్ర' ఉద్యమ పరమైన చైతన్యాన్నిచ్చే వ్యాసాలు.

శ్రీ గుర్రాల శ్రీరామమూర్తి గారి 'మానవ సమాజం పరిణామంపై వ్యాసాలు, అలాగే చరిత్ర రచనపైన, సెక్యులరిజం, మత సామరస్యంపై ప్రచురించబడిన వ్యాసాలు సామాజిక చైతన్యాన్ని కలుగజేసే వ్యాసాలు.

## ప్రశ్నోత్తరాలు

ఉపాధ్యాయులకు వృత్తిపరంగా ఎదురయ్యే సమస్యల చిక్కుముడులకు జి.ఓ.లపై పూర్తి అవగాహన గల యు.టి.ఎఫ్. కార్యదర్శి శ్రీ కె.జోజయ్య విడదీసి వివరిస్తున్నారు. జి.ఓ.లపై వివరణ యిస్తూ వ్రాస్తున్న జోజయ్య గారి వ్యాసాలు సమస్యల పరిష్కారానికి బాగా తోడ్పడుతున్నాయి.

## నియమ నిబంధనలు

ఈ శీర్షికను శ్రీ ఆర్. శ్రీహరిరావు ధారా వాహికంగా సంబోధకంగా చక్కగా నిర్వహిస్తున్నారు.

## మీరు చదివారా?

మార్కెట్‌లోకి పుస్తకాలు కుప్పలు తెప్పలుగా వచ్చిపడుతున్నాయి. వీటిలో ప్రక్కదారులు పట్టించేవి ఎక్కువ. సమాజంలో వ్యక్తిస్థానాన్ని గుర్తింపజేసి, చైతన్యవంతంగా సామాజిక బాధ్యతలకు నిర్వర్తింపజేసే విధంగా అతణ్ణి సన్నద్ధం చేసేవి తక్కువ.

మంచి పుస్తకాలను ఎంపిక చేసుకోవడం అడ్డ దిడ్డంగా పెరిగిన గంజాయి మొక్కలలో తులసి మొక్కలను వెతుక్కోవడం లాంటిది. అలా మంచి పుస్తకాలను ఎంపిక చేసుకొని వాటిని పరిచయం చేసే కృషిని సంపాదక వర్గ సభ్యులు శ్రీ నాగటి నారాయణ సాగిస్తున్నారు.

### మనం–మన ఆరోగ్యం

క్లిష్టతరమైన వైద్యశాస్త్ర విషయాలను పాఠశాల తరగతి గదులకు అన్వయింపజేస్తూ, చెప్పే ప్రతి విషయానికి ఒక పూర్వ రంగాన్ని సృష్టిస్తూ పాఠకుల్ని ఆకట్టుకొనేలా చెప్పగలగడం బ్రహ్మారెడ్డి గారి ప్రత్యేకత.

### క్రీడారంగం

ఈ శీర్షికను శ్రీ జి.బాలశౌరి నిర్వహిస్తున్నారు. ఖరీదైన పరికరాలు ఆటవస్తువులు లేకపోయినా ఆడుకొనడానికి వీలైన ఆటలు వాటి నియమనిబంధనలను వివరిస్తున్నారు.

### పాఠ్య గ్రంథాల తీరుతెన్నులు

ఈ శీర్షికను శ్రీమతి నన్నపనేని రమాదేవి నిర్వహిస్తున్నారు. విమర్శలు, మరీ తీవ్రంగా వుంటున్నాయని మరి కొంచెం సరళంగా చెబితే బాగుంటుందని పాఠకులు అభిప్రాయపడుతున్నారు.

### పత్రికా క్యాంపెయిన్లు

ఒకప్పుడు పత్రిక సర్క్యులేషన్ 20వేలకు పెంచాలన్నది మన లక్ష్యం. ఇప్పుడు దాదాపు ఆ లక్ష్యాన్ని చేరుకున్నాం. ఒకప్పుడు స్కూలు కొక పత్రిక, కార్యకర్త కొక పత్రికఅన్నది మన నినాదం. దానిని ఇంకా సాధించవలసి వున్నది.

పత్రిక మన ఉద్యమవాణి, ఈ వాణిని ఎంత విస్తృతంగా వినిపించగలిగితే ఉద్యమం అంతగా ఉపాధ్యాయులలో చొచ్చుకొని పోతుంది. కాబట్టి యిక నుండి ప్రతి సభ్యునికీ ఒక పత్రిక, ప్రతి ఉపాధ్యాయునికి ఒక పత్రిక నినాదంతో పత్రిక సర్క్యులేషన్ పెంచాలి.

### ముఖ్య సూచనలు:

1.చందాలు పంపేటప్పుడు చిరునామాలు స్పష్టంగా వ్రాయాలి. పిన్‌కోడ్ తప్పక వేయాలని నివేదికల్లో ప్రతిసారీ సూచిస్తున్నప్పటికీ యింకా కొందరు పిన్‌కోడ్ వేయడం లేదు. 2. అడ్రసు తెలిపేటప్పుడు చందా నెంబరు విధిగా ఉదహరించాలి. అది సంవత్సర చందాయో లేక జీవిత చందాయో స్పష్టంగా వ్రాయాలి. 3.పత్రిక తరచూఅందకపోతే పోస్టల్ కంప్లయింట్ పెట్టి సహకరించాలి. 4.అడ్రసు మార్పులు సకాలంలో తెలపాలి. 5.రిపోర్టులు వీలయినంత సంగ్రహంగా ప్రధాన విషయాన్ని శీర్షికగా వివరించి కాగితానికి ఒకవైపే వ్రాసి పంపాలి. 6. చందాలు లిస్టుగా పంపేటప్పుడు డూప్లికేట్ తీసి ఒక కాపీ పంపితే చాలు.. రశీదు అందగానే తమ వద్ద వున్న లిస్టులోవరుస నెంబర్లు వేసుకోవచ్చు గత 4 సంవత్సరాల పత్రిక నివేదిక సంక్షిప్తంగా మీ ముందుంచాం. మీ సూచనలతో మెరుగులు దిద్దండి. విమర్శలతో సరిదిద్దండి.

భవదీయుడు

కె. కేశవరెడ్డి,

ప్రధాన సంపాదకుడు, ఐక్య ఉపాధ్యాయ.

### యు.టి.ఎఫ్. సంఘ సభ్యత్వం వివరాలు

| నెం. | జిల్లా | 1990 | 1991 | 1992 | 1993 |
|---|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళం | 570 | 670 | 520 | 700 |
| 2. | విజయనగరం | 600 | 675 | 610 | 600 |
| 3. | విశాఖపట్టణం | 1000 | 1000 | 1000 | 700 |
| 4. | తూర్పు గోదావరి | 7500 | 7005 | 8000 | 7500 |
| 5. | పశ్చిమ గోదావరి | 6000 | 6000 | 6000 | 6500 |
| 6. | కృష్ణా | 3600 | 4100 | 4000 | 3500 |
| 7. | గుంటూరు | 5500 | 5600 | 5600 | 5600 |
| 8. | ప్రకాశం | 6000 | 6000 | 6000 | 6226 |
| 9. | నెల్లూరు | 6000 | 6000 | 6000 | 6000 |
| 10. | చిత్తూరు | 3973 | 3500 | 3000 | 3500 |
| 11. | కడప | 1500 | 1500 | 1200 | 1500 |
| 12. | కర్నూలు | 1200 | 1500 | 1200 | 1500 |
| 13. | అనంతపురం | 1100 | 1000 | 800 | 1500 |
| 14. | ఖమ్మం | 3158 | 3103 | 3300 | 3300 |
| 15. | వరంగల్ | 1500 | 1500 | 1200 | 1200 |
| 16. | కరీంనగర్ | 1350 | 1350 | 1350 | 1350 |
| 17. | ఆదిలాబాద్ | 700 | 1000 | 700 | 800 |
| 18. | నల్గొండ | 1800 | 1725 | 1700 | 1811 |
| 19. | మహబూబ్‌నగర్ | 2000 | 1800 | 1700 | 1600 |
| 20. | నిజామాబాద్ | 384 | 383 | 300 | 381 |
| 21. | మెదక్ | 100 | 100 | 100 | 100 |
| 22. | రంగారెడ్డి | 100 | 100 | 100 | 100 |
| 23. | హైదరాబాద్ | 700 | 600 | 800 | 1000 |
| 24. | ఇతరములు | 2 | 3 | 3 | 3 |
| | మొత్తం | 56,421 | 56,214 | 56,083 | 56,968 |

### ఐక్య ఉపాధ్యాయ పత్రిక సర్క్యులేషన్ వివరాలు

| నెం. | జిల్లా | 1990 | 1991 | 1992 | 1993 | జీవిత చందాలు |
|---|---|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళం | 148 | 202 | 222 | 325 | 17 |
| 2. | విజయనగరం | 153 | 151 | 154 | 147 | 34 |
| 3. | విశాఖపట్నం | 171 | 177 | 231 | 224 | 79 |
| 4. | తూర్పుగోదావరి | 2153 | 2411 | 2686 | 3002 | 1062 |
| 5. | పశ్చిమగోదావరి | 1592 | 1716 | 1754 | 1898 | 1127 |
| 6. | కృష్ణా | 1201 | 1218 | 1145 | 1135 | 241 |
| 7. | గుంటూరు | 984 | 1001 | 1050 | 1148 | 415 |
| 8. | ప్రకాశం | 1476 | 1392 | 1800 | 1935 | 641 |
| 9. | నెల్లూరు | 1556 | 1770 | 1805 | 2487 | 513 |
| 10. | చిత్తూరు | 431 | 460 | 480 | 529 | 86 |
| 11. | కడప | 114 | 105 | 66 | 128 | 14 |
| 12. | కర్నూలు | 200 | 340 | 356 | 388 | 65 |
| 13. | అనంతపురం | 293 | 285 | 295 | 307 | 191 |
| 14. | ఖమ్మం | 1316 | 1409 | 1330 | 1480 | 515 |
| 15. | వరంగల్ | 477 | 488 | 465 | 1525 | 129 |
| 16. | కరీంనగర్ | 553 | 547 | 470 | 554 | 92 |
| 17. | ఆదిలాబాద్ | 221 | 227 | 195 | 242 | 59 |
| 18. | నల్గొండ | 727 | 842 | 738 | 942 | 321 |
| 19. | యం.నగర్ | 1014 | 935 | 941 | 1042 | 497 |
| 20. | నిజామాబాద్ | 358 | 368 | 345 | 325 | 136 |
| 21. | మెదక్ | 26 | 24 | 22 | 21 | 4 |
| 22. | రంగారెడ్డి | 64 | 51 | 32 | 124 | 12 |
| 23. | హైదరాబాద్ | 249 | 321 | 288 | 340 | 150 |
| 24. | ఇతరములు | 750 | 20 | 283 | 772 | - |
| | మొత్తం | 16,035 | 16,462 | 17,075 | 20,000 | 6,277 |

## ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ ఆర్థిక నివేదిక
### ది.1-6-1989నుండి 31-7-1993 వరకు

| జమలు | | ఖర్చులు | |
|---|---|---|---|
| ప్రారంభ నిల్వ | | | |
| బ్యాంకు | 37,765.00 | ప్రయాణములు | 1,82,932.89 |
| ఆఫీసు | 193.43 | అలవెన్సులు | 1,83,149.00 |
| సభ్యత్వం | 6,45,487.00 | ప్రింటింగ్ | 1,09,381.45 |
| జనరల్ ఫండ్ | 76,941.00 | ఆఫీసు నిర్వహణ | 1,19,212.09 |
| అద్దెలు | 15,908.00 | పోస్టేజి | 29,570.78 |
| వడ్డీలు | 22,313.00 | స్టేషనరీ | 22,761.40 |
| అమ్మకాలు | 80.00 | ఫోన్సు | 34,574.00 |
| యితరములు | 14,650.10 | పేపరు కొనుగోలు | 16,269.00 |
| డెలిగేట్ ఫీజు | 10,882.00 | సమావేశాల నిర్వహణ | 29,338.20 |
| ఫోన్సు | 219.00 | ఎఫిలియేషన్ ఫీజు | 4,362.00 |
| | | అకడమిక్ సెల్ | 1,502.00 |
| | | లైబ్రరీ | 2,639.90 |
| | | అడ్వాన్సులు | 17,245.00 |
| | | ఫిక్సడ్ డిపాజిట్లు | 17,245.00 |
| | | యుటిఎఫ్ వెల్ఫేర్‌ఫండ్ | 5,000.00 |
| | | యితరములు | 1,302.15 |
| | | బ్యాంకు నిల్వ | 62,062.80 |
| | | ఆఫీసు నిల్వ | 384.97 |
| మొత్తం | 8,24,438.53 | | 8,24,438.53 |

ఎం. అక్షయకుమార్‌దత్
టి. కొండాచారి
కె. బ్రహ్మాజీరావు — ఎ. వెంకటస్వామి
ఆడిట్ కమిటీ — ప్రధాన కార్యదర్శి

## ఐక్య ఉపాధ్యాయ పత్రిక ఆర్థిక నివేదిక
### ది.1-8-1992నుండి 31-7-1993 వరకు (12 నెలలు)

| జమలు | | ఖర్చులు | |
|---|---|---|---|
| ప్రారంభ నిల్వ | | | |
| బ్యాంకు | 61,259.02 | ప్రయాణములు | 7,495.70 |
| ఆఫీసు | 427.90 | ప్రింటింగ్ | 97,925.50 |
| సం.చందాలు | 3,54,835.00 | ఆఫీసు నిర్వహణ | 8,788.85 |
| జీవితచందాలు | 53,342.00 | పోస్టేజి | 33,571.00 |
| ఏజన్సీలు | 25,252.00 | స్టేషనరీ | 7,664.65 |
| ప్రకటనలు | 6,675.00 | జీతములు,అలవెన్సులు | 26,916.00 |
| వడ్డీలు | 74,363.00 | లైబ్రరీ | 3,746.80 |
| యితరములు | 5,631.75 | న్యూస్ ప్రింట్ | 2,62,040.50 |
| | | ఫిక్సడ్ డిపాజిట్లు | 50,000.00 |
| | | యుటిఎఫ్ వెల్ఫేర్‌ఫండ్ | 5,000.00 |
| | | అప్పులు | 9,583.00 |
| | | యితరములు | 4,224.00 |
| | | ఆఫీసు నిల్వ | 61.65 |
| | | బ్యాంకు నిల్వ | 64,768.02 |
| మొత్తం | 5,81,785.67 | | 5,81,785.67 |

## ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ ఆర్థిక నివేదిక
### ది.1-8-1992 నుండి 31-7-1993 వరకు (12 నెలలు)

| జమలు | | ఖర్చులు | |
|---|---|---|---|
| ప్రారంభ నిల్వ | | | |
| బ్యాంకు | 38,083.30 | ప్రయాణములు | 60,803.84 |
| ఆఫీసు | 129.48 | ప్రింటింగ్ | 26,671.00 |
| సభ్యత్వం | 1,87,334.00 | ప్రోస్టేజి | 7,226.00 |
| జనరల్ ఫండ్ | 14,068.00 | స్టేషనరీ | 2,975.00 |
| అద్దెలు | 5,236.00 | ఆఫీసు నిర్వహణ | 16,159.42 |
| అప్పులు | 1,610.25 | ఫోన్సు | 4,529.00 |
| డెలిగేట్ ఫీజు | 2,290.00 | సమావేశములు | 14,187.00 |
| వడ్డీలు | 1,824.00 | జీతములు, అలవెన్సులు | 39,450.00 |
| ఇతరములు | 2,272.00 | పేపరు కొనుగోలు | 13,280.00 |
| | | యుటిఎఫ్ వెల్ఫేర్‌ఫండ్ | 5,000.00 |
| | | లైబ్రరీ | 60.00 |
| | | యితరములు | 58.00 |
| | | బ్యాంకునిల్వ | 62,062.80 |
| | | ఆఫీసు నిల్వ | 384.97 |
| మొత్తం | 2,52,847.03 | | 2,52,847.03 |

## ఐక్య ఉపాధ్యాయ పత్రిక ఆర్థిక నివేదిక
### ది.1-6-1989 నుండి 31-7-1993 వరకు

| జమలు | | ఖర్చులు | |
|---|---|---|---|
| గతనిల్వ | | | |
| బ్యాంకు | 35,716.02 | ప్రింటింగ్ | 4,19,468.35 |
| ఆఫీసు | 59.10 | ప్రయాణములు | 27,651.90 |
| సం.చందాలు | 11,22,241.85 | ఆఫీసు నిర్వహణ | 30,710.40 |
| జీవితచందాలు | 1,92,359.50 | పోస్టేజి | 1,38,165.50 |
| ఏజన్సీలు | 48,177.50 | స్టేషనరీ | 57,419.65 |
| ప్రకటనలు | 40,625.00 | లైబ్రరీ | 15,657.65 |
| వడ్డీలు | 5,16,029.10 | | |
| న్యూస్‌ప్రింట్ అమ్మకం | 20,797.75 | అలవెన్సులు, | |
| యితరములు | 9,085.80 | జీతములు | 1,01,940.00 |
| | | న్యూస్ ప్రింట్ | 7,73,794.30 |
| | | వడ్డీలు | 23,809.00 |
| | | బహుమతులు | 2,284.00 |
| | | అడ్వాన్సులు,అప్పులు | 68,246.50 |
| | | యుటిఎఫ్ వెల్ఫేర్‌ఫండ్ | 5,000.00 |
| | | ఫిక్సడ్ డిపాజిట్లు | 2,46,404.00 |
| | | ఇతరములు | 9,710.70 |
| | | బ్యాంకు నిల్వ | 64,768.02 |
| | | ఆఫీసు నిల్వ | 61.65 |
| మొత్తం | 19,85,091.62 | | 19,85,091.62 |

ఎం. అక్షయకుమార్‌దత్
టి. కొండాచారి
కె. బ్రహ్మాజీరావు — ఎ. వెంకటస్వామి
ఆడిట్ కమిటీ — ప్రధాన కార్యదర్శి



# నిరక్షరాస్యత నిర్మూలించాలి

శ్రీ సత్యసాధన చక్రవర్తి
ఉన్నత విద్యాశాఖామాత్యులు, పశ్చిమబెంగాల్

విద్య ప్రాథమిక హక్కని, భారతదేశంలో ఏ బాలునికైనా బాలికకైనా విద్యను నిరాకరించడానికి వీలులేదని సుప్రీంకోర్టు తీర్పులో పేర్కొన్నది. మన రాజ్యాంగంలో 45వ ఆర్టికల్‌లో విద్యను అందజేయడం ప్రభుత్వ బాధ్యత అని వ్రాసుకొన్నాం. 14 సంవత్సరాల వయస్సు వచ్చే వరకు బాల బాలికలకు నిర్బంధ ప్రాథమిక విద్యను అందజేయాల్సిన బాధ్యత ప్రభుత్వానిది. మన రాజ్యాంగం అమలులోకి వచ్చిన 10 సంవత్సరాలకు అంటే 1960 నాటికి భారతదేశంలోని ఏ బాలుడు, బాలిక నిరక్షరాస్యులుగా మిగిలి పోకూడదు. కనీసం 8వ తరగతి వరకూ అందరినీ చదివించాలి. కాని అలా జరగుటలేదు. ఆర్టికల్ 45 రాజ్యాంగానికి అలంకారంగా మాత్రమే వుండిపోయింది.

స్వర్గీయ ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ 20 సూత్రాల కార్యక్రమాన్ని ప్రవేశపెట్టారు. కాని ఆర్టికల్ 45 అమలు జరగకుండా అలాగే వుండిపోయింది. ఇందిరా గాంధీ పాలించారు. ఆమె మరణించింది. చాలా కాలం గడిచింది.

ఇప్పటి పాలకులు దూర విద్యను గురించి చెపుతున్నారు. ఉపాధ్యాయుడు లేకుండానే బోధన జరగాలంటున్నారు. పాఠశాలతో పని లేకుండా ఉపాధ్యాయుని ప్రమేయం లేకుండా నిరక్షరాస్యతకు నిర్మూలిస్తామంటున్నారు. దూర విద్య సాధారణ విద్యకు తోడ్పడుతుంది గానీ ప్రత్యామ్నాయం మాత్రం కాదు.

ఇక ఉన్నత విద్య స్వయంపోషకంగా వుండాలి అంటోంది ప్రభుత్వం. కేంద్ర ప్రభుత్వం కొన్ని నెలల క్రితం జనార్ధన్‌రెడ్డి కమిటీని నియమించింది. నేను ఆ కమిటీలో సభ్యుణ్ణి, సమావేశాలు కొన్ని ఢిల్లీలో జరిగాయి. మరికొన్ని హైదరాబాద్‌లో జరిగాయి. ఉన్నత విద్య స్వయం పోషకంగా వుండే విధంగా రూపొందించమని ప్రభుత్వం కమిటీని కోరింది. కేంద్ర ప్రభుత్వం ఉన్నత విద్యకు అయ్యే ఖర్చును తగ్గించుకొని దానిని ప్రజల మీదికి త్రోసింది. ఉన్నత విద్య స్వయం పోషకంగా వుండాలని కమిటీ సిఫార్సు చేసింది. అంటే అన్ని యూనివర్శిటీలు, డిగ్రీ కాలేజీలు, జూనియర్ కాలేజీలు వాటికి అవసరమైన ఆర్థిక వనరుల్ని అవే సమకూర్చుకోవాలి. అంటే ప్రభుత్వం ఉన్నత విద్యపై నామమాత్రంగా ఖర్చు పెడుతుంది. ఈ ప్రతిపాదనను వ్యతిరేకించాను. కాని నా నిరసన, అసమ్మతి త్రోసి వేయబడింది. అదీ ఉన్నత విద్య పరిస్థితి. డబ్బుంటే నీవు కాలేజీకి వెళ్ళవచ్చు. చదువుకోవచ్చు. కాలేజీలు సంపన్నుల చేత నడుపబడుతుంటాయి. అంటే విద్య అన్ని యితర పరిశ్రమలా తయారయింది. ఇతర పరిశ్రమలో పెట్టుబడులు పెట్టినట్లే సంపన్నులు విద్యా రంగంలో పెట్టుబడులు పెడతారు. ఎందుకు? లాభాల కొరకు, ఇది ఉన్నత విద్యకే పరిమితంగాక అన్ని స్థాయిల్లోకి విస్తరించే ప్రయత్నాలు జరుగుతాయి.

సెకండరీ, ప్రాథమిక విద్యపై కేంద్ర ప్రభుత్వం వీరప్ప మొయిలీ కమిటీని నియమించింది. దీనిలో కూడా నేను సభ్యుణ్ణి. ఈ కమిటీని నియమించడంలో ప్రధాన ఉద్దేశం. ప్రాథమిక సెకండరీ విద్యని పంచాయతీ రాజ్ సంస్థలకు అప్పజెప్పడం. అలా అప్పజెప్పడం అంటే ప్రభుత్వాన్ని విద్యా పరమైన బాధ్యతల నుండి తప్పించడం. అన్ని ప్రాథమిక పాఠశాలలకు పంచాయతీ సంస్థలకు అప్పజెప్పాలని నిర్ణయం చేయబడింది. సెకండరీ పాఠశాలలు గూడా పంచాయతీ సంస్థలకు అప్పజెప్పబడతాయి. మరి ఈ పాఠశాలల నిర్వహణకు ఆర్థిక వనరులు ఎవరు సమకూర్చుతారు? జిల్లా పరిషత్‌లు, గ్రామ పంచాయతీలు ఎలా సమకూర్చుతారు? పన్నులను వసూలు చేయడం ద్వారా ఆ విధంగా ఎలిమెంటరీ సెకండరీ విద్యలు క్రమంగా పంచాయతీలు, జిల్లా పరిషత్‌ల ఆధీనంలోకి తీసుకొని రాబడతాయి. ఆ విధంగా ఉన్నత విద్య 'సెకండరీ' ప్రాథమిక విద్యను ప్రైవేటు ప్రైవేటు యాజమాన్యాలకు పంచాయతీరాజ్ సంస్థలకు అప్పజెప్పి, ప్రభుత్వం విద్యకి సంబంధించిన ఏ బాధ్యతలు లేకుండా వుండాలని చూస్తున్నది.

భారత దేశంలో నిరక్షరాస్యులు 50శాతం వున్నారు. ఇతర ఆసియా దేశాలలోనూ, ఆఫ్రికా దేశాల్లోనూ ఉన్నత విద్యకు పోయే వారి సంఖ్య 10 శాతం వుండగా మన దేశంలో వారు 4 శాతానికి మించిలేరు. పాలక వర్గాల ఆలోచనలు యిలాగే కొనసాగితే ఈ శాతం తగ్గుతుందిగాని పెరగదు. అంటే చదువు అందరికి కాదు. కలవారికి మాత్రమే. విద్య కొనుగోలు వస్తువు. అప్పుడు యితర పరిశ్రమల్లాగానే విద్యాసంస్థలు ఖాయిలా పడతాయి. అప్పుడు ఎగ్జిట్ పాలసీలు, గోల్డెన్ హేండ్‌షేక్‌లు విద్యా సంస్థలకు కూడా వర్తిస్తాయి. గోల్డెన్ హాండ్ షేక్ అంటే నిన్ను ఉద్యోగం నుండి బలవంతంగా నెట్టివేయించడమే. ఇంగ్లీషుభాష నాజూకైనది. ఉద్యోగానికి ఉద్వాసన చెప్పడానికి నాజూకుగా గోల్డెన్ హాండ్‌షేక్ అంటున్నది.

పాలకవర్గాలు విద్యావరమైన బాధ్యతల నుండి తప్పుకొనడానికి ప్రయత్నం చేయడమేగాక ఉపాధ్యాయుల్ని, రాజకీయ నాయకుల్ని అజమాయిషీ క్రిందికి తీసుకొనివస్తున్నాయి. పశ్చిమబెంగాల్‌లోను, మరికొన్ని యితర ప్రాంతాలలోనూ మినహాయించి పంచాయతీ సంస్థలు భూస్వాముల చేతుల్లో వున్నాయి. భూస్వాములు, బ్లాకు మార్కెటీర్లు, దౌర్జన్యకర శక్తుల చేతుల్లోకి ఉపాధ్యాయులను, విద్యా సంస్థలను తీసికొని వస్తే వీటిని రాజకీయ ప్రయోజనాలకు వాడుకుంటారు. ఉపాధ్యాయుడు పంచాయతీల చేత నియమించబడాలి అంటున్నారు. వారి జీతాల్ని పంచాయతీలే చెల్లిస్తాయి. వారి సెలవుల్ని పంచాయతీలే మంజూరు చేస్తాయి. క్రమశిక్షణా చర్యలు పంచాయతీలే తీసుకొంటాయి. పంచాయతీలు

పాఠశాల అభివృద్ధికి తనవలన సమకూర్చడంలో సహాయపడవచ్చు. కాని విద్యారంగంపై అజమాయిషీ మాత్రం పంచాయతీలకు అప్పజెప్పరాదు. అందుకే ఆ ప్రతిపాదనలను నేనేగాక చాలా మంది వ్యతిరేకించారు.

పశ్చిమబెంగాల్లో పటిష్టమైన పంచాయతీ వ్యవస్థ వున్నది. పంచాయతీ రాజ్ వ్యవస్థను విద్యాభివృద్ధి కొరకు పర్యవేక్షణ చేసేందుకు పరిమితం చేస్తున్నాం. నియామకాలు, సెలవు, క్రమశిక్షణ అన్నీ కూడా వారి చేతుల్లో పెట్టాలంటుంది మొయిలీ కమిటీ.

గతంలో రాష్ట్ర జాబితాలో వున్న విద్య ఇందిరాగాంధీ పాలనాకాలంలో ఉమ్మడి జాబితాలోకి మార్చబడింది అప్పుడు చాలా మంది విద్యావేత్తలు ఈ చర్యను బలపరిచారు విద్యాపరమైన నిధులు ఢిల్లీ నుండి వివిధ రాష్ట్ర రాజధానులకు అందుతాయని ఆశించారు. కాని జరుగుతున్నదేమిటి? విద్యకు కేంద్ర ప్రభుత్వ కేటాయింపులు తగ్గిపోతున్నాయి. కాని కేంద్రంయొక్క అజమాయిషీ పెరుగుతుంది.

కొఠారి కమిషన్ బడ్జెట్‌లో 6 శాతం విద్యకు కేటాయించాలని సిఫార్స్ చేసింది. కాని ఇప్పుడు ఎంత కేటాయిస్తున్నారు? 3.3 శాతం మాత్రమే. కొఠారి సిఫార్సుల మేరకు ఈ కేటాయింపులనురెట్టింపు చేస్తే విద్యార్థుల నుండి వసూలు చేయనవసరంలేదు. ఈ స్వయం పోషక విద్యాసంస్థల అవసరం వుండదు. ప్రభుత్వంచే నియమించబడిన కొఠారీ కమీషన్ చేసిన సిఫార్సులను పాలకపర్గాలు ఎందుకు అమలుపరచవు?

పశ్చిమ బెంగాల్లో విద్యను వ్యాపారం చేసే సంస్కృతి లేదు. గతంలో నెలకొల్పబడిన మైనారిటీ విద్యాసంస్థలు కొనసాగుతున్నాయి. కొత్తగా ప్రైవేటు యాజమాన్యాలకు కొత్త సంస్థలను ప్రారంభించడానికి అనుమతి యివ్వడంలేదు. పశ్చిమ బెంగాల్లో కేపిటేషన్ ఫీజు వసూలును అనుమతించడంలేదు. యూనివర్శిటీల నుండి ఎలిమెంటరీ పాఠశాలల వరకు గల అన్ని విద్యాసంస్థలు ప్రజాస్వామ్యయుతంగా ఎన్నికైన కమిటీల పర్యవేక్షణలో నడుపబడుతున్నాయి. ఈ కమిటీలలో ఉపాధ్యాయులు, ప్రజాస్వామ్యయుతంగా ఎన్నికైన సభ్యులు ఉంటారు. ఏ ఒక్క పాఠశాల కూడా నిరంకుశమైన అధికారి చేత నడపబడడం లేదు. ఇదీ పశ్చిమబెంగాల్లో మేము నెలకొల్పిన విధానం. విద్యార్థుల మీద ఫీజుల భారాన్ని మోపడం లేదు. స్వయంపోషక విద్యాసంస్థలకు నెలకొల్పేఆలోచన మాకు లేదు. విద్య ప్రాథమిక హక్కని మేము దృఢంగా విశ్వసిస్తున్నాం. పేదవానికి చదువు చెప్పే వ్యూహం ప్రభుత్వానిది. దీనిని విస్మరించే ప్రసక్తి లేదు.

మేము బడ్జెట్‌లో విద్యకు 28శాతం కేటాయిస్తున్నాము. ఢిల్లీ రాష్ట్రం మినహా మరెచ్చటా ఇంత శాతం కేటాయింపులు లేవు. దీనిని ఎట్టి పరిస్థితులలోను తగ్గించేది లేదు. మేము విద్యా వ్యాప్తి కొరకు కట్టుబడివున్నాము. ఉపాధ్యాయుని ప్రజాస్వామ్య హక్కులకొరకు నిబద్ధులమై వున్నాం. ఉపాధ్యాయుని గౌరవిస్తాం. ఉపాధ్యాయులు సమాజంలో నిర్వహించవల్సిన బాధ్యతలను గౌరవిస్తాం. జాతి నిర్మాణంలో ఉపాధ్యాయుని పాత్రను గౌరవిస్తాం.

ఎప్పుడైతే బాధ్యతాయుతమైన ఉపాధ్యాయులు చైతన్యవంతంగా వారిసమస్యల పరిష్కారంకొరకు సమిష్టిగా పోరాడతారో అప్పుడు వారి సమస్యలు పరిష్కరించడం మాత్రమే గాక వారు చేసే పోరాటాలు మార్పుకి, అభివృద్ధికొరకు జరిగే మార్పుకి తోడ్పడతాయి.



## అక్షరాస్యత, సారావ్యతిరేకఉద్యమంలో

# మీ పాత్ర అపూర్వం

హిజ్ ఎక్సెలెన్సీ కృష్ణకాంత్,
గవర్నర్, ఆంధ్రప్రదేశ్.

భారత స్వాతంత్ర్య పోరాట చరిత్రలో చాలా కీలకఘట్టమైన క్విట్ ఇండియా ఉద్యమం యొక్క స్వర్ణోత్సవాలు జరుపుకొంటున్న శుభసందర్భంలో మిమ్మలనందరినీ కలవడం చాలా సంతోషంగా వున్నది. ఇటీవల అక్షరాస్యతా ఉద్యమంలోను, సారావ్యతిరేక ఉద్యమంలోను చురుకుగా పాల్గొన్న ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ ఉపాధ్యాయులు జరుపుకొంటున్న మహాసభలలో పాల్గొంటున్నందుకు నాకు చాలా సంతోషంగా వున్నది.

మహాత్మాగాంధీ అరెస్టు కావటానికిముందు ఆగష్టు 8న ఆయన ఉపన్యసిస్తూ బ్రిటిషువారిని భారతదేశం వదలివెళ్ళమని నినాదమిచ్చారు. విజయమో, వీరస్వర్గమో తేల్చుకోండని భారతప్రజలకు ఉద్బోధించారు. అప్పుడే ఆలిండియా కాంగ్రెస్ కమిటీ 'దున్నేవాడికే భూమి' అని తీర్మానం చేసింది. "స్వతంత్ర భారతదేశంలో మొట్టమొదటగా మీ కర్తవ్యం ఏమిటి?" అని అమెరికన్ జర్నలిస్టు గాంధీజీని ప్రశ్నించగా "దున్నే వాడికే భూమి చెందాలి" అని గాంధీజీ చెప్పారు. "భూస్వాములు, జమీందారులు మీ ఉద్యమానికి చేయూత నిస్తున్నారుగదా, మరి యిదెలా సాధ్యం?" అని ప్రశ్నించగా గాంధీజీ "అవును వారు నాకు సన్నిహితులే, గనుక వారికి స్నేహపూర్వకంగా పొలాలను దున్నుకొనండి లేదా వాటిని పేదరైతాంగానికి వదలివెళ్ళండి" అని చెపుతానన్నారు. "భూస్వాముల భూమిని పేదలకు యిప్పిస్తారు సరే మరి నష్టపరిహారమేమిస్తారు" అని జర్నలిస్టు అడుగగా గాంధీజీ ఆప్రశ్నను అపహాస్యంచేస్తూ "వారు చాలాకాలంనుండి రైతాంగాన్ని దోచుకొంటున్నారు. కనుక నష్టపరిహారం యివ్వనవసరంలేద"ని చెప్పారు. స్వాతంత్ర్యం సాధించి నాలుగు దశాబ్దాలు గడచినా గాంధీజీ ఆశయాలు నెరవేరలేదు. అవి యింకనూ నెరవేర్చవలసే వున్నది.

గాంధీజీ వృత్తి విద్యను గురించి కూడా చెప్పారు. భారత ప్రతినిధివర్గం చైనా సందర్శించినప్పుడు "మీరు గాంధీజీ ప్రవచించిన వృత్తివిద్యను అమలుజరపడంలేదు. మేము అమలు జరుపుతున్నాం" అని చైనా ఛైర్మన్ మావో అన్నారు. గాంధీజీ ప్రవచించిన వృత్తివిద్యలో ప్రధానాంశము 'పనిచేస్తూ విద్యనేర్చుకొనండి'. దీనిని మనం నెరవేర్చలేదు.

"క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా నాయకులందరినీ నిర్బంధిస్తే ఉద్యమాన్ని ఎలా కొనసాగిస్తారు" అని గాంధీజీని అడిగితే ఆయన "అహింసను ఆయుధంగా చేసికొని భారతీయులు ప్రతిఒక్కరూ నాయకులు అవుతారు" అని గాంధీజీ చెప్పారు. మనం గ్రామీణ ప్రాంతంలో నాయకత్వం కొరకు వెతకవలసిన సమయం ఆసన్నమైనది. జాదవ్‌పూర్ యూనివర్శిటీ విద్యార్థి 2 నెలలక్రితం స్టేట్స్ మన్ పత్రికలో వ్రాసిన లేఖ నాకీ సందర్భంగా గుర్తుకు వస్తుంది. "మన తల్లిదండ్రులు మనకు తిండీ, బట్ట యిస్తున్నారు. చదువుకోవడానికి వసతులు కల్పిస్తున్నారు. మనకు చాలా చాలా యిస్తున్నారు. కాని యివ్వనిదేమిటంటే జాతీయభావాల స్ఫూర్తి" అని అతడు ఆ లేఖలో పేర్కొన్నాడు. విద్యార్థులు వివిధ రాజకీయ పార్టీల నాయకుల యెడల అసంతృప్తితో వున్నారు. కారణం వారికి జాతీయభావాల స్ఫూర్తిని అందజేయకపోవడమే. సంకుచిత దృక్పథం గల నాయకులు కొందరు ప్రాంతీయతత్వాన్ని, కులతత్వాన్ని రెచ్చగొడుతూ జాతీయతత్వాన్ని ఆరేబియా సముద్రంలో తొక్కేస్తున్నారు. ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ ఆంధ్ర, తెలంగాణా, రాయలసీమ ఉపాధ్యాయులను సమైక్యపరచిందని విన్నాను. ఆంధ్ర రాష్ట్రంలోని ప్రాంతాలను సమైక్యపరచటమేకాదు. భారతదేశంలోని వివిధ ప్రాంతాలను సమైక్యపరచే వేదికగా యు.టి.ఎఫ్. వుండాలని నేను కోరుతున్నాను.

ఈనాడు గ్రామీణ ప్రాంతంలోని నాయకత్వం పట్టణానికి చేరుకొన్నది. దీనిలో నాయకత్వం గ్రామాల్లో లేకుండా పోయింది. ఆస్తిపాస్తులు కలవారు వారి బిడ్డలను పట్టణాల్లోని ఇంగ్లీషుమీడియం కాన్వెంట్లకు, ప్రైవేటు స్కూళ్ళకు పంపుతున్నారు. భూమిలేని పేదలు, కష్టజీవులు, అనాధలు వారి బిడ్డలను ప్రభుత్వ పాఠశాలలకు పంపిస్తున్నారు.

భారతదేశంలో లభ్యమయ్యే వనరులు తక్కువ పేదరికం ఎక్కువ. ప్రాథమిక పాఠశాలలో 70 నుండి 150 వరకు గల పిల్లలకు ఒకే ఉపాధ్యాయుడు బోధించవలసిన పరిస్థితి వున్నది. కాని ఈ పరిస్థితిని ఒక సవాలుగా స్వీకరించాలి. గ్రామీణ పేద ప్రజానీకానికి, నిరుద్యోగులకు, కష్టజీవులకు, నిరక్షరాస్యులకు ఉపాధ్యాయుడు కేవలం ఉపాధ్యాయునిగా కాక వారికి నిజమైన గురువుగా పనిచేయాలి. చరిత్రగమనానికి చోదకశక్తిగా నిర్వహించవలసిన గురువు పాత్రను చరిత్ర స్పష్టం చేస్తున్నది.

మీరాభాయి తులసీదాస్‌ను గురువుగా ఎన్నుకున్నది. "నాభర్త చెప్పేమాట నేను అనుసరించలేకపోతున్నాను. మానాన్న చెప్పే విషయాలను నేను పాటించలేకపోతున్నాను. అందుకే మీవద్దకు వచ్చాను. నాకు ఉపదేశమివ్వండి" అని మీరాభాయి తులసీదాసుని అర్థించింది. క్లిష్టమైన అంశాలలో తల్లిదండ్రులకంటే బంధువులకంటే గురువే చక్కని హితబోధ చేయగలరు. న్యాయాన్యాయాల సమస్య ఎదురైనప్పుడు భరతుడు తల్లిని తిరస్కరించాడు. ప్రహ్లాదుడు తండ్రిని తిరస్కరించాడు. విభీషణుడు అన్నని తిరస్కరించాడు. వీరంతా అంతరాత్మ ప్రబోధించిన మార్గాన్ని చేపట్టారు. కాబట్టి నీ అంతరాత్మ ప్రబోధించిన విధంగా నీవు నడచుకొమ్మని తులసీదాసు మీరాభాయికి ఉపదేశించారు. అదేవిధంగా మహాత్మాగాంధీ 'మీ అంతరాత్మ ప్రబోధంమేరకు బ్రిటిషువారిని ఎదిరించండని' చెప్పారు. అలాగే గ్రామీణప్రాంతంలో నాయకత్వం కొరవడిన తరుణంలో ఉపాధ్యాయులు ఈ సవాలును స్వీకరించి నాయకత్వ కొరతను నివారించాలి. ప్రజలను ప్రేమించే సాంప్రదాయం, ప్రజలకు సేవచేసే సాంప్రదాయం, త్యాగం చేసే సాంప్రదాయంగల ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ ఈ సవాలును స్వీకరించి నిజమైన గురువుల

పాత్రను నిర్వహించాలి.

నగర ప్రజలకు ఒక ఇబ్బందివుంది. వీరు నిరంతరం ఉద్రిక్తత ఉద్వేగాలకు గురవుతూ వుంటారు. వారికి కూడా సరియైన సామాజిక దృక్పథం కలిగించవలసిన బాధ్యత ఉపాధ్యాయులపైననే వుంది.

సైన్సు సామాన్యుడిని ఏం చేయగలదో భారత జ్ఞాన విజ్ఞాన సమితి ప్రజలకు తెలియచెప్పింది. ఆ స్ఫూర్తితో మీరు గురువులపాత్రను నిర్వహించాలి. వారు భారతజ్ఞాన విజ్ఞాన సమితి స్థాపించినప్పుడు వారికి గల బలం ప్రజాబలం మాత్రమే. మంచి చేసేందుకు కావలసింది డబ్బుకాదు, భవనాలుకాదు, అంతర్గత చైతన్యం కావాలి. ఆంధ్రప్రదేశ్‌లో ఒక మారుమూల ప్రాంతంలో పనిచేసే ఉపాధ్యాయుని గురించి విన్నాను. ఆయన బోధించే తరగతిలో 150 మంది విద్యార్థులు వున్నారు. అందుకు ఆయన ఎవరినీ నిందించడంలేదు. ప్రభుత్వాన్ని నిందించలేదు. బిడ్డలకు విద్యాబుద్ధులు నేర్పాలనే తహతహ, తాను చేస్తున్న పనిమీదగల ఆసక్తి ప్రశంసనీయాలు. బిడ్డలు ఆసక్తిగా చదువుకొంటున్నారు. గ్రామస్థులు ఆతడిని చాలా అభిమానిస్తున్నారు. అతడు తన పేరుని గాని, మంచి ఉపాధ్యాయుడని గాని ఎవరికీ చెప్పవద్దంటాడు. అలా చెపితే బదిలీవస్తుందిగనుక. అంకితభావంగల ఉపాధ్యాయులు కొందరు నాకు తెలుసు. చిత్తశుద్ధిగా పనిచేసే ఉపాధ్యాయులకు ప్రభుత్వగ్రాంటు రాకపోయినా ప్రజలే జీతభత్యాలు అందజేసిన సందర్భాలు నాకు తెలుసు.

ఉపాధ్యాయుడు గ్రామీణ ప్రాంతంలో ఎక్కువజీతం పొందుతున్న ఉద్యోగే. అయినప్పటికీ కొందరు ఉపాధ్యాయులు అదనపు సంపాదన కొరకు పలు రకాల వ్యాపకాలలో నిమగ్నమవుతున్నారు. యు.టి.ఎఫ్‌వంటి బలమైన సంస్థ పనిచేస్తుండగా యిలాంటి అవాంఛనీయ ధోరణులు ప్రబలకూడదు. భూస్వామి వడ్డీవ్యాపారి ఏవిధంగా వంచన చేశారో అదేవిధంగా గ్రామానికి చెందిన బిడ్డలను నేనూ వంచన చేస్తున్నానా? భూమిలేని శ్రామికవర్గాన్ని, చేతివృత్తులవారిని మోసం చేస్తున్నానా? అని ఉపాధ్యాయుడు ప్రశ్నించుకోవాలి.

నేను మీ సమస్యలను ముఖ్యంగా ఉపాధ్యాయుల సమస్యలను అర్థం చేసుకొనగలను. మీరు మీవృత్తిపరమైన సమస్యలను పరిష్కరించుకొంటూనే, అక్షరాస్యతా కార్యక్రమంలో పనిచేస్తూనే, సారా వ్యతిరేక ఉద్యమంలో పాలుపంచుకొంటూనే, మీ ప్రధాన వ్యాపకమైన బోధనకు అంతరాయం రాకుండా చూసుకోవాలి. మీరు సమయానికి పాఠశాలకు వెళ్ళి విధులను సక్రమంగా నిర్వహించాలి. విద్యార్థులు ఉపాధ్యాయుణ్ణే ఆదర్శంగా తీసికుంటారు.

స్వతంత్ర భారతదేశంలో చట్టం అమలు జరిగేలా చూడటం మనందరి బాధ్యత. బ్రిటిషువారిపై పోరాడేటప్పుడు చట్టాన్ని ధిక్కరించడానికి అలవాటు పడడంతో స్వతంత్రం పొందిన తరువాత చట్టానికి లోబడి వుండడం విస్మరించాము. చట్టానికి కట్టుబడి వుండడం నిర్మాణాత్మక చర్యగా గాంధీజీ మనకు బోధించారు.

మిత్రులారా మరొక విషయం. ముస్లింలీగ్‌కు చెందిన జఫర్ ఆలీ జవహర్‌లాల్ మంత్రివర్గంలో మంత్రిగా వుండేవారు. తరువాత ఆయన పాకిస్తాన్ ప్రభుత్వంలో మంత్రి. ఆ తరువాత ఢిల్లీలో పాకిస్తాన్ హైకమీషనర్‌గా పనిచేశారు. ఆయన "నీకు ఇండియా-పాకిస్తాన్‌ల మధ్యగల భేదం తెలుసా?" అని అడిగి చాలా ఆసక్తికరమైన విషయాలు చెప్పారు. "ముస్లింలీగ్ ఒక రాజకీయపార్టీ కాదు. మేము కేవలం హిందూ వ్యతిరేకులం. పోట్లాడేందుకు మాకు ఏమీ లేకపోతే పాకిస్తాన్‌లో మాలో మేము పోట్లాడుకుంటున్నాం. స్వతంత్రం వచ్చిన తరువాత నెహ్రూ చాలాకాలం బ్రతికారు. కాని జిన్నా చనిపోయాడు. రాట్నం వడకమని చెప్పిన గాంధీజీ మిమ్మల్ని రక్షించాడు." ఆయన ఎలా రక్షించాడు. బ్రిటిషువారితో పోరాడుతూనే నిర్మాణాత్మకమైన కార్యక్రమాలు రూపొందించాడు. నీవు నీ అనుచరులకు కేవలం పోరాడటం మాత్రమే నేర్పితే మీ ఉమ్మడి శత్రువు పోయిన తరువాత వారు అంతర్గతంగా పోట్లాడుకుంటారు. అందుకే పాకిస్తాన్‌లో మేము ప్రజాస్వామ్యాన్ని పోగొట్టుకున్నాం. నిర్మాణాత్మకమైన కార్యక్రమాలు సాగిస్తుండడంవలననే భారతదేశంలో ప్రజాస్వామ్యం మనగలుగుతున్నది.

ఉపాధ్యాయులు గ్రామస్వరాజ్ కొరకు పనిచేస్తున్నారని విన్నాను. ఇది చాలా మంచి కార్యక్రమం. గాంధీగారు చెప్పింది కూడా అదే. ప్రస్తుతం పబ్లిక్ సెక్టారు ప్రైవేటు సెక్టారు విఫలమైన స్థితిలో గాంధీజీ ప్రవచించిన ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని గురించి ఎందుకు ఆలోచించకూడదు? ఒక పారిశ్రామికవేత్త గ్రామపరిషత్‌కి ధర్మకర్త కావడం చాలా కష్టం. కాని ఉపాధ్యాయులు జాతికి ధర్మకర్తలు కాగలగడం సాధ్యమనే నేను భావిస్తున్నాను.

మీరు గ్రామాలకు ధర్మకర్తలయినప్పుడు పరిస్థితులు మారతాయి. మీరు కొత్తతరాన్ని సృష్టిస్తారు. వారు పట్టణాలకు వెళ్ళినప్పుడు వాటిని పూర్తిగా మార్చగలుగుతారు. పట్టణాలు, నగరాలు కూడా యిలాగే వుండిపోవు.

కాబట్టి గ్రామాలలోని బిడ్డలంతా బడిలో చేరేలా చూడడం ఉపాధ్యాయుని కర్తవ్యం. కొంత జీతం తీసికొంటూ కొన్ని గంటలు పనిచేసే బాధ్యతగల ఉద్యోగిగా గాక గ్రామం అంతా మీదిగా భావించాలి. ఉపాధ్యాయుడు గ్రామానికి గురువుకావాలి. ధర్మకర్త కావాలి. తల్లిదండ్రులతో సత్సంబంధాలు పెట్టుకోవాలి.

మనం ఒకప్పుడు జపాన్‌ను గురించి చాలా హేళనగా చెప్పుకునేవాళ్ళం. కాని 40, 50 ఏళ్ళలో జపాన్ ఎలా ఎదిగింది? వారు వారి ప్రజల్ని ఎలా చైతన్యపరచగలిగిందీ నేను విన్నాను. వారికి ఒకప్పుడు ముడిపదార్థాలులేవు, వనరులు లేవు. సాంకేతిక పరిజ్ఞానం లేదు. కాని ఈనాడు జపాన్ సాంకేతిక పరిజ్ఞానంలో, తలసరి ఆదాయంలో అమెరికాను అధిగమిస్తున్నది. జపాన్ దేశం ఈ అభివృద్ధిని ఉపాధ్యాయుల ద్వారా సాధించగలిగింది. ఉపాధ్యాయులు ఎలా సాధించగలిగారు. ప్రతి బిడ్డకీ ఒక జపాన్ పటం యిచ్చారు. అది ప్రతి ఇంట్లో వుంటుంది. వారు బిడ్డలకు యిలా చెపుతారు. "ఇది జపాన్. నాదేశం. ఎంత అందమైన దేశం! మన దేశంలో నావలున్నాయి. పర్వతాలున్నాయి. చెట్లూ, చేమలూ చుట్టూ సముద్రం. మనది చాలా గొప్పదేశం. కాని లోపమేమిటంటే మనకు ముడిపదార్థాల కొరతవున్నది. బొగ్గులేదు. ఇనుములేదు, సాంకేతిక పరిజ్ఞానంలేదు, సాంకేతికపరంగా మనం పురోగమిస్తే ఈ లోపాలను అధిగమించగలం" అని ఉపాధ్యాయులు బోధించారు. జపాన్ ప్రపంచంలో అత్యంత సంపన్నవంతమైన దేశంగా ఎదిగింది.

ఇక మన దేశం గర్వించదగిన చరిత్రగల దేశం. సాంస్కృతిక వారసత్వంగల దేశం. పోరాడి స్వాతంత్ర్యం సాధించిన పోరాట చరిత్రగల దేశం.

కాని రాజకీయ నాయకులు, అధికారులు లంచగొండులనే అపవాదు వున్నది. ప్రాంతీయ కులమత భేదాలతో సతమతమవుతున్నాం. ఏం చేయాలి?

గురువులారా! భారతదేశపు ధర్మకర్తలారా! ప్రతి బిడ్డకు భారతదేశపు పటాన్ని యివ్వండి. మనది చాలా సంస్కృతి సాంప్రదాయాలు గల దేశమని చెప్పండి. గొప్ప చరిత్రగల దేశమని చెప్పండి. అవినీతి, లంచగొండి విధానాలకు వ్యతిరేకంగా పోరాడమని చెప్పండి. గంగ మనది. యమున మనది. గోదావరి మనది. కృష్ణ మనదే. కావేరిమనది. ఢిల్లీ మనది. బొంబాయి, మదరాసులు మనవి. కలకత్తా మనది. ఇవన్నీ మనవి. జాతీయ భావాల్ని పెంపొందించండి. కులమత ప్రాంతీయ విచ్ఛిన్నకర శక్తులేవీ మనల్ని విడదీయలేవనే సందశాన్ని ప్రతి బిడ్డకీ అందజేయండి.



# స్త్రీలు చైతన్యవంతమైతేనే దేశానికి విముక్తి

శ్రీమతి మాలినీ భట్టాచార్య ఎం.పి

తెలంగాణా పోరాటంలో మహిళలు అద్వితీయమైన పాత్రను నిర్వహించారు. ఇటీవలి కాలంలో అక్షరాస్యతా ఉద్యమంలోను, అలాగే సారా వ్యతిరేక ఉద్యమంలోనూ స్త్రీలు గణనీయమైన పాత్రను నిర్వహించారు. పశ్చిమబెంగాల్, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్‌లలో అక్షరాస్యతా ఉద్యమం సామాన్య ప్రజానీకానికి వ్యాపించింది. స్త్రీలను చైతన్య పరచింది. వారిలో నిద్రాణమై వున్న శక్తిని వెలికితీసింది. అక్షరాస్యతా హక్కు రాజ్యాంగంలో పొందు పరచబడింది. కాని అది అలంకారంగా వుండి పోయింది. ప్రభుత్వ లెక్కల ప్రకారమే ఇంకా 50శాతం నిరక్షరాస్యులుగా వుండి పోవడం విచారకరం.

తెలంగాణా సాయుధ పోరాటకాలంనాడు మనం సాంఘిక న్యాయం కోసం పోరాడాము. కాని స్వాతంత్ర్యం వచ్చి 46 సంవత్సరాలు గడచినా సాంఘిక న్యాయం ఎండమావిగానే వుండిపోయింది.

ఈనాడు ఆగస్టు 9 క్విట్ ఇండియా 50వ వార్షికోత్సవం జరుపుకుంటున్నాము. ఒక నాడు బ్రిటిష్ సామ్రాజ్యవాదులు మన దేశం వదలిపోవాలని నినదించాం. ఉద్యమించాం, ఉవ్వెత్తుగా ఉద్యమించాం. ఈనాడు చేతులు చాచి దేశం తలుపులు బార్లా తెరచి సాదరంగా సామ్రాజ్యవాద పెట్టుబడిని, సంస్కృతిని ఆహ్వానిస్తున్నాం. క్విట్ ఇండియా ఉద్యమకాలంలో పారతంత్ర్యాన్ని ఈసడించి స్వాతంత్ర్యాన్ని కోరాం. ఈనాడు స్వావలంబనను పణంగా పెట్టి పరాధీనతను ఆహ్వానిస్తున్నాం. ఉప్పు సత్యాగ్రహం రోజుల్లో అప్పటి చట్టాన్ని ధిక్కరించి ఉప్పు తయారు చేసుకొన్నాం. ఉప్పు స్వాతంత్రానికి సంకేతంగా భావించబడింది. కాని బాధాకరమైన విషయమేమిటంటే గుజరాత్ రాష్ట్రంలో గాంధీజీ ఎక్కడ ఉప్పు సత్యాగ్రహం ప్రారంభించాడో అదే చోట ఈనాటి స్వతంత్ర భారతదేశం ఉప్పు తయారు చేసుకునేందుకు కార్గో అనే బహుళజాతి సంస్థను ఆహ్వానించి అనుమతించింది.

మనం ఉపాధ్యాయులం. భావి భారత పౌరులను తీర్చిదిద్దేవారం. కాని ఎలాంటి యువతరం తయారవుతున్నది. మన భాషా సంస్కృతులు, సాంప్రదాయాలకు భిన్నంగా సామ్రాజ్యవాద విష సంస్కృతీ సాంప్రదాయాలు స్టార్, కేబుల్ టి.వి.ల ద్వారా విస్తృతంగా దిగుమతి చేయబడుతున్నాయి. ప్రజలకు ఒక రకమైన సంస్కృతి కావాలని ఏదేశమైనా వాంఛిస్తుంది. కాని ఎలాంటి సంస్కృతి దిగుమతి అవుతుంది? అందాల పోటీల సంస్కృతి, ఫాషన్ పెరేడ్‌ల సంస్కృతి, పాప్ మ్యూజిక్‌ల సంస్కృతి దిగుమతి అవుతున్నది. ఈ విధంగా సాంస్కృతిక రంగంలో కూడా సామ్రాజ్యవాదుల ఆధిపత్యమే రుద్దబడుతున్నది.

ఇక అక్షరాస్యతను గురించి మనం ఘనంగా చెప్పుకొంటున్నాం. చైనాలో కొత్తగా అక్షరాస్యులైన వారికి అవసరమైన పాఠాలు ప్రతిరోజు నిర్దిష్ట సమయంలో టి.వి.ద్వారా బోధించబడుతున్నాయి. మనకు అలాంటి ఏర్పాట్లు ఏమైనా వున్నాయా; మెట్రో ఛానల్స్ తప్ప?

ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే మన విధానాలకు రూపకల్పన పార్లమెంట్‌లో చేయబడటం లేదు. మంత్రివర్గ సమావేశాలలో చేయబడడం లేదు. విధానాల రూపకల్పన వాషింగ్టన్‌లో చేయబడి దిగుమతి చేయబడుతున్నాయి. వాషింగ్టన్ విధానాల ననుసరించే మన ఆర్థిక విధానం, పారిశ్రామిక విధానం, విద్యావిధానాలు రూపకల్పన చేయబడుతున్నాయి. ఈ విధానపరమైన నిర్ణయాల ప్రభావం మహిళలపై గణనీయంగా పడుతోంది.

ఉద్యోగాలు చేస్తూ సంఘటిత రంగంలో పనిచేస్తున్న స్త్రీలు 7శాతానికి మించిలేరు. కాని అసంఘటిత రంగంలో అనునిత్యం బ్రతుకు దెరువు కోసం పనిచేస్తున్న మహిళా కార్మికుల పని పరిస్థితులు దయనీయంగా వున్నాయి. రేపు పని దొరుకుతుందనే గ్యారంటీ లేదు. వారి కెలాంటి రక్షణ లేదు. ప్రభుత్వం అనుసరిస్తున్న ఆర్థిక విధానాల వలన అసంఘటిత కార్మికుల సంఖ్య నానాటికీ పెరుగుతున్నది. మన కొరకు మనమే గాక వారి కొరకు ఏం చేయగలం అని కూడా ఆలోచించాలి.

మన ఆర్థికమంత్రి మన్మోహన్‌సింగ్ ఈ సంవత్సరం బడ్జెట్ ప్రసంగంచేస్తూ సబ్బులు, షాంపూలు, పౌడర్లు, క్రీములలాంటి వినిమయ వస్తువులపై ధరలు తగ్గిస్తున్నట్లు ప్రకటించారు. ఎందుకు? అని ప్రశ్నవేసుకొని ఆయనే జవాబు చెప్పారు. వ్యాపారులే గాక చాలా మహిళాసంఘాల ప్రతినిధులు నా దగ్గరికి వచ్చి సౌందర్య పోషకాలైన సబ్బులు, పౌడర్లు, క్రీముల ధరలు తగ్గించమని అర్థించారని చెప్పారు. నేను కూడా మహిళాసంఘంలో పనిచేస్తున్నాను. కాని నాకు తెలిసినంతవరకు మా సంఘమే గాక ఏ మహిళాసంఘం కూడా మన్మోహన్‌సింగ్ వద్దకు వెళ్ళి సౌందర్యపోషకాల ధరలు తగ్గించండి అని అర్థించలేదు. ఏ మహిళాసంఘాల కార్యకర్తలైనా బియ్యం, గోధుమలు, కిరోసిన్ లాంటి నిత్యావసర ధరలను గురించి ఆలోచిస్తారు గాని సౌందర్య పోషకాలను గురించి కాదు. కాని మన ఆర్థికమంత్రి మన్మోహన్‌సింగ్ నిత్యావసర వస్తువులను విస్మరించి సౌందర్య పోషకాలపై భారీ రాయితీలను ప్రకటించారు. మన ఆర్థిక విధానం ఏ దిశలో పయనిస్తోంది? ఐ.ఎం.ఎఫ్. అప్పులలో కూరుకొని పోయి ఆకలి చావులకు గురవుతున్న సహారా సోమాలియా దిశల్లో కాదా?

ఇక లిబరలైజేషన్ అనే నినాదం ఇచ్చారు. ఎవరిపట్ల ఉదారవాదం? ఇది ఎవరికి ప్రయోజనాన్ని చేస్తూ వస్తుంది? కొద్దిమంది సంపన్నులకే. మరొక నినాదం 'అభివృద్ధి కొరకు దిగుమతి' దీనివలన ఎవరు ప్రయోజనంపొందుతున్నారు? ఎవరు ఇబ్బందులకు గురవుతున్నారు? సంపన్నులు సంపన్నులవుతున్నారు. మధ్యతరగతివారు, రెక్కాడితేగాని డొక్కాడని కష్టజీవులు, మహిళలు, బిడ్డలు కష్టాల కడలిలోకి నెట్టివేయబడుతున్నారు.

మనదేశంలోని దాదాపు అన్ని రాష్ట్రాలలో వరకట్న దురాచారం

వున్నది. ఈ దురాచారం కారణంగా చాలా మరణాలు సంభవిస్తున్నాయి. వినిమయ వస్తువులపై ప్రసార సాధనాలు చేసే అడ్వర్‌టైజ్‌మెంట్లు యువదంపతులపై ఎలాంటి ప్రభావం చూపుతాయి? టి.వి., ఫ్రిజ్, కూలర్‌లాంటివి నిత్యావసరవస్తువులనీ, అవి లేనిదే జీవితం గడవదనే భావం కలుగుతుంది. అమ్మానాన్నలపై ఒత్తిడిచేసి రాబట్టుకునే సమయంపెళ్ళి సమయం అనే భావం కూడా ఈ అడ్వర్‌టైజ్‌మెంట్లు కలిగిస్తున్నాయి. కొద్దిమంది వ్యాపారుల ప్రయోజనాల కొరకు చేసే ఈ అడ్వర్‌టైజ్‌మెంట్లు సాధారణ కుటుంబాలలో చిచ్చుపెట్టడంలేదా?

రెండవ ఉదాహరణ. కుటుంబ నియంత్రణకు ప్రభుత్వం విస్తృత ప్రచారం యిస్తున్నది. మన దేశ ప్రయోజనాల రీత్యా ఇది చాలా అవసరం. కుటుంబ సంక్షేమానికి గట్టి హామీలేకుండా కుటుంబ నియంత్రణపాటించేలా చేయడం కష్టసాధ్యం. శిశుమరణాలు, ప్రసూతి మరణాలు నివారించకుండా, బిడ్డలు ఆరోగ్యంగా ఎదుగుతారనే విశ్వాసం కలిగించకుండా కుటుంబ నియంత్రణను జయప్రదం చేయడం కష్టసాధ్యం. ఈనాడు సామ్రాజ్యవాద దేశాలు వారి దేశాలలో ఉపయోగించనివి, కాలం చెల్లిపోయినవి, అయినాకుటుంబ నియంత్రణ కవసరమైన పరికరాలను, పద్ధతులను మందులను మనపైన రుద్దుతున్నారు.

మూడవ ఉదాహరణ. గర్భస్థ శిశువులకు సంబంధించినది. జన్యు సంబంధమైన పరీక్షను పుట్టబోయే బిడ్డ మగబిడ్డా, ఆడబిడ్డా అని తెలుసుకొనడానికి దుర్వినియోగపరచబడుతున్నది. ఆడబిడ్డ అనినిర్ధారణ అయితే గర్భస్రావాలు చేయిస్తున్నారు. ఈవిధంగా స్త్రీ జాతికి అన్యాయం చేస్తున్నారని డాక్టర్లతో అంటే ఈ దేశంలో శాస్త్రం అభివృద్ధి చెందడం మీకిష్టంలేదా! అని వారు ఎదురు ప్రశ్న వేస్తున్నారు. శిశు సంక్షేమానికి ఉపయోగపడే సాంకేతిక పరిజ్ఞానాన్ని మనం వ్యతిరేకించం. మహిళల యెడల చూపే వివక్షతను మనం వ్యతిరేకిస్తున్నాం.

ఇక వాణిజ్యపరమైన వినిమయవస్తువుల విషయానికి వస్తే, వాటికి ప్రసారసాధనాలద్వారా యిచ్చే అడ్వర్‌టైజ్‌మెంట్లు పిచ్చి ఎక్కించేటంత తీవ్రంగా వున్నాయి. ఈ వ్యాపార ధోరణి మనం పనిచేస్తున్న విద్యారంగంలో కూడా ప్రవేశపెట్టబడుతున్నది. విద్యను ప్రైవేటీకరణ చేయడం అంటే విద్యను హక్కుగా గుర్తించడంగాక వినిమయవస్తువుగా గుర్తించడం. ఇలా చేయడంవలన ప్రభుత్వం తన బాధ్యతలనుండి తప్పుకొంటుంది. ప్రభుత్వం ఈ బాధ్యతను ప్రైవేటు వ్యక్తులకు అప్పజెప్పటంవలన మూసపోసిన సంస్కృతి రుద్దబడుతుంది.

మన రాజ్యాంగం విభిన్నమైన అభిప్రాయాలను కలిగివుండడాన్ని అంగీకరిస్తుంది. సంస్కృతిలో, భాషలో మత విశ్వాసాలలో విభిన్నతను అంగీకరిస్తుంది. మనం మార్కెట్‌పరమైన ఉత్పత్తి విధానాల్ని చూస్తే వైవిధ్యానికి మారుగా మూతపోసిన విధానం రుద్దడాన్ని గమనించవచ్చు. ఉదాహరణకు అడ్వర్‌టైజ్‌మెంట్లలో చూపించే వ్యక్తులను చూడండి. వారు ఇండియాలోని ఏ ప్రాంతానికి చెందిన వారుగా కనిపించరు. ఈ అడ్వర్‌టైజ్‌మెంట్లద్వారా ఒక సంకరజాతి సంస్కృతి మనపై రుద్దబడుతున్నది. మన దేశంలో గల వైవిధ్యం పట్ల అసహనాన్ని ప్రదర్శిస్తున్నది మార్కెటుశక్తులేగాదు. మన సంస్కృతిపై దాడి సాగిస్తున్న మత ఛాందసశక్తులు గూడా. ఈ మత ఛాందస శక్తులు చేసే మాయాజాలంవలన ఎటుచూసినా నీకు నీవే కనిపిస్తావు. నీవు అలాంటి అద్దాలగదిలో నివసించదలచుకొన్నావా? ఎలాంటి భిన్నాభిప్రాయాలను మన్నించే స్థితిలో లేవా? వివిధ భాషలు, వివిధ సంస్కృతులు, వివిధ మత విశ్వాసాలకు నిలయంగా వుండడం భారతదేశం ప్రత్యేకత, విశిష్టత. కాని మత ఛాందసశక్తులు ప్రయత్నించే ఈ మూసపోసిన విధానం ప్రత్యేకించి మహిళలకు చాలానష్టం కలిగిస్తున్నది.

[illegible]

చదువుకునే రోజు లెళ్ళాయ్
చదువుకొనే రోజు లొచ్చాయ్
విద్య కూడా వ్యాపారమయింది
కొనే వాళ్ళు రండి రండి
గల్లికొక్క ట్యూషను
వీధికొక కాన్వెంటు
గురుకులాల పేరుతో
పల్లెపల్లెనా రెసిడెన్షియల్లు
యల్.కె.జి., యు.కె.జి
మమ్మీల డాడీల
ఖుషీ జరా దేఖోజి
పరభాషకు విలువ పెంచి
పైసలిచ్చి చదివే చదువు
మనకు వచ్చి పడిందండి
బస్తీలను దాటింది
పల్లెలకు ప్రాకింది
నర్సరీకెల్లకు సంశయించి
ప్రతికోర్సు ఎంట్రన్స్‌కు
పరీక్షలను ప్రభుత్వం
ప్రతి ఏటా జరుపుతుంది
టేచింగుల పేరుతో
కోచింగులు వెలిసాయి

లాడ్జింగులు బోర్డింగులు
హోల్‌సేల్‌గా ఫీజులు
పోటీల మార్కెట్‌లో
ప్రకటనలు పబ్లిసిటీలు
పేరుపేరు సబ్జక్టులకు
వేరువేరు ఫీజులున్నాయ్
తారుమారు దుకాణాల్లో
మారుతాయి ఫీజులండి
ఎంట్రన్సుల వ్యూహంలో
నువ్ ఎంటర్ కాకపోతే
డొనేషన్ కాపిటేషన్
దొడ్డి దారులున్నాయి
అక్కడ కూడా రాకపోతే
ప్రక్క మనకు రాష్ట్రముంది
వలసపోయి చదువుకొనే
వరుస ఏటా వుండనే వుంది.
ఆశించిన ఆశాభంగం
మంచితరుణం మించిపోవును
కట్నాల చదువులండి
అమ్మకానికి సిద్ధమండి
కొనేవాళ్ళు రారండి.

-ఎం.డి.అరిఫ్ సాదిక్



# ఉపాధ్యాయులు సామాజిక స్పృహతో పనిచేయాలి

శ్రీ మోటూరు హనుమంతరావు, యం.పి.

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ అమరజీవి చెన్నుపాటి లక్ష్మయ్య ఆశయాల కంకితమై, వాటిని ముందుకు తీసికొనిపోవడానికి నిరంతరం కృషి చేస్తున్న సంఘం. చెన్నుపాటి ఒరవడిలో అమరజీవులు సుబ్బరాజు, సీతారామాచారి, మైనేని, సూర్యనారాయణ రాజులచే తీర్చదిద్దబడిన సంఘం. ప్రాంతీయ విభేధాలకు, కేడర్‌వారీ విభేదాలను అధిగమించి రాష్ట్ర వ్యాప్తంగా ఉపాధ్యాయ సంఘాలలో అత్యంత పెద్ద సంఘంగా ఎదగడానికి కారణం యు.టి.యఫ్. అవలంబిస్తున్న సూత్రబద్ధవైఖరే. వృత్తి పరమైన సమస్యల పరిష్కారానికి కృషి చేయడంతోపాటు ఉపాధ్యాయులలో సామాజిక స్పృహను పెంచేందుకు కృషి చేస్తున్న సంఘం యు.టి.యఫ్. ఉపాధ్యాయుల సంక్షేమం సమాజం యొక్క సంక్షేమంలో అంతరంగంగానే వుంటుందని గుర్తించిన సంఘం యు.టి.యఫ్. ఉన్నతమైన లక్ష్యాలు ఆశయాలు గల వేలాది మంది కార్యకర్తలు హాజరైన ఈ మహాసభలో ప్రసంగించే అవకాశం కల్పించినందులకు ముందుగా ధన్యవాదములు తెలియచేస్తూ మీతో కొన్ని ప్రాధమికమైన విషయాలు ప్రస్తావిస్తాను.

వివిధ రాజకీయ పార్టీలకు చెందిన వారిని ఆహ్వానించి, విభిన్న దృక్పధాలు గలవారి అభిప్రాయ వేదికగా ఈ సభను ఏర్పాటు చేసిన మీ ప్రజాస్వామి దృక్పథాన్ని ముందుగా అభినందిస్తున్నాను.

ఉపాధ్యాయునికి గల సామాజిక దృక్పథం యొక్క ప్రభావం విద్యార్థులపై పడుతుంది. అభ్యుదయ కాముకుడైన ఉపాధ్యాయుడు తన విద్యార్థులలో స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, త్యాగం, దేశభక్తి లాంటి మంచి భావాలను పెంపొందించగలుగుతాడు. సంకుచితమైన భావాలు గల ఉపాధ్యాయుడు తన విద్యార్థులలో ఈర్ష్య, అసూయ, స్వార్థం, పిరికితనం లాంటి భావాలను పెంపొందించ గలుగుతాడు. కాబట్టి ఉపాధ్యాయుడు అలవరచుకొన్న సామాజిక దృక్పథం, సామాజిక చైతన్యం యొక్క ప్రభావం విద్యార్థులపై చాలా ప్రభావాన్ని చూపుతుంది.

ఉపాధ్యాయులు తాము బోధించవలసిన పాఠ్య పుస్తకాలనే గాక సమాజాన్ని అధ్యయనం చేయాలి. విద్యార్థులచేత అధ్యాపనం చేయించాలి. సామాజిక పరిస్థితులను విశ్లేషించి చూడగలిగే శక్తిని విద్యార్థులకు కలిగించాలి. సమాజంలో చాలా సామాజిక శక్తులు పనిచేస్తున్నాయి. వాటిలో అభివృద్ధి కాముక శక్తులు లేవి? యధాతధస్థితిని కాపాడే వేవి? తిరోగమన శక్తులేవి? ఈ వర్గీకరణ చేసికొనగల శక్తి బిడ్డలకు అందించగలిగితే మంచి మానవత్వం వెల్లివిరిసే రేపటి తరం రూపుదిద్దుకొంటుంది.

ఈనాడు దేశంలో నెలకొని వున్న అస్తవ్యస్త పరిస్థితులు, అనుదినం పెరుగుతున్న అవినీతి, ఆశ్రిత పక్షపాతం, లంచగొండితనం, సామాన్య ప్రజానీకం బతుకుల్ని నానాటికి దుర్భరంగా మారుస్తున్న ఆర్థిక, పారిశ్రామిక విధానాలు, నాలుగున్నర దశాబ్దాల స్వతంత్ర భారతదేశంలో యింకనూ ఎండమావిగానే మిగిలిన సామాజిక న్యాయం, దినదినాభివృద్ధి చెందుతూ ఆటవిక దశను జ్ఞప్తికి తెస్తున్న మత మౌఢ్యం, కుల మత ఘర్షణలు లాంటివి ఆలోచనాపరులకు ఆందోళన కలిగిస్తున్నాయి. ఉపాధ్యాయులు మేధావి వర్గానికి చెందిన వారు, సామాజిక స్పృహ గలవారు. భవిష్యత్తరానికి రూపకల్పన చేసేవారు. నేను ఏదో ఒక రాజకీయ పార్టీ దృక్పధాన్ని గురించి చెప్పడం లేదు. మేధావులుగా ప్రస్తుత సామాజిక పరిస్థితుల్ని నిష్పాక్షికంగా ఆలోచించవలసిందిగా మాత్రమే విజ్ఞప్తి చేస్తున్నాను.

## అందలమెక్కించబడిన అవినీతి

దేశరక్షణకు సంబంధించిన ఆయుధాల కొనుగోలులో జరిగిన అవినీతి బోఫోర్స్ కుంభకోణం అందరికీ తెలియకుండా వాస్తవాల్ని నొక్కివేశాయి పాలక వర్గాలు. అధికారంలో వున్న ప్రముఖుల ప్రమేయంతో హర్షద్ మెహతా దాదాపు 500 కోట్లు బ్యాంకు సెక్యూరిటీల ద్వారా కాజేసినట్లు జానకిరామన్ కమిటి నివేదిక ద్వారానూ, జాయింట్ పార్లమెంటరీ కమిటి నివేదిక ద్వారానూ వెల్లడయింది. ఇలాంటి అచ్చుబోసిన ఆంబోతులు (big bulls) హర్షద్ మెహతాలు వెలుగులోకి రాకుండా యింకెందరువున్నారో? ఇటీవల మరొక కుంభకోణం వెలుగులోకి వచ్చింది. ప్రభుత్వ రంగంలోని కంపెనీల షేర్ల అమ్మకాలు మార్కెట్ ధర కంటే అతి తక్కువ ధరలకు అమ్మివేయడం. ఉదాహరణకు హిందూస్తాన్ పెట్రోలియమ్స్ షేర్ మార్కెట్ ధర రు.875లు వుండగా రు.165లకు అమ్మివేశారు. అలాగే భెల్ షేర్ విలువ రు.165లు వుండగా రు.37లకే అమ్మివేశారు. ఇలాంటి అవకతవకల వలన 1992లో 3200 కోట్ల రూపాయలు నష్టం వాటిల్లింది. షేర్ల అమ్మకాల ద్వారా 12వేల కోట్ల రూపాయలు చేతులు మారాయి. జస్టిస్ రామస్వామిపై చేయబడిన అవినీతి ఆరోపణలు రుజువయ్యాయి. జస్టిస్ రామస్వామిపై అభిశంసన తీర్మానం పార్లమెంటులో ప్రవేశపెట్టబడింది. అవినీతి ఆరోపణలు రుజువయినప్పటికీ అభిశంసన తీర్మానం ఓటింగ్‌కి పాలక పార్టీ దూరంగా వుండిపోయింది. పాలక పార్టీ నిస్సిగ్గుగా, బాహాటంగా

అవినీతిని అందలం ఎక్కించడానికి సిద్ధపడింది.

## నూతన ఆర్థిక, పారిశ్రామిక విధానాలు

నూతన ఆర్థిక విధానం పేరుతో ప్రభుత్వం రూపాయి విలువను తగ్గించింది. విదేశీ పెట్టుబడికి తలుపులు బార్లా తెరిచింది. దేశ పరిశ్రమలలో బహుళజాతి కంపెనీలకు 50 శాతంపైగా వాటాలు కలిగి వుండడాన్ని అనుమతించింది. లాభాలకు గ్యారంటీ యిచ్చింది. లాభాలను తరలించడానికి అవకాశం కల్పించబడింది. విదేశాల నుండి దిగుమతులపై పన్నులను బాగా తగ్గించింది. దేశీయ పరిశ్రమలకు గల రక్షణను ఎత్తివేసింది. చిన్న పరిశ్రమల వారికి యిస్తున్న రాయితీలను రద్దు చేసింది. చిన్న పరిశ్రమల వారికి రిజర్వ్ చేయబడిన రంగాల్లోకి బడా కంపెనీలకు ప్రవేశం కల్పించింది. ప్రభుత్వ రంగ సంస్థలలో పెట్టుబడులను ఉపసంహరించుకొంటున్నది. బడ్జెట్‌లో కేటాయింపుల్ని తగ్గిస్తున్నది. నష్టాలతో నడుస్తున్నాయని, సామర్థ్యం తక్కువగా వున్నదని నెపాలు మోపి వాటిపై 'సిక్ ఇండస్ట్రీస్' అనే ముద్రవేసి ప్రైవేటు యాజమాన్యాలకు అప్పజెప్పుతున్నది. బడ్జెట్‌లోటు తగ్గించే పేరుతో పేదలకిస్తున్న సౌకర్యాలు, సబ్సిడీలు ఎత్తివేస్తున్నది. ధనవంతులకు పన్నులలో రాయితీలు కల్పిస్తున్నది. ఆధునీకరణ పేరుతో పెద్ద ఎత్తున కార్మికులను పనిలలో నుండి తొలగిస్తున్నది.

ఎరువులపై సబ్సిడీలు తగ్గించినందువల్ల వ్యవసాయ ఉత్పత్తులు పడిపోతున్నాయి. దిగుమతులను అనుమతించడం ద్వారా వ్యవసాయ ఉత్పత్తుల ధరలు పడిపోతున్నాయి. ఉత్పత్తులకు గిట్టుబాటు ధరలకు గ్యారంటీ లేకపోవడంతో రైతులు దివాళా తీస్తున్నారు. వ్యవసాయ కూలీలుగా మారిపోతున్నారు. చిన్న వ్యాపారుల రంగంలో బడా వ్యాపారులు ప్రవేశించడంతో పోటీలో తట్టుకొనలేక చిన్న వ్యాపారులు దివాళా తీస్తున్నారు. రూపాయి విలువ పడిపోవడంతో ఉద్యోగుల, ఉపాధ్యాయుల కార్మికుల నిజవేతనాలు పడిపోతున్నాయి. ఎగ్జిట్, గోల్డెన్ హేండ్‌షేక్ లాంటి పేర్లతో ఉద్యోగాల నుండి ఊడబెరికి వీధుల్లోకి గెంటివేస్తున్నారు. కొత్తగా ఉపాధి సౌకర్యాలకు అవకాశమే లేని పరిస్థితులు సృష్టించబడ్డాయి. అతికొద్దిమందిగా గల పెద్ద పారిశ్రామిక వేత్తలు మినహాయించి సమాజంలోని ఏ సెక్షన్ ప్రజానీకానికి భద్రత లేని పరిస్థితులలో ప్రజలు జీవనం సాగిస్తున్నారు.

## సామాజిక న్యాయం

ప్రభుత్వ రంగం పటిష్టంగా వుంటే హరిజన, గిరిజన, వెనుకబడిన తరగతుల వారికి ఉపాధి సౌకర్యాలుంటాయి. వాటిని పోరాడైనా సాధించుకోవచ్చు. కాని ప్రైవేటు రంగంలో ఆ అవకాశాలు వుండవు. కాని ఈనాడు జరుగుతున్న దేమిటి? ప్రభుత్వ రంగ సంస్థలపై 'సిక్ ఇండస్ట్రీస్' అనే ముద్ర వేసి ప్రైవేటు యాజమాన్యాలకు అప్పజెప్పడం, పబ్లిక్ రంగ సంస్థలలోని షేర్లను మార్కెట్ ధరలకంటే తక్కువ ధరలకు అమ్మివేసి వాటిని దివాళా తీయించడం జరుగుతున్నది. ఈ పరిస్థితులు యిలాగే కొనసాగితే సామాజిక న్యాయం సాధించడం సాధ్యపడదు.

## మత సామరస్యం

ప్రాచీన మానవుడు ప్రకృతిని, పరిసరాలను అర్థం చేసికొనలేని స్థితిలో మార్పులు ఏవి ఎందుకు జరుగుతున్నాయో శాస్త్రీయంగా అర్థం చేసికొనలేని రోజులలో, తన మనుగడ సాగించేందుకు కొన్ని విశ్వాసాలను ఏర్పరచుకొన్నాడు. ఇలాంటి విశ్వాసాలనుండే మతాలు పుట్టాయి. శాస్త్ర విజ్ఞానం వికసించినకొద్దీ మతపరమైన విశ్వాసాలు అశాస్త్రీయమైనవని అవాస్తవమైనవని రుజువైనవి చాలా ఉన్నాయి. అయినప్పటికీ మతాలను పాలకవర్గాలు తమకనుకూలంగా మార్చుకొని వారిపాలన కొనసాగింపుకి అవసరమైన సాధనాలుగా వినియోగించుకొంటూ ప్రజలలో మతపరమైన విశ్వాసాలను పెంచి పోషించుకొంటూ వచ్చారు. మతపరమైన విశ్వాసాలు మనిషియొక్క ప్రాథమిక అవసరాలను తీర్చలేవు. కాని ఈ విశ్వాసాలు వారసత్వంగా సంక్రమించినవి. మనిషి మనస్సులో లోతుగా నాటుకొన్నవి. కనుక వాటిని కదిలించినప్పుడు వచ్చే ప్రతిస్పందన చాలా తీవ్రంగా వుంటుంది.

పాలకవర్గాలు అవలంబిస్తున్న అవకతవక విధానాలకారణంగా దేశంలోని కొన్ని ప్రాంతాలు కొంతమేరకు అభివృద్ధి చెందాయి. మరికొన్ని ప్రాంతాలు పూర్తిగా విస్మరించబడ్డాయి. అంతేగాక అందరికీ విద్యావకాశాలు లేకపోవడం, చదువుకొన్న వారికి ఉద్యోగ అవకాశాలు లేకపోవడం, సంపన్నవర్గాల అణచివేతకు గురికావడంలాంటి పలుకారణాలు ప్రజలలో నిరాశానిస్పృహలను పెంచుతున్నాయి. ఈ పరిస్థితులను అవకాశంగా తీసికొని తమ సంకుచిత ప్రయోజనాలు తప్ప సామాజిక ప్రయోజనాలను పట్టించుకొనని శక్తులు ప్రజలలో కుల, మత, భాష, ప్రాంతీయ విభేదాలను రెచ్చగొట్టారు, రెచ్చగొడుతున్నారు. ప్రజలలో నెలకొని వున్న నిరాశానిస్పృహలు విచ్ఛిన్నకారులు వేసే బీజాలు నాటుకొని పెరిగి విషఫలాల నిచ్చేందుకు అనువైన క్షేత్రాలుగా పనిచేస్తున్నాయి.

భారతదేశం పలుభాషలు, పలు సంస్కృతులు, పలుమతాలకు నిలయంగా వున్నది. విభిన్నమతాలకు చెందిన వారిమధ్య యిచ్చిపుచ్చుకునే ధోరణి నెలకొల్పలేకపోతే దేశం సమైక్యభారతంగా మనలేదు. కాబట్టి మేధావులైన ఉపాధ్యాయులు మతసామరస్యానికి కట్టుబడి సామాన్యప్రజానీకాన్ని చైతన్యపరచాలి.

ఉపాధ్యాయులు ఎన్నో ఉద్యమాలలో పాల్గొనేవారు. వృత్తిపరమైన సౌకర్యాలు పెంచుకొనేందుకు చాలా పోరాటాలు సాగించారు. ఎన్నో విజయాలు సాధించారు. ఉపాధ్యాయులయొక్క సంక్షేమం విద్యారంగంయొక్క సంక్షేమం మొత్తం సమాజం యొక్క సంక్షేమంలో అంతర్భాగంగా గుర్తించగలిగిన సామాజిక చైతన్యంగల ఉపాధ్యాయులు ఈనాడు సమాజాన్ని, దేశాన్ని కుదిపివేస్తున్న అవినీతి, అక్రమాలకు అన్ని సెక్షన్ల ప్రజానీకాన్ని క్రుంగదీస్తున్న ఆర్థిక, పారిశ్రామిక విధానాలకు, అడుగంటుతున్న సామాజిక న్యాయానికి, చిచ్చుబెడుతున్న మతతత్వానికి వ్యతిరేకంగా స్పందించి, 'జనంలో మనం'గా భావించి దేశ సమైక్యత సమగ్రతను కాపాడేందుకు చేస్తున్న సెప్టెంబరు 9 భారత్ బంద్‌లో పాల్గొని తమ వంతు కర్తవ్యాన్ని నిర్వహించాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

సాంకేతిక పరిజ్ఞానంతో నిమిత్తంలేకుండా, స్వల్ప పెట్టుబడితో కేవలం నిర్వహణా సామర్థ్యంతో అనతి కాలంలో అత్యధిక లాభాలు సంపాదించే వ్యాపార రంగంగా నేడు విద్యారంగం మారింది. అత్యంత ఆకర్షణీయమైన ప్రకటనలతో, అన్ని రకాల అవినీతి పద్ధతులతో కొన్ని ప్రైవేటు విద్యాసంస్థల యాజమాన్యాలు ప్రజల మూలుగులను పీల్చివేయడమే కాక విద్యారంగాన్ని కలుషితం చేస్తున్నాయి. వీరికి ఈ అవకాశం రావటానికి ప్రభుత్వ అధీనంలో విద్యారంగ వైఫల్యము, మధ్య తరగతి మనస్తత్వము ప్రధాన కారణం.

## విద్య సామాజిక పెట్టుబడి

విద్యను సామాజిక పురోగతికి పెట్టుబడిగా పరిగణించాలి. ఈ రోజు అభివృద్ధి చెందిన దేశాలన్నీ గత 5 దశాబ్దాలలో విద్యా రంగంపై జాతీయాదాయంలో 10% మించి ఖర్చు చేశాయి. ఈ ఖర్చు ప్రతి సంవత్సరం పెంచుకుంటూ పోతున్నాయి. జనం విద్యావంతులైతే అన్ని రంగాలలో అభివృద్ధి సాధించబడుతుంది. జనాభా నియంత్రణ, ఆరోగ్యం, వ్యవసాయం, పరిశ్రమలు, ప్రజాస్వామ్య పరిణితి వంటి అన్ని రంగాలలో దీని ప్రభావం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. దురదృష్టవశాత్తు మనదేశంలో స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుండి విద్యను సంక్షేమశాఖగా భావించటమే జరిగింది. ప్రభుత్వ బడ్జెట్‌ను అన్ని రంగాలకు పోగా మిగిలితేనే దానికి కేటాయిస్తూ వచ్చారు. పొదుపు చేయాల్సిన ప్రతి సందర్భంలో ముందుగా ఈ పద్దులోనే చేశారు. ఈ కనీస కేటాయింపులు కూడా ఖర్చుకాక మురిగిపోయిన సందర్భాలు అనేకం ఉన్నాయి.

## బడ్జెట్ కేటాయింపులు

ఆర్థిక వనరులన్నీ మనదేశంలో కేంద్రం చేతుల్లో ఉంచుకొని పరిమితమైన గ్రాంట్లు మాత్రమే రాష్ట్రాలకు యిస్తూ విద్యా భారాన్ని రాష్ట్రాలనే భరించమన్నారు. 1975లో విద్యను ఉమ్మడి జాబితాలో చేర్చినా బడ్జెటు కేటాయింపులో పెద్ద తేడా రాలేదు.

ఈ క్రింది పట్టిక చూస్తే ఎవరు ఎంత భారం మోస్తుంది తెలుస్తుంది.

### విద్యకు కేటాయింపుల్లో

| ప్రణాళిక సంఖ్య | కేంద్రం వాటా (శాతం) ప్లాను | నాన్‌ప్లాన్ | రాష్ట్రాల వాటా (శాతం) ప్లాను | నాన్‌ప్లాన్ |
|---|---|---|---|---|
| 1 | 25 | -- | 75 | -- |
| 2 | 25 | 14 | 75 | 86 |
| 3 | 26 | 16 | 74 | 84 |
| 4 | 33 | 4 | 67 | 96 |
| 5 | 30 | 6 | 70 | 94 |
| 6 | 30 | 6 | 70 | 94 |
| 7 | 37 | 6 | 63 | 94 |

### వర్ధమాన దేశాలు విద్య మీద పెట్టే ఖర్చును పరిశీలిస్తే మన శ్రద్ధ అవగతమవుతుంది

| దేశం | మొత్తం ఖర్చులో శాతం |
|---|---|
| ఇథియోపియా | 14.4 |
| మలావి | 15.8 |
| నేపాల్ | 7.2 |
| కెన్యా | 1.9 |
| ఘనా | 20.1 |
| శ్రీలంక | 13.0 |
| ఇండోనేషియా | 7.4 |
| బర్మా | 15.0 |
| ఇండియా | 2.3 |

### వివిధ భాగాలకు కేటాయింపులు (శాతం)

| ప్రణాళిక | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|---|
| ప్రాథమిక | 56 | 35 | 34 | 30 | 35 | 36 |
| సెకండరీ | 13 | 19 | 18 | 16 | 17 | 16 |
| యూనివర్శిటీ | 9 | 18 | 15 | 25 | 22 | 19 |
| ఇతరములు | 9 | 10 | 12 | 14 | 14 | 18 |
| సాంకేతిక | 13 | 18 | 21 | 13 | 12 | 11 |
| మొత్తం | 100 | 100 | 100 | 100 | 100 | 100 |

పై పట్టికలు పరిశీలిస్తే ప్రాథమిక విద్య ఎంతగా నిర్లక్ష్యం చేయబడుతున్నదో విదితమవుతుంది. 6-14 సం॥ వయస్సు గల వారందరికి 1960 నాటికి నిర్బంధ అక్షరాస్యత అమలు జరపాలని రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలలో పేర్కొన్నారు. కాని ఆ గడువు దాటి 33 సం॥ గడిచినా ఆ లక్ష్యం సగం కూడా నెరవేరలేదు.

## విద్యారంగ పరిస్థితి

1986లో కేంద్ర ప్రభుత్వం ప్రచురించిన 'విద్య-సవాళ్ళు' అనే పత్రంలో పేర్కొన్నట్లు అనేక పాఠశాలల్లో ఉపాధ్యాయులు లేరు. కనీసభవన వసతి, ఫర్నీచర్ కూడా లేదు. ఆంధ్రప్రదేశ్‌లో 1959లో నేటి పంచాయతీ రాజ్ వ్యవస్థ క్రిందికి పాఠశాలలు బదిలీ చేయబడ్డాయి. సర్కారు జిల్లాలో వేలాది ఎయిడెడ్ పాఠశాలలను ప్రభుత్వం స్వాధీనం చేసుకొని పంచాయతీ రాజ్‌కు అప్పగించింది.

పేరుకు స్థానిక సంస్థల పాలనైనా మొత్తం పరిపాలన అంతా ప్రభుత్వమే సాగిస్తోంది. ఉపాధ్యాయుల నియామకం, జీతాల చెల్లింపు, బదిలీలు, ప్రమోషన్లు అన్ని విషయాలను ప్రభుత్వమే నిర్ణయిస్తున్నది. స్వంత వనరుల సేకరణే లేదు.

అందువల్ల బాధ్యత లేని పాలనగా మారి, నేతలు తమ రాజకీయ ప్రయోజనాలకు బదిలీలను ఆయుధంగా చేసి ఉపాధ్యాయుల్ని పావులుగా వాడుకుంటున్నారు. పాఠశాలల అజమాయిషీని నిర్వీర్యం చేశారు. బోధనలో నవీనత లేకుండా చేశారు. ఏండ్ల తరబడి ఖాళీలు నింపకపోవడంతో ఒక పథకం ప్రకారం ప్రభుత్వ రంగ విద్యా సంస్థల పని దిగాజారుడు స్థాయికి చేరింది.

## ఎంట్రెన్స్ పరీక్షల పోటీ

ఉపాధ్యాయుల్ని వృత్తితో సంబంధంలేని పనులకు ఉపయోగించడం ఎక్కువై పోయింది. దానితో పనిదినాలు తగ్గిపోయాయి. పబ్లిక్ పరీక్షలలో మూకుమ్మడి కాపీలు, పేపర్ లీకేజీలు ఎక్కువ అయినాయి. దీనితో పబ్లిక్ పరీక్షలకు విలువ లేకుండా పోయింది. అన్ని వృత్తి విద్యా కోర్సులకు ప్రవేశ పరీక్షలు నిర్వహించే నూతన విధానం గత 10 సం॥లలో అభివృద్ధి చెందింది. దీనితో ఎంట్రన్స్ పరీక్షల పోటీ పెరిగింది. రెగ్యులర్‌చదువుకు ఉన్న విలువ పడిపోయింది, ప్రైవేటు వ్యాపారానికి రంగం సిద్ధం చేయబడింది.

## ప్రీ-ప్రైమరీ విద్యను వదిలేసిన ప్రభుత్వం

ప్రాథమిక విద్యలో పిల్లవానిని 5 సం. వయస్సు తర్వాత చేర్చుకుంటారు. 3-5 సం. మధ్య పిల్లలను బడికి పంపడం ఈ దశాబ్దంలో పెరిగింది. ప్రీ-ప్రైమరీ పాఠశాలలను ప్రభుత్వం స్థాపించాలి, కాని ఆ ప్రయత్నం ప్రభుత్వం చేయలేదు. అందుచేత ఎల్.కె.జి., యు.కె.జి. కాన్వెంట్లు ఊరూర వెలిశాయి. ప్రైవేట్ ట్యూషన్ల స్థానంలో రెసిడెన్షియల్ పాఠశాలలు వెలిశాయి.

దీనికితోడు ఇంగ్లీషు మోజు వేలంవెర్రిగా మారింది. అమ్మ, నాన్న అంటే ఒప్పుకోము. మమ్మీ, డాడీ అంటే మోజుగా మారింది. ఈ ఇంగ్లీషు ప్రీ ప్రైమరీ కొనసాగింపే విద్యారంగంలో ప్రైవేటు వ్యవస్థకు మూలమయింది.

## విద్యారంగంలో ప్రభుత్వ, ప్రైవేటు వ్యక్తుల పాత్ర

ఏ కాలంలోనైనా పాలకవర్గాలు తమకనుకూలమైన విద్యావిధానాన్ని అనుసరిస్తాయి. భారతదేశంలో ప్రాచీనకాలంలో నేటి పాఠశాలల పద్ధతిగాక, గ్రామస్తులు, లేక రాజుల పోషణలో జీవిస్తూ శిష్యులకు బోధించే గురుకుల వ్యవస్థ ఉండేది.

బ్రిటిష్‌వాళ్ళు వచ్చిన తర్వాత వారి దేశ అనుభవాన్నిబట్టి, పాఠశాలలు, సిలబసు, జీతాలతో ఉపాధ్యాయులను నియమించే నేటి పద్ధతి ప్రారంభించబడింది. దాదాపు ప్రపంచమంతటా ఇదే తరహా విద్యావిధానం అమలు జరుగుతున్నది. విద్యారంగంలో నేడు ప్రభుత్వ బాధ్యత ఎంత? సమాజ బాధ్యత ఎంత? వ్యక్తుల బాధ్యత ఎంత? అనేది మనం పరిశీలించాలి.

## ప్రభుత్వ పాత్ర

14 సం.ల వయస్సులోపు వారందరికి నిర్బంధ ప్రాథమిక విద్య ప్రభుత్వ బాధ్యత అనేది రాజ్యాంగంలోనే చెప్పబడింది. అంతమాత్రాన ఆ వయస్సు తర్వాత విద్య గరిపే బాధ్యత నుండి ప్రభుత్వం తప్పించుకోజాలదు. మొత్తం దేశం యొక్క పురోగమనం విద్యమీద ఆధారపడినప్పుడు అన్నిస్థాయిలలోని విద్య బాధ్యత ప్రభుత్వమే వహించాలి. అయితే ఉన్నత స్థాయిలో కొంతమేరకు ప్రైవేటు సంస్థలు, వ్యక్తులు కూడా కొంతపాత్ర వహించవచ్చు.

## ప్రైవేటు విద్యాసంస్థలు

మన దేశంలో నేడు అనేక పాఠశాలలు ప్రైవేటు వ్యక్తుల, సంస్థల చేతుల్లో ఉన్నాయి. వాటిలో కొన్ని ప్రభుత్వ గుర్తింపు పొందినవి, కొన్ని ప్రభుత్వ గుర్తింపు లేనివి. ప్రభుత్వ పాఠశాలలైనా, ప్రైవేటు పాఠశాలలైనా ప్రభుత్వ మూసపోతలో పనిచేసేవి తప్ప అదనంగా నూతన విధానాలు అనుసరించేవికావు. ఇవి ప్రభుత్వ సిలబస్‌నే పాటిస్తూ, ప్రభుత్వ పుస్తకాలనే ఉపయోగిస్తూ, ప్రభుత్వ పరీక్షలకే విద్యార్థులను తయారుచేస్తున్నవి. ప్రభుత్వ శిక్షణపొందిన ఉపాధ్యాయులనే ఉపయోగిస్తున్నారు. ఎయిడెడ్ పాఠశాలలైతే ఉపాధ్యాయుల జీతాలు, పాఠశాల నిర్వహణ ఖర్చుకూడా ప్రభుత్వమే భరిస్తున్నది. ప్రైవేటు వ్యక్తులు, లేక సంస్థలు కేవలం యాజమాన్యం చేస్తూ ఫీజుల పేరుతో దోపిడీచేస్తూ ప్రైవేటు సంస్థలుగా పిలువబడుతున్నాయి తప్ప సమాజానికి ఉపయోగపడే ప్రత్యేక క్రియాశీలకపాత్రను అవి నిర్వహించడంలేదు.

## విద్యావిధానం – కమీషన్లు

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత విద్యావిధానాన్ని పరిశీలించి సిఫారసులు చేయడానికిడాః సర్వేపల్లి రాధాకృష్ణ కమీషన్ (1948), డా॥ లక్ష్మణ స్వామి మొదలియార్ కమీషన్ (1952), డా॥ కొఠారి కమీషన్ (1964-66), గజేంద్ర గడ్కర్ కమీషన్ (1969) నియమించబడ్డాయి.

ప్రతి కమిటీ చేసిన సిఫారసులలో ప్రభుత్వానికి అప్పటి అవసరాలకు ఉపయోగపడే సిఫారసులను మాత్రమే అమలు జరిపారు. అంతేగాని మొత్తం సమాజానికి విద్య అందించే లక్ష్యంగా ఏ సిఫారసులను అమలు జరపలేదు.

## అనియత (నాన్‌ఫార్మల్) విద్య

అందరికి సాధారణ విద్య అందించే బదులు 1977లో కొందరికి నాన్‌ఫార్మల్ విద్యావిధానం అమలులోనికి వచ్చింది. ఆర్థిక, సామాజిక కారణాలతో మధ్యలో పాఠశాలను విడిచిపెట్టడాన్ని, అసలే పాఠశాలలో చేరకపోవడాన్ని, నిరోధించడానికి ప్రయత్నించక వారు పాఠశాల విడిచివెళ్ళిన తరువాత చదువు చెపుతామనే మోసపూరిత విద్యావిధానమే అనియత (నాన్‌ఫార్మల్) విద్యావిధానం, అంటే దాదాపుగా పేదవారందరికి నాన్‌ఫార్మల్ విద్యే గతి చేశారు.

దీని కొనసాగింపే ఓపెన్ యూనివర్శిటీ, ఓపెన్ పాఠశాల విద్య, అసలు చదువు నేర్చుకోవలసిన వయస్సులో అవకాశాలు కల్పించక ఆపైన ఏ వయస్సులోనైనా నేర్చుకోవచ్చు. అని మభ్యపెట్టే మోసపూరిత విధానమే సార్వత్రిక పాఠశాల (ఓపెన్‌స్కూల్) విద్యా విధానం. ఈ విధంగా పాఠశాల విద్యాబాధ్యతనుండి ఒక పథకం ప్రకారం ప్రభుత్వం తప్పుకోవడం ప్రారంభించింది. అందుకే ప్రభుత్వ పాఠశాలల్లో ఉపాధ్యాయ పోస్టులు భర్తీచేయడంలేదు. భౌతిక వసతులు కల్పించడంలేదు. సమర్థవంతమైన అజమాయిషీ లేకుండా చేసింది.

## నూతన విద్యా విధానం (1986)

ఇలావుండగా 1986లో కేంద్ర ప్రభుత్వం నూతన విద్యా విధానాన్ని ప్రవేశపెట్టింది. దీనిలో ప్రధానాంశాలు 'ఆపరేషన్ బ్లాక్ బోర్డ్', 'నవోదయ విద్యాలయాల స్థాపన'. 'ఉద్యోగాలకు, డిగ్రీలకు లంకె తెగ గొట్టడం'. ఆపరేషన్ బ్లాక్‌బోర్డు పథకం ప్రకారం ప్రాథమిక పాఠశాలలలో కొంతమేరకు భౌతిక వసతి కల్పించే ఏర్పాట్లు చేశారు. దీనికి సరిపడ నిధులు సమకూర్చనందున గత 10 సం.లలో ఆ పథకం నత్తనడక నడుస్తూ ఆశించిన లక్ష్యంసాధించలేకపోయిందని ప్రభుత్వమే ప్రకటించింది.

## నవోదయ విద్యాలయాలు

నవోదయ పాఠశాలల పేరుతో ఎంపిక చేసిన కొద్దిమంది ప్రతిభావంతులను నూతన పారిశ్రామిక అవసరాలకు సరిపడే సాంకేతిక

నిపుణులుగా తయారు చేసే పథకమే నవోదయ విద్యాలయాల స్థాపన. దానికి ప్రభుత్వం తన నిధులంతా ఖర్చుచేస్తున్నది. కాని యిచ్చట తయారయ్యే విద్యార్థులను ఉపయోగించుకొని లాభపడేది ప్రైవేటు పెట్టుబడి దారులేనని గుర్తించాలి. సామాన్య ప్రజల బిడ్డలకు విద్యగరపడానికి ఉపయోగించాల్సిన నిధుల్ని ఇలా కొద్దిమంది ప్రతిభావంతులన్న పేరుతో ధనికుల ప్రయోజనాలకు మళ్ళించడం జరుగుతున్నది.

## డిగ్రీలకు, ఉద్యోగాలకు లంకె తెగగొట్టడం

డిగ్రీలకు, ఉద్యోగాలకు లంకె తెగగొట్టాలని మరొక ప్రయత్నం జరుగుతున్నది. ఈ డిగ్రీల వల్లనే కొంతమేరకైనా చదువుకు, ఉద్యోగాలకు గుర్తింపు ఉంది. ఆ లంకె గూడాపోతే పక్షపాతం, బంధుప్రీతి, దోపిడీ రాజ్యమేలుతాయి. బంధుత్వం సిఫారసులు, వగైరా లేని వాళ్ళకు ఉద్యోగాలే కరువవుతాయి.

నూతన విద్యావిధానంతో దాదాపు ఉన్నత విద్యను ప్రైవేటు పరం చెయ్యాలని ప్రభుత్వం ప్రయత్నాలు ప్రారంభించింది. ప్రీ-ప్రైమరీ విద్యను ప్రభుత్వమే నడపాలని కొఠారీ కమీషన్ నిర్ద్వంద్వంగా సిఫారసు చేసినా, ఆ విషయంలో ప్రభుత్వం మౌనం వహిస్తోంది. ఇల్లా విద్యాచక్రంలో ఆది, అంతిమ అంగాలను ప్రైవేటురంగానికి అప్పగించెయ్యడానికి ప్రభుత్వం ఉద్దేశపూర్వకంగానే పనిచేస్తుందనేది స్పష్టం.

## ప్రైవేటు రంగ పాత్ర పెరిగితే, విద్య పేదవారికి గగన కుసుమమే! అవుతుంది

ప్రభుత్వ అజమాయిషీలో ఉండాల్సిన విద్య ప్రైవేటు వ్యక్తుల అధీనంలోకి వెళ్ళిపోతే వారు నిర్వహణ పేరుతో అధిక ఫీజులు గుంజటం జరుగుతుంది. డబ్బు పెట్టగలవారికే విద్య లభిస్తుంది. సామాన్య మానవులందరికి అందుబాటులో ఉండాల్సిన విద్య ఖరీదై పోతుంది. పేదవారికి విద్య గగన కుసుమమే అవుతుంది. మధ్య తరగతి మూల్గులను పీల్చివేస్తుంది. ఉన్నవారికి విద్య ఊడిగం చేస్తుంది.

## మాతృభాషలో విద్యా బోధనకు విఘాతం

మాతృభాషలో విద్యా బోధన జరగాలని ప్రపంచమంతా ఘోషిస్తోంది. అమెరికాతో సమానంగా శాస్త్ర విజ్ఞానంలో అభివృద్ధి చెందిన రష్యా, జపాన్,జర్మనీ మొదలైన దేశాలలో మాతృభాషలోనే విద్యా బోధన జరుగుతున్నది. మన స్వాతంత్ర్య పోరాటంలో అది ఒక్క నినాదం. స్వాతంత్ర్యానంతరం అనేక పోరాటాలు చేసి డిగ్రీ స్థాయి వరకు మాతృభాషలో బోధన సాధించుకున్నాము. పరిపాలన మాతృభాషలోనే జరుగుతోంది. ఈ ప్రైవేటు పాఠశాలలు తమ స్వార్థం కోసం ఇంగ్లీషు భాషపై మోజు రెచ్చగొట్టి మాతృభాష మాధుర్యాన్ని పొందకుండా చేసి పర భాషకు బానిసలుగా మన బాలలను మార్చుతున్నాయి. దీనితో మన సంస్కృతి, సాంప్రదాయ వారసత్వం నశిస్తున్నది.

## పోటీ పరీక్షలపై కేంద్రీకరణ

విద్యార్థులలో గల అన్ని రకాల శక్తుల్ని వెలికి తీసి సంపూర్ణ మానవులుగా తీర్చిదిద్దాల్సిన విద్యాలయాలు పోటీ పరీక్షల కారణంగా ట్యుటోరియల్ కోచింగ్ సంస్థలుగా మారిపోతున్నాయి. 24 గంటలూ పోటీ చదువులలోకి నెట్టబడి విద్యార్థులు పరీక్షలపైననే కేంద్రీకరింపజేస్తున్నారు. దీని ద్వారా వారి సహజ శక్తులన్నీ నశించిపోవడం జరుగుతోంది. సమాజానికి పనికిరాని స్వార్థపర జీవులుగా వారు తయారవుతున్నారు.

## సెక్యులరిజానికి వ్యతిరేక బోధన

కొన్ని ప్రైవేటు విద్యా సంస్థలలో లౌకిక తత్వానికి వ్యతిరేక బోధన జరుగుతోంది. అవి జాతీయత, దేశభక్తి పేరిట మత దురహంకారాన్ని, క్రమ శిక్షణ పేరిట ఫాసిజాన్ని విద్యార్థులకు నూరిపోస్తున్నాయి. ప్రభుత్వ యాజమాన్యం, ఆధిపత్యం, పర్యవేక్షణ గనుక ఉంటే విద్యాలయాల్లో యిలాంటి విషపాయమైన ధోరణులకు తావుండదు.

## కొన్ని ప్రతిష్టాత్మకమైన ప్రైవేటువిద్యా సంస్థలు

అయితే నేడు కొన్ని ప్రతిష్టాత్మకమైన ప్రైవేటు విద్యా సంస్థలున్నాయి. ప్రభుత్వ పాఠశాలల కంటే నిర్వహణా సామర్థ్యం, వసతులు సమృద్ధిగా ఉండి మంచి ఫలితాలు సాధిస్తున్నాయి. అట్టి అతి కొద్ది విద్యా సంస్థలను మనం అభినందించవచ్చు. ప్రోత్సహించవచ్చు. స్వచ్ఛందంగా తమ విరామ కాలంలో పాఠశాలలో పనిచేయడానికి ఔత్సాహికులను కూడా మనం ప్రోత్సహించవచ్చు. కాని విద్యను వ్యాపారంగా మార్చి అన్నిరకాలుగా దోపిడీచేసే ప్రైవేటు విద్యా వ్యాపారాన్ని మనము తప్పనిసరిగా వ్యతిరేకించాలి.

## విద్యా వ్యాపారాన్ని ఎదుర్కోవాలి

ఇన్ని అనర్థాలకు మూలమైన ప్రైవేటు రంగాన్ని పెరగనివ్వాలా? దాన్ని నిరోధించటానికి మనం ఏం చెయ్యాలి?

దురదృష్టవశాత్తు కొందరు ఉపాధ్యాయులు ప్రభుత్వ పాఠశాలల్లో, కళాశాలల్లో పనిచేస్తూ అధికజీతాలను, అన్ని సౌకర్యాలను, ఉద్యోగ భద్రతను అనుభవిస్తూ, రెండోవైపున "విద్యా ఫ్యాక్టరీలలో" కార్మికులుగాను, యజమానులుగాను పనిచేస్తున్నారు. అలాంటి దారితప్పిన మిత్రుల్ని నిరుత్సాహపర్చాలి. వారికి తమ కర్తవ్యాన్ని గుర్తుచేయాలి. బరితెగిస్తే సాంఘికంగా వెలివేయాలి. అవసరమైతే వారిపై కఠిన చర్యలకు ఉద్యమించాలి. అంతేగాని మనవారే కదా అని ఉపేక్షించి, మన చెట్టు కొమ్మలనే నరికే వారిని కనికరించరాదు. మన వేలితో మనకంటినే పొడుచుకోరాదు.

## విద్యారంగ వైఫల్యాలకు ఉపాధ్యాయులే కారణమా?

విద్యారంగ వైఫల్యాలకు ఉపాధ్యాయులే కారణమనే ప్రచారం జరుగుతోంది. ఖాళీ అయిన ఉపాధ్యాయ పోస్టులను నింపక, సెక్షన్‌కు 60, 70కి మించి కూడా విద్యార్థుల్ని ఉంచి కొత్త పోస్టులను మంజూరు చేయక, ఉపాధ్యాయులకు నానారకాల విద్యేతర విధులను అప్పగిస్తూ, విద్యాబోధనకు అవసరమైన ఉపకరణాలను సరఫరా చేయక, తత్ఫలితంగా విద్యాప్రమాణాలు పడిపోతే దీనికి ప్రభుత్వ పాఠశాలల్లోని ఉపాధ్యాయుల బాధ్యతారాహిత్యమే కారణమని నిందించటం జరుగుతోంది. దీన్నిసాకుగా చూపి విద్య ప్రైవేటీకరణను ప్రోత్సహించి తన బాధ్యతలనుంచి ప్రభుత్వం తప్పుకోజూస్తున్నది.

## మన కర్తవ్యం

ఈ సదస్సులో అన్ని దృక్పథాలనుంచి ఈ అంశాన్ని చర్చిస్తారని ఆశిస్తున్నాం. ప్రభుత్వం తిరిగి పట్టాలకెక్కి తన బాధ్యతలు నిర్వర్తించేలా ప్రజా ఉద్యమం నిర్మించాలి. అంకితభావంతో వృత్తి ధర్మాన్ని నిర్వర్తించే "వేతనాల ఉపాధ్యాయుల" స్థానంలో "సామాజిక దృక్పథం గల గురుకుల వర్గం"గా మనం పరివర్తన చెందాలి. శాస్త్రీయ దృక్పథంతో ఆలోచించి 21వ శతాబ్దానికి తగిన రీతిని తమ బిడ్డల భవిష్యత్తును ఆలోచించే వారుగా తల్లిదండ్రులను తయారుచేయాలి. ఈ సుదూర ప్రయాణంలో అన్ని కష్టాలు అధిగమించి పయనిద్దాం.

# నిబంధనావళి సవరణ

ఉపోద్ఘాతం:- మన సంఘం 1974 ఆగస్టు 10వ తేదీ అవతరించింది. అక్టోబరు 20-21 తేదీలలో రాజమండ్రిలో జరిగిన మొదటి మహాసభలో మన నిబంధనావళి, పాలసీ స్టేట్‌మెంట్ ఆమోదించుకున్నాము. ఈ మధ్య కాలంలో ఆయా అవసరములను బట్టి నిబంధనావళికి కొన్ని సవరణలు చేస్తూ 9 సార్లు నిబంధనావళి పునర్ముద్రించుకున్నాము. 9వ ముద్రణ 1992లో జరిగింది.

2. దశాబ్దాలుగా ఉద్యమంలో అనేక మార్పులు వచ్చాయి. మనకు ప్రభుత్వం గుర్తింపు వచ్చింది. సివిల్ జాయింట్ స్టాఫ్ కౌన్సిలులో సభ్యత్వం వచ్చింది. మండల వ్యవస్థ వచ్చింది. మరలా పోబోతోంది. పంచాయతీ సర్వీసులు చాల ప్రావిన్షిలైజ్ అయినాయి. శాసనమండలి రద్దయింది. మన సభ్యత్వం పెరిగింది. ఆస్తులు పెరిగాయి. ఉపాధ్యాయుల సంఖ్య పెరిగింది. అనేకరకాల విద్యాలయాలు పెరిగాయి. వీటన్నింటిని దృష్టిలో పెట్టుకొని మన నిర్మాణాన్ని మరింత పటిష్ఠ పరచు కోవలసియున్నది. దాని కనుగుణంగా మన నిబంధనావళిలో కొన్ని మౌలికమైన మార్పులు మహాసభ చేసింది వాటిని మీ ముందుంచు చున్నాము.

**(2) 1992లో జరిగిన 9వ ముద్రణలోని పేజీల ఆధారంగా ఈ సవరణలు ప్రతిపాదించబడినవి.**

----

1. 5వ పేజీ ఉపోద్ఘాతంలో కొనసాగింపుగా "జి.ఒ.ఎం.ఎస్.నెం.716 డి.ఎ.డి. తేది: 6-12-92 ద్వారా ఎ.పి.సివిల్ సర్వీస్ జాయింట్ స్టాఫ్ కౌన్సిల్ సభ్యత్వం లభించింది." అని నేర్చుకోవాలి.

2. 6వ పేజి: 10వఅంశం చివర "గోష్ఠులు; చర్చావేదికలు నిర్వహించుట" చేర్చాలి

3. 6వ పేజీ: ఆశయాలలో 14 అంశంగా "మహిళా ఉపాధ్యాయుల ప్రత్యేక సమస్యలు పరిష్కరించుటకు కృషి చేయుట" అని చేర్చాలి.

4. నిబంధనావళి అను అంశంలో (4) చిహ్నము: "వృత్తములో, ఉదయించు సూర్యుడు, యు.టి.ఎఫ్. పతాకము" అని వుండాలి.

5. 7వ పేజీలో ఆశయసాధనకు మార్గములు 11వ అంశంలో మాసపత్రికగా తర్వాత "రాష్ట్ర సంఘాలు, జిల్లాశాఖల పక్షాన నడపుట" అని చేర్చాలి.

5(ఎ) పేజి 6 గృహనిర్మాణ సంఘాలు తర్వాత "యు.టి.ఎఫ్. సంక్షేమనిధి" అని చేర్చవలెను.

6. సంఘ సభ్యత్వము, నియమాలు- (3) అంశంలో ప్రారంభంలో ఆఖరులోగా" వరకు తొలగించి" విద్యా సంవత్సరం (జూన్ -మే) సభ్యత్వ సంవత్సరంగా పరిగణించబడును. ప్రతి సంవత్సరం జూన్ నుండి అక్టోబరు ఆఖరులోగా సభ్యులుగా చేరవలెను. ప్రత్యేక పరిస్థితులలో రాష్ట్ర కౌన్సిలు లేక దానిచే అధికార మీయబడిన కార్యదర్శి వర్గము ఈ గడువు కాలము ఒక నెలరోజులకు మించకుండా పొడిగించవచ్చును.

7. 5అంశము:(7వ పేజి) సంవత్సరమునకు 12 రూపాయలు అనుటకు బదులు రు.15 అని చేర్చవలెను.

8. 8వ పేజి: 6వ అంశమును ఈ విధంగా సవరించవలెను. సభ్యత్వ రుసుము రు.15లో సెంటరు, హైస్కూలు, కాలేజీ శాఖలకు రు.1, మండల లేక పట్టణ శాఖలకు రు.5లు, జిల్లా శాఖకు రు.5లు, రాష్ట్ర సంఘానికి రు.4లు చెందును.

9. 9వ అంశంగా అన్ని శాఖలు ఇతరత్రా వసూలు చేసిన అన్ని రకముల నిధులు జనరల్‌ఫండ్‌గా పరిగణించబడును.

**10. 8వ పేజి 6వ శాఖల నిర్మాణం**

(2)వ అంశం 2వ లైనులో మొదట 2లైనులు పూర్తిచేసి ఈ క్రింది విధంగా సవరించవలెను.

"ప్రభుత్వం ఏర్పరచిన టి.ఎ సెంటరు లేక పే సెంటరులోని ప్రాథమిక, అప్పర్ ప్రైమరీ పాఠశాలలోని సభ్యులు సెంటరు సంఘంగా ఏర్పడుదురు. అట్టి సెంటర్లు లేనిచోట మండలశాఖ సర్వసభ్య సమావేశము ఆయా మండల భౌతిక పరిస్థితులను బట్టి 20 మంది టీచర్లకు తగ్గని ప్రాంతమును సెంటరు ప్రాంతంగా నిర్ణయించును.

11. నిబంధనావళి "సబ్ కమిటి" అని ఉన్న అన్నిచోట్ల "కార్యదర్శివర్గము" అని చదువుకొనవలెను.

12. కార్యవర్గము: 4వ అంశంగా ప్రతి సంవత్సరం నూతన కౌన్సిల్ అనంతరం ఎన్నికైన ప్రథమ కార్యవర్గము "ఐక్య ఉపాధ్యాయ" పత్రికకు 5గురికి మించని సభ్యులను "యు.టి.ఎఫ్" వార్తలకు ముగ్గురికి మించని సంపాదక వర్గ సభ్యులను ఎన్నుకొనును. పై రెండు సంపాదక వర్గములలో అధ్యక్షుడు, ప్రధాన కార్యదర్శి తప్పక సభ్యులై ఉండవలెను. కౌన్సిల్‌లో ఎన్నికైన కార్యదర్శి వర్గ సభ్యుడు "ఐక్య ఉపాధ్యాయ" పత్రిక ప్రధాన సంపాదకునిగా ఎన్నికైనచో సభ్యులలో మరొకరిని కార్యదర్శివర్గ సభ్యునిగా కార్యవర్గం ఎన్నుకొనును.

13. 7(2) కార్యదర్శివర్గము: 1. ఫెడరేషన్‌కు అధ్యక్షుడు, అసోసియేట్ అధ్యక్షుడు, ప్రధాన కార్యదర్శి, కార్యదర్శులు అనువారు కార్యదర్శి వర్గముగా నుందురు. జనరల్ కౌన్సిల్‌లో ఎన్నికైన కార్యదర్శి వర్గము "ఐక్య ఉపాధ్యాయ" పత్రిక ప్రధాన సంపాదకుడు కార్యదర్శి వర్గముగా వ్యవహరింతురు.

14. 10,11 పేజీలలో 8 విధులు: అను చాప్టరులో రు.100లు అని ఉన్నచోట్ల రు.200, రు.500 అని ఉన్నచోట రు.1000లు అని, రు.1000 అని ఉన్నచోట రు.2,000లు, రు.5,000 అని ఉన్న చోట రు.10,000, రు.10,000 అని ఉన్నచోట రు.20,000లు అని సవరించవలెను.

15. "ఉపాధ్యక్షుడు" అను చోట అసోసియేట్ అధ్యక్షుడు అని చేర్చవలెను. ఆ (1) తొలగించి అధ్యక్షుడు తన విధులను నిర్వహించుటకు అవకాశము లేనపుడు కార్యదర్శి వర్గ ఆమోదముతో అసోసియేట్ అధ్యక్షుడు అధ్యక్షుని విధులను నిర్వహించును.

16. ఇ. ప్రధాన కార్యదర్శి: విధులలో 4లో ఈ వాక్యము అదనంగా చేర్చవలెను. ప్రతి కార్యవర్గ సమావేశములో జనరల్ కౌన్సిల్‌లో విడిగా జమా ఖర్చులు ప్రవేశపెట్టి ఆమోదం పొందవలెను.

17. పేజి (11) జిల్లా శాఖల నిర్మాణం అంశం 5 జిల్లా కౌన్సిల్ సభ్యులనుండి జిల్లాశాఖ కార్యవర్గం ఎన్నుకొనబడవలెను. ప్రతి మండల పట్టణశాఖ ప్రధానకార్యదర్శి, ప్రధానకార్యదర్శి కార్యదర్శివర్గ సభ్యునిగా ఎన్నుకొనబడినచో అధ్యక్షుడు ఎన్నికలేకనే కార్యవర్గ సభ్యులగుదురు. రిజర్వుడు సీట్లు సభ్యులు మాత్రమే కౌన్సిలు నుండి ఎన్నుకొనబడుదురు.

18. పేజి 12 అంశం 6 "ప్రాథమిక, సెకండరీ ఉపాధ్యాయులిద్దరికి అనుటకు బదులు ప్రాథమిక, సెకండరీ పాఠశాలల ప్రతినిధులిద్దరికి సభ్యత్వం దామాషానను సరించి ప్రాతినిధ్యముండవలెను.

19. మహాసభలు: (అ) సంపాదక వర్గ సభ్యుల తర్వాత "ఆడిట్ కమిటీ సభ్యులు" జిల్లా కౌన్సిల్ సభ్యులు ప్రతినిధులగుదురు అన్ని మండల సెంటరు శాఖల కార్యదర్శి వర్గ సభ్యులు ఓటింగ్ హక్కులేని సౌహార్ధ ప్రతినిధులగుదురు. అవసరమును బట్టి సౌహార్ధ ప్రతినిధుల నిర్వచనమును "మహాసభ నిర్ణయముల గైకొను కౌన్సిలు సమావేశంలో మార్చుకొనవచ్చును.

20. పేజి 14 ఐక్య ఉపాధ్యాయ పత్రిక సంపాదక వర్గం అంశం (4) దీనికి సంపాదక వర్గం తర్వాత "5 గురికి మించకుండా" అని చేర్చవలెను. -

21. **సభ్యుల శాఖల హక్కులు-క్రమశిక్షణ:** (4) అంశం ఏ శాఖలోనైనా క్రమశిక్షణ చర్య గైకొనుహక్కు ఆయా కౌన్సిల్‌కు మాత్రమే అధికారముండును. క్రిందిశాఖ కౌన్సిలు తీసుకొనిన క్రమశిక్షణపై ఆ నిర్ణయము అందిన 30 రోజుల లోపల పై శాఖ ప్రధానకార్యదర్శికి అప్పీలు చేసుకొనవచ్చును. అట్టి అప్పీలుపై తాత్కాలికముగా స్టే యిచ్చు అధికారము కార్యదర్శి వర్గమునకు ఉండును. అప్పీలుపై తుదినిర్ణయము తీసుకొను అధికారము కార్యవర్గమునకు మాత్రమే ఉండును. 15వ పేజి (7) అంశం, 2వ లైను సదరు అప్పీలు " 30 రోజులు" బదులు "45 రోజులు" అని మార్చవలెను. ఆలోపు అప్పీలుపై తుది నిర్ణయము తెలుపనిచో క్రమశిక్షణాచర్య రద్దయినట్లు పరిగణించవలెను.

22. 15వ పేజి 'ఋ' హోల్‌టైమర్లు తర్వాత "ఆఫీసు సిబ్బందిని" అని చేర్చాలి"

23. 17వ పేజి 'ఇ' పూర్తిగా తొలగించాలి. పై శాఖ ఆడిట్ కమిటీయే తన తర్వాత క్రిది శాఖల ఆడిట్ చేయవలెను. ఆడిట్ చేయుటకు కనీసం 15రోజుల ముందు నోటీస్ ఇవ్వవలెను. ఆడిట్ కమిటి కన్వీనర్ దీనికి బాధ్యత వహించును.

24. **ప్రత్యేక అంశములు-ఈ క్రింది అంశములు చేర్చవలెను.**

(11) అన్ని శాఖలలో కార్యదర్శివర్గ ఆమోదం లేకుండా సంఘ సభ్యులనుండి వారికి నిర్దేశించిన పరిమితికి మించి అడ్వాన్సులు, అప్పులు ఈయరాదు. కార్యదర్శి వర్గ ఆమోదంతో ఇచ్చిన అడ్వాన్సులు నిర్ణీత గడువు లోపల జమ చేయవలెను. గడువు మీరి ఇచ్చిన వాయిదాలపై అపరాధ రుసుము కూడా వసూలు చేయు అధికారం కార్యదర్శివర్గమునకు ఉండును.

(12) అన్ని శాఖల నిధులు విధిగా బాంకులలోగాని, పోస్టాఫీసులలో గాని సంఘం పేర తెరిచిన సేవింగ్స్ బ్యాంక్ ఎక్కౌంటులలో ఉంచవలెను. జిల్లా శాఖ కార్యదర్శివర్గ సభ్యులవద్ద వ్యక్తిగతముగా రు.200లకు మించి, మండల శాఖ కార్యదర్శివర్గ సభ్యులవద్ద రు.100లను మించి వ్యక్తిగతంగా నుండరాదు.

13. యు.టి.ఎఫ్. వార్తలు నడుపు జిల్లా శాఖలు అధ్యక్ష ప్రధాన కార్యదర్శులతో కలిసి 4గురికి మించని సంపాదక వర్గమును ఎన్నుకొనవచ్చును.

14. "యు.టి.ఎఫ్. వార్తలు" సర్క్యులర్ స్థాయిలోనే ఉండవలెను. దానికి వెల నిర్ణయించరాదు. దాని నిర్వహణకు విరాళములు వసూలు చేసుకొనవచ్చును. ఈ పత్రికకు ప్రత్యేక ఎక్కౌంటు నిర్వహించవలెను.

15. అకడమిక్ సెల్ పటిష్టముగా నిర్వహించుటకు కార్యదర్శివర్గ అజమాయిషికి లోబడి అన్ని స్థాయిలలో ప్రత్యేక విభాగములు ఏర్పాటు చేసుకొనవచ్చును. దాని నిర్వహణకు ప్రత్యేక నిధులను పోగు చేసుకొనవచ్చును. ఆ నిధుల బాధ్యత కార్యదర్శి వర్గమే కలిగి యుండును.

# ఉపాధ్యాయుడు

-కొణకంచి రామకృష్ణ, ఖమ్మం

అతని కళ్ళల్లో సౌమ్యం,
చేతుల్లో సౌజన్యం,
అతని వేలికొనలలో
భవిష్యత్తు భవంతులు
గోరింటాకు దిద్దుకొంటాయి.
అతని భాషలో
చరిత్ర ఘోషలు ప్రతిధ్వనిస్తాయి,
భావంలో
విజ్ఞాన శాస్త్ర పుంజాలు
ప్రజ్వలిస్తాయి
అతని మాటల్లో
ప్రపంచ పటం
దుప్పటి విప్పుకొంటుంది.
అతనొక విజ్ఞాన శాస్త్ర ఖని
గణిత శాస్త్ర నిధి
రాత్రి పూట అంతరిక్షంలో
విసిరివేయబడ్డ నక్షత్రాల్లో
ఆయన ఆలోచనలు
ఉదయం వికసించిన తామరల్లా
ఆయన వస్త్రాలు
ఆయన జీవితమేబడి
తరగతి గదే గుడి
అతనికి పిల్లలే పూలు
ప్రతిజ్ఞ పూజ
ఆయన ప్రేమ ప్రసాదం పంచి పెడుతూ
దేశభక్తిని పారాయణం చేస్తూ
దేశమాతకు పారాణి దిద్దే మరో
పూజారి
ఆయన కాగితాల కమతాల్లో
కలాల హలాలతో
జ్ఞాన సేద్యం చేసే
నిత్యాధ్యయన కర్షకుడు
పొద్దునే లేవగానె
రేడియోలో వినిపించే
భక్తి రంజనిలా
అతని గొంతుకలో
సమైక్యతా సందేశాలు
గీతలో శ్లోకాల్లో
అతని గుండెలో ప్రతిధ్వనించే
శాంతి ప్రవచనాలు
అతను చీకటిపై యుద్ధంచేసే
ఒక కాగడా
మతోన్మాదంపై
మ్రోగించిన కంచునగారా
కళల్లో
కవిత్వంలో
స్పందనలో
అన్నిట్లో ముందుంటాడు
ఎందరో విద్యార్థుల జీవితాల్లో
భవిష్యత్ దేశ పౌరుల్లో
ప్రభాత భేరి మోగిస్తుంటారు
ఆయన తూర్పుకు మరోపేరు
మంచి మార్పుకి మరో రూపు
సంఘంలోని ప్రతి చైతన్యం వెనుకా
దాగి వున్న ప్రేరకుడాతడు
సమాజంలోని ప్రతి గుండె చప్పుడును
వీక్షించే ప్రేక్షకుడాతడు
ఆయన
రేపటి తీరాన్ని
నాలుగు గోడల మధ్య తయారుచేసే
మానవ కర్మాగారం
ఆయన
రేపటి ప్రపంచానికి
నేడే- ఈనాడే
ఎగుర వేయబడ్డ శాంతి కపోతం.

[illegible]

దేశ జనాభాలో అక్షరాస్యతా శాతం 52.11. అందులో పురుషులు 64.13% కాగా స్త్రీలు 39.29% మాత్రమే. 6,63,04,854 ఉన్న మనరాష్ట్ర జనాభాలో 45.11% అక్షరాస్యులు కాగా వీరిలో ప్రాథమిక స్థాయినుండి ఉన్నత స్థాయి వరకు 2,46,107 మంది ఉపాధ్యాయులు ఉన్నారు. ఇందు ఉపాధ్యాయుల శాతం 68కాగా,మహిళాటీచర్లు 35% మాత్రమే ఉన్నారు. నేటి పురుషాధిక్య సమాజంలో స్త్రీ అనేక వివక్షతలకు, ఇక్కట్లకు గురిచేయబడుతుంది. వివిధరంగాలలో వున్న స్త్రీలు సామాజిక, కుటుంబ సమస్యలే కాక వృత్తి పరంగా అనేక సమస్యలు ఎదుర్కొంటున్నారు. ఈ మూడు సమస్యలు విడదీయరానివి. వీటిని గురించి సంపూర్ణంగా ఆలోచించకుండా ఏ ప్రత్యేక సమస్యకు విడివిడిగా పరిష్కార మార్గాలు కనుగొనలేము.

ఏ దేశంలోనైనా పని చేయగలిగిన స్త్రీ పురుషులందరు ఉత్పాదక కార్యక్రమంలో పాల్గొన గలిగితేనే వనరులన్నింటిని ఆదేశం సక్రమంగా వినియోగించుకోగలదు. అటువంటి పరిస్థితి లేనిచోట మానవుని జీవన పరిస్థితులు మెరుగుపడవు. అందువలన సాధారణంగా వినిపించే "వేన్నీళ్ళకు చన్నీళ్ళులోడు- మహిళా ఉద్యోగం" అనే భావనతో కాక సామాజిక ఉత్పత్తిలో భాగంగా మహిళలు కూడా వివిధ ఉత్పత్తులలో భాగస్వాములను చేయడం అనివార్యం.

ముందే చెప్పుకున్నట్లుగా అక్షరాస్యతలో ఉన్న అసమానతకు ప్రతిబింబంగానే మహిళాటీచర్లశాతం ఉన్నది. కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు మహిళలకు 30% ఉద్యోగాలు ఇవ్వాలని చట్టాలు రూపొందించాయి. ఇది హర్షణీయమే. అదే సందర్భంలో ఇటువంటి చట్టాలు, రక్షణలు లేకపోతే ఆదర్శవంతమైన యాజమాన్యంగా ఉండవలసిన ప్రభుత్వమే మహిళలను ఆ మాత్రం కూడా నియమించని స్థితిలో ఉందన్న విషయం గమనించాలి. అనేక అభివృద్ధి చెందిన దేశాలలో కొన్ని వృత్తులలో మహిళల సంఖ్య 60% నుండి 70% వరకు ఉంటున్నది. మన దేశంలో ఏ రంగంలోను అటువంటి స్థితి లేదు. మహిళలలో ఉన్నత విద్యావంతులైన నిరుద్యోగులు పెద్ద సంఖ్యలో వున్న సంగతి తెలిసిందే. ఉపాధ్యాయినులుగా మహిళలు, విద్యార్థులను తీర్చిదిద్దడంలో ఎంతో కీలకపాత్ర వహించగలరు. సహనం, ఓపిక ఎక్కువగా ఉండవలసిన విద్య, వైద్య, ఇంజనీరింగ్ రంగాలలో మహిళలు ముఖ్యపాత్ర వహించగలరని అనేక సందర్భాలలో రుజువయింది. అందువలన మహిళలకు అన్ని రంగాలలోను పురుషులతోపాటు సమానంగా కేటాయించడం అవసరం. దీనివలన స్త్రీ విద్యను ప్రోత్సహించినట్లవుతుంది.

సామాజికంగా వెనుకబడిన పరిస్థితులలో ఇంటిపని భారమంతా మహిళలే నిర్వహిస్తున్నారు. వెనుకబాటు తనంతో పాటు, చైతన్యలేమి, పురుషాహంకారం వల్ల కూడా స్త్రీ ముందుకు రాలేకపోతున్నది. ఒకవేళ కొన్ని మినహాయింపులున్నప్పటికీ అవి చాలా పరిమితం. భార్యాభర్తలు యిద్దరూ ఉద్యోగులైన సందర్భంలో సైతం ఇంటిపని భారం పూర్తిగా మహిళలపైనే పడుతున్నది. కావున స్త్రీలకు తగిన ప్రోత్సాహం కావాలన్నా, వారు ముందుకు రావాలన్నా మనమంతా దానిని గురించి ఆలోచించాలి. భార్యాభర్తలిద్దరూ ఉపాధ్యాయులైతే వారిని ఒకే చోట ఉంచాలని ప్రభుత్వ నిబంధనలు స్పష్టంగా చెబుతున్నప్పటికీ అనేక సందర్భములలో దానిని అధికారయంత్రాంగం అమలు జరపటంలేదు.

ఈ నెల 1 నుండి 8వరకు కేంద్ర మానవ వనరుల శాఖ, యునిసెఫ్‌ల ఆధ్వర్యంలో దేశవ్యాప్తంగా "తల్లిపాల వారోత్సవం" జరిగింది. ఈ సందర్భంగా బొంబాయిలో జరిగిన సభలో పలువురు వైద్య ప్రముఖులు మాట్లాడుతూ పంజాబు, హర్యానా రాష్ట్రాలలో ఉన్న మాదిరే బిడ్డలకు స్తన్యమిచ్చే తల్లుల ప్రసూతి సెలవును ఆరు మాసాలకు, మిగతా రాష్ట్రాలకు కూడా ఎందుకు పొడిగించరాదని? ఉన్న అడ్డంకి ఏమిటని? ప్రశ్నించారు. దీనితో రోగనిరోధక శక్తిని పెంచే తల్లిపాలు బిడ్డకు అవసరమనే భావనకు మరింత బలం చేకూరింది. కావున ప్రసూతి సెలవు పొడిగింపు న్యాయం, పూర్తిగా సమర్థనీయం. అనేక దేశాలలో 90 రోజులకు మించి సెలవులిస్తున్న ఉదంతాలున్నాయి. ఐరోపా సమాజదేశాలలో పూర్తి వేతనం యిచ్చి 14 వారాల తర్వాత మరి కొంతకాలం పాక్షిక వేతనం యివ్వాలనే ఒప్పందం జరిగింది. అందువలన ఏ రీత్యా చూసినా ప్రస్తుతమున్న ప్రసూతి సెలవును పెంచవలసిన అవసరాన్ని గుర్తించాలి.

అవివాహితులు, వితంతువులకు సాధ్యమైన మేరకు వారి నివాసప్రాంతాలకు సమీపంలో పోస్టింగ్ యివ్వాలన్న నిబంధనలు తు.చ. తప్పకుండా అమలు జరపటంలేదు. అనేక సందర్భాలలో పోస్టులు ఖాళీలేవన్న పేరుతోనో మరేదో సాకుతోనో దీనిని ఉల్లంఘిస్తున్నారు.

సమాజంలో క్షీణ, చవకబారు సంస్కృతి అవలక్షణాలైన వేధింపులు, అవహేళనలు, అత్యాచారాలు రోజు రోజుకు పెరిగిపోతున్న విషయం మనం నిత్యం చూస్తున్నదే. అందులోను ఉద్యోగాలు చేసే మహిళలంటే ఒక విధమైన చులకన భావం నేటికీ ఉన్నది. కాబట్టి వీటికి కారణాలైన స్త్రీని దిగజార్చే చౌకబారు సాహిత్యం, సినిమాలు, అసభ్య ప్రకటనలను ఖండించవలసిన అవసరం మేధావంతులుగా ఉన్న మనందరి మీదా ఉన్నది.

వెనుకబాటుతనం వలన గ్రామాలలో, ఆర్థిక సమస్యల వలన పట్టణాలలోను మరుగుదొడ్ల నిర్మాణం పట్ల శ్రద్ధ వహించడంలేదు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు లోకాస్ట్ సానిటేషన్ పథకాలను రూపొందించి గృహ యజమానులకు ఋణాలు సైతం యిచ్చి మరుగుదొడ్ల నిర్మాణానికి ప్రోత్సహిస్తున్నది. ఆ ప్రభుత్వాలే పాఠశాలల నిర్మాణంలో వీనిని విస్మరించడం శోచనీయమైన విషయం. మరుగుదొడ్లు లేనిచోట మహిళా ఉపాధ్యాయులు ఎంత యిబ్బందికి గురవౌతున్నారో, అది ఎంత అనారోగ్యమో చెప్పనవసరంలేదు.

జనాభా లెక్కలు, కుటుంబ నియంత్రణ ప్రచారం మొదలైన విషయాలలో ఉపాధ్యాయులను నియమించడం వలన పాఠశాల నిర్వహణ, బోధనా సామర్థ్యం దెబ్బ తింటున్నాయని, వృత్తికి సంబంధించని పై డ్యూటీలలో ఉపాధ్యాయులను మినహాయించాలని ఉపాధ్యాయ సంఘాలు డిమాండ్ చేస్తున్నాయి ఈ మినహాయించే క్రమంలో ముందుగా మహిళా ఉపాధ్యాయులనుండి ప్రారంభించడం సముచితం.

# ఉపాధ్యాయినులు– సామాజిక బాధ్యత

ఉన్నత విద్యావంతులుగా, మేధావులుగా మున్న ఉపాధ్యాయులపై సామాజిక బాధ్యత ఎంతో ఉన్నది. ఉపాధ్యాయులను సమాజం నుండి వేరుపరచడం సాధ్యంకాదు. వేతనాలు, పనిపరిస్థితుల మెరుగుదలకు పోరాడుతూనే మన విద్యాబోధనలో శాస్త్రీయ పద్ధతులను అనుసరిస్తూ బాధ్యతలను కూడా అంతే స్ఫూర్తితో నిర్వహించాలి. అదే సమయంలో సామాజిక పరిణామాలను తమ హక్కుల సాధనకోసం వివిధ వర్గాల ప్రజలు చేస్తున్న ఆందోళనలను, కళా సాంస్కృతిక, సాహిత్య, సంస్కరణ ఉద్యమాలను అర్థం చేసుకోవడం, వివిధ వేదికలలో పాల్గొనడం అవసరం. మహిళలు ఎంత ఉన్నతస్థానాలలోకి వెళుతున్నా సమాజంలో అణచబడిన వర్గాలలో భాగమేనన్న విషయాన్ని మనం చైతన్యంతో గుర్తించకపోతే సరైన మార్గాన్ని ఎంచుకోలేం. మానభంగాలు, ఇతర అత్యాచారాలు స్త్రీలను అణగద్రొక్కే చర్యలలో భాగంగానే జరుగుతున్నాయి. వరకట్న హత్యలు, ఆస్తి హక్కులలో వివక్షత, విడాకుల చట్టాలలోని లొసుగులు, గర్భస్థ స్త్రీ శిశుహత్యలు నిత్యకృత్యంగా మారాయి. ఇవి సాంఘిక దురాచారంగా కూడా వున్నాయి. ఆడ పిల్లలను అమ్ముకునే నీచ సంస్కృతిని 100 సం॥రాల క్రితమే గురజాడ కన్యాశుల్కం ద్వారా ఎండగడితే నేడు వరకట్నం పిశాచి కారణంగా నాగరికత అభివృద్ధి చెందిందన్న మనం అనాగరికంగా వెళ్తున్న స్థితిని గర్భస్థ, స్త్రీ శిశు హత్యలు నిరూపిస్తున్నాయి. ఈ నీచ సంస్కృతికి మానవ జాతి సిగ్గుతో తలవంచుకోవాలి. ఇటువంటి వాటికి వ్యతిరేకంగా చైతన్యవంతులైన స్త్రీ, పురుషులు మొత్తం సామాజిక ఉద్యమంగా పోరాడవలసిఉన్నది. కందుకూరి, గురజాడ వంటి సంఘ సంస్కర్తలు చూపించిన మహోన్నత మార్గాన్ని మహిళలే స్వయంగా నడుంబిగించి అనుసరించకపోతే స్త్రీ జాతికి విముక్తిలేదు. అందుకు దేశంలో పోరాడుతున్న మహిళా సంఘాలతో, సంస్థలతో సామాజిక ఉద్యమాలతో మహిళా ఉపాధ్యాయులు సన్నిహిత సంబంధాలు కలిగివుండడం, మమేకం కావడం ఎంతో అవసరం. ప్రస్తుతం అత్యధిక ఉపాధ్యాయినులను ఇంటిపనికి, ఉద్యోగానికి మాత్రమే పరిమితం చేయబడుతున్నారు. అదే సమయంలో పరిమితం అవుతున్నారు. ఆర్థిక సమస్యలపై జరిగే ఆందోళనలో సైతం పాల్గొన్నవారి సంఖ్య నామమాత్రంగానే ఉన్నది. ప్రభుత్వం అనుసరిస్తున్న నూతన ఆర్థిక విధానం, నూతన పారిశ్రామిక విధానం యొక్క దుష్ఫలితాలకు ముందుగా మహిళలే బలికావలిసివస్తుంది. కాబట్టి ఈ విధానాలకు వ్యతిరేకంగా జరిగే ఉద్యమాలలో చైతన్యవంతులైన మనమందరం పాల్గొనకుంటే అవి సంపూర్ణంగా జయప్రదం కాజాలవు. ఈనాడు పొందుతున్న వేతనాలు, సౌకర్యాలు ఉపాధ్యాయ ఉద్యమ పోరాటాల ఫలితమేనన్నది మహిళా ఉపాధ్యాయులు గుర్తించాల్సిన అవసరం ఎంతైనా ఉన్నది. సమస్యలు, సమస్యల ఎడల ప్రభుత్వవైఖరి మనం తెలుసుకోవాలంటే అందుకు తగ్గ రాజకీయ పరిజ్ఞానం ఎంతో అవసరం. దేశసమగ్రత, విచ్ఛిన్నకర శక్తుల ప్రభావం, మతోన్మాదం దాని ప్రభావం, మన హక్కుల కొరకు ఎలా పోరాడాలి అనే విషయాలు మనమందరం తెలుసుకొని ఉండాలి. ప్రత్యేకించి విద్యార్థులకు పాఠాలు బోధించే మనకు ఈ రాజకీయ దృక్పథం, చైతన్యం మరీ అవసరం.

ఏ దేశ స్వాతంత్ర్యోద్యమంలోనైనా మహిళల పాత్ర తక్కువేమీ కాదు. కాని వారికి తగిన ప్రాధాన్యత చరిత్రలో కన్పించటం లేదు. ప్రపంచ దేశాలలోను, దేశవ్యాపితంగాను జరుగుతున్న ఉద్యమాలలో స్త్రీపాత్రను నిర్లక్ష్యం చేయలేని స్థితి వచ్చిందన్నది, గుర్తించవలసిన అవసరం ఏర్పడిందన్నది, జగమెరిగిన సత్యం. అందువలన సామాజిక, ఆర్థిక సమస్యలపై వివిధ ప్రజాసంఘాలు జరిపే పోరాటాలు, ఉద్యమాలలో సామాన్య మహిళలతోపాటు మనం కూడా చేయి చేయి, కలిపి ముమ్ముందుకు ఉద్యమిద్దాం. ఆ విధంగా మాత్రమే సమాజాన్ని పట్టి పీడిస్తున్న వివిధ సమస్యలను, సమైక్యంగా ప్రతిఘటించడం, పరిష్కారాలు సాధించడం,, మన స్వాతంత్ర్యయోధులు కలలుగన్న మరో ప్రపంచాన్ని, " ఒక మనిషిని వేరొక మనిషి, ఒక జాతిని వేరొక జాతి పీడించే సాంఘిక ధర్మంలేని నూతన ప్రపంచాన్ని" సృష్టించుకోగలం.



## ఉపాధ్యాయినులకు ప్రత్యేక స్టడీ లీవు సౌకర్యం

సమాజంలో సగభాగంగా వున్న మహిళలు ఈరోజు ఉద్యోగాల్లోనూ అధిక సంఖ్యలోనే వున్నారు. అయితే ఇంటి చాకిరి మాత్రం దాదాపు వారే పూర్తిగా మోస్తున్నారు. ఫలితంగా పురుషులతో సమానంగా విద్యార్హతలను అదనంగా వారు పెంచుకోలేకపోతున్నారు. ఆ మేరకు ఉపాధ్యాయినులు తమ నైపుణ్యాన్ని మరింత పెంచుకునే అవకాశం కోల్పోతున్నారు. కనుక ఉపాధ్యాయినులు అదనపు విద్యార్హతలు సంపాదించుకునేందుకు ప్రత్యేక స్టడీ లీవు సౌకర్యాన్ని కల్పించాలని యీ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతోంది.

## స్త్రీని కించపరచే పాఠ్యాంశాలను తొలగించాలి

మన పాఠ్య గ్రంథాలు ముఖ్యంగా తెలుగువాచకాలు మహిళల్ని పక్రంగా చిత్రీకరిస్తున్నాయి. తల్లిగా, సమాజ పరిణామంలో కీలక పాత్ర వహిస్తున్న మహిళ హోదాను పెంచే విధంగా, ఆత్మ విశ్వాసాన్ని పెంపొందించేలా పాఠ్యాంశాలుండేందుకు తగిన చర్యలు తీసుకోవలసిందిగా యీ మహాసభ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తోంది.

## పాఠశాలల్లో ఉపాధ్యాయినులకు వసతులు:

మన పాఠశాలలు ప్రధానంగా గ్రామప్రాంతాల పాఠశాలలు కనీస సౌకర్యాలు లేకుండా వున్నాయి. ఉపాధ్యాయినులకు మరుగుదొడ్లు, మూత్రశాలలు లేకపోవడం, కనీసం పాఠశాల భవన ప్లానింగ్‌లో వాటిని పట్టించుకొనకపోవడం విచారకరం. పాఠశాలలో కనీస పారిశుధ్య సౌకర్యాలు కల్పించాలని యీ మహాసభ రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరుతోంది.

## ఉద్యోగాల్లో మహిళలకు సమాన ప్రాతినిధ్యం

'ఉద్యోగం పురుష లక్షణం' అనేది ఈనాడు చెల్లని మాట. చదువుల్లో, సామాజిక ఉత్పత్తి కార్యక్రమాల్లో మహిళలు పురుషులతో పోటీపడుతున్నారు. కొన్ని సందర్భాలలో వారే ముందుంటున్నారు. కనుక మహిళలకు మరింత ప్రోత్సాహకం కలిగే విధంగా ఉద్యోగాల్లో స్త్రీ, పురుషులకు సమాన ప్రాతినిధ్యం ఉండేలా చట్టాలలో సవరణలు చేయాలని యీ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతుంది.

## మెటర్నటి లీవు

పిల్లలకు పాలిచ్చి పెంచుట బిడ్డ ఆరోగ్యానికి అవసరం. అందుకు ఆరు మాసాలు అవసరం అనేది శాస్త్రవేత్తల నిర్ణయం. కనీసం ప్రభుత్వం అంగీకరించిన నాల్గు మాసాలయినా యివ్వాలి. రెండు కాన్పులకే పరిమితమనే నిబంధన తొలగించాలి.



# వస్తు ప్రదర్శనల వివరములు

శ్రీ యు.యం. కాంతారావు

**6 వ వైజ్ఞానిక మహాసభల సందర్భములో 8.8.93 తేదీ నుండి 10.8.93వ తేదీ వరకు హిందూ కాలేజి గుంటూరులోని మద్ది సుదర్శనం కామర్సు హాలునందు వస్తు ప్రదర్శనలు వివిధ అంశములో 7 గదులయందు ఏర్పాటు చేసి గుంటూరు జిల్లా విద్యాశాఖాధికారి శ్రీ జి.భీమశంకరశాస్త్రిగారిచే ప్రదర్శన ప్రారంభించబడినది.**

## ప్రదర్శనలో ఏర్పాటు చేయబడిన అంశములు

### రూము నంబరు–1

జిల్లా ప్రజాపరిషత్ ఉన్నత పాఠశాల వెనిగండ్లకు చెందిన శ్రీ సిహెచ్.ప్రభాకరరావు(క్రాఫ్టు ఉపాధ్యాయులు) చెక్క, కొబ్బరిచిప్పలు, దూది, దారము, ప్లైన్‌దారము అనేక రకములైన వస్తువులు, గోళీలతో మోడల్సు, ద్రాక్షగుత్తులు సిగరెట్ పెట్టెలతో కుక్క, ఏనుగు, జిరాఫీ మైనము కాగితపు గుజ్జు మట్టితో చేయబడిన జంతువుల బొమ్మలు, పండ్ల బొమ్మలు, పూసలు, నార, వైరు, స్ట్రాలతో పరుసులు, బుట్టలు, బొమ్మలు, తాటిఆకులు, గవ్వలు, అద్దాలు, పేకముక్కలు, వైరులతో అనేక రకములైన వస్తువుల ప్రదర్శన సందర్శకులను మిక్కిలి ఆకర్షించబడినది.

స్టాంపుల ప్రదర్శన శ్రీ కె.జె.చంద్రపాల్ సెకండరీ గ్రేడు అసిస్టెంట్ గురజాల మండలము వారు ఏర్పాటు చేసినారు.

శ్రీ బైరోజు దామోదరచార్య డ్రాయింగు టీచరు ఎ.హెచ్.ఎస్. వీపనగళ్ళ, మహబూబ్‌నగర్ వారు వేరు వేరు సీసాలలో మంచములు, భారతదేశ పటము ఏర్పాటు చేసినారు. సబ్బులపై వేరు వేరు శిల్పాలు, డిజైన్సు చెక్కబడిన మోడల్సు, చాక్‌పీసుతో గొలుసు యీ ప్రదర్శనకు వన్నెతెచ్చినవి.

### రూము నంబరు –2

నెల్లూరు జిల్లా యు.టి.యఫ్. వారి 'నేటి సమాజంలో స్త్రీ' అనే అంశముపై ఫోటోలు, పోస్టర్లు, పేపరు వార్తలు 'ఇంటా-బయట' స్త్రీ యొక్క కర్తవ్యములను కళ్ళకు కట్టినట్లు పటముల ద్వారా తెల్పుట, యీ ప్రదర్శనలో ఆడపిల్లల పుట్టుకపై ప్రజల అభిప్రాయం, వరకట్నం మొదలగు దురాచారములను వివరముగా తెలియజేసి సందర్శకులను విపరీతముగా ఆకర్షించుట జరిగినది.

### రూము నంబరు–3

నవరంగ్ చిత్రకళానికేతన్‌వ్యవస్థాపకులు, ప్రముఖచిత్రకారుడు శ్రీ వెల్లటూరి పూర్ణానందశర్మగారు వారి శిష్యులు వేసిన వివిధ వర్ణచిత్రములు, రేఖాచిత్రములు, అఖిల భారత చిత్రకళా పోటీలు నిర్వహించినపుడు వివిధ రాష్ట్రములకు చెందిన 6 సం॥ నుండి 16 సం॥ వయస్సు గల వారు వేసిన చిత్రములు సుమారు 600లకుపైగా ప్రదర్శన ఏర్పాటు చేయుట జరిగినది.

జిల్లా ప్రజాపరిషత్ పాఠశాల, ఈమని ఉపాధ్యాయులు శ్రీ యస్.రాధాకృష్ణమూర్తిగారు వారి విద్యార్థుల సహకారముతో విద్యుత్ రైలు నమూనా, ధాన్యము తూర్పుపోత పరికరములు విద్యార్థులను, రైతులను, వ్యాపారస్తులను విశేషముగా ఆకర్షించుట జరిగినది.

### రూము నంబరు –4

శ్రీ ఎ.అప్పారావు డ్రాయింగు టీచరు జిల్లా ప్రజాపరిషత్ ఉన్నత పాఠశాల, ముప్పాళ్ళ, కృష్ణాజిల్లా వారు వారి శిష్యుల చేత వేయబడిన, చిత్రములు తయారు చేయబడిన పండ్లు, చెట్లు మొ॥ మోడల్సు ప్రదర్శన ఏర్పాటు చేయబడినది.

### రూము నంబరు – 5

ఈ గదిలో యు.టి.యఫ్. ఎకడమిక్ సెల్ ఖమ్మం జిల్లా వారిచే ఏర్పాటు చేయబడిన స్వల్పవ్యయము లేక వ్యయములేని బోధనోపకరణముల ప్రదర్శనకు శ్రీ మురళిగారి ఓర్పు, నేర్పు ప్రదర్శన ఏర్పాటుకు సహకరించిన ఉపాధ్యాయుల వలన వైజ్ఞానిక ప్రదర్శనకు, తలమానికముగా సందర్శకుల మెప్పు పొందుట జరిగినది.

### రూము నంబరు – 6

జనవిజ్ఞాన వేదిక రేపల్లెశాఖ కన్వీనరు శ్రీ యు.యం.కాంతారావు వారి శిష్యులు చేత మూఢనమ్మకములు, నిరక్షరాస్యతా నిర్మూలనా కార్యక్రమము, ఆరోగ్యమునకు సంబంధించిన చార్టుల ప్రదర్శన ఏర్పాటు చేయుట జరిగినది.

### రూము నంబరు – 7

సెంట్‌జోసెఫ్‌హైస్కూలు, గుంటూరు సైన్సుఉపాధ్యాయిని శ్రీమతి బి.నిర్మలాబాయిగారు వారి విద్యార్థుల సహాయముతో పదవ తరగతి వరకు గల సైన్సుకు సంబంధించిన మోడల్సు, చార్టులు మొదలగు వాటితో ప్రదర్శన ఏర్పాటు చేసియున్నారు.

మండల ప్రజాపరిషత్ ప్రాథమికోన్నత పాఠశాల తాడికొండ ఉపాధ్యాయుల చేత కూడా మోడల్సు ప్రదర్శనలో ఏర్పాటు చేయబడినవి.

ఈ మహాసభల సందర్భములో ఏర్పాటు చేసిన సైన్సు ప్రదర్శన ఉన్నత అధికారులను, ఉపాధ్యాయులను; ఉద్యోగులను, రైతులను, వ్యాపారులు, విద్యార్థులను, స్త్రీలను ఆకట్టుకొనుట జరిగినది.

ఈ ప్రదర్శన ఏర్పాటు చేసిన ఉపాధ్యాయులకు జ్ఞాపికలు బహుకరించుట 10.8.93వ తేదీన జరిగినది. ఈ జ్ఞాపికలు రాష్ట్ర సెక్రటేరియట్ సభ్యులచే బహూకరించబడినవి. ఈ ప్రదర్శనలో ప్రతి రోజు వేలాది మంది ఉపాధ్యాయులు సందర్శించిరి.

## వివాదం

**–అడిగోపుల వెంకటరత్నం**

**నదీజలాల పంపకాన**
**ఆంధ్ర, కర్నాటక**
**మహారాష్ట్ర, తమిళనాడులతోపాటు**
**తన వాటా కోరుతూంది**
**తూర్పున బంగాళాఖాతం**

# సాంస్కృతిక ప్రదర్శనలు

సాహిత్యం అంటే ప్రజాహితాన్ని కూర్చేది. "కళ,కళ కోసం అన్నది ఒకప్పటి సంగతి. కళ ప్రజ కోసం, ప్రజా జీవితాన్ని సుఖమయం చేయడం, సమ సమాజాన్ని నిర్మించటం కోసం అన్నది ఇప్పుడు ముఖ్యం.

ఉద్యమాలలోంచి కవులు, కవిత్వం ద్వారా ఉద్యమాలు పుడతాయి. అనేది చారిత్రక సత్యం. సాహిత్యాన్ని,సమాజాన్ని విడదీయలేం. వర్ణ,వర్గ బేధాలు తొలగించి సర్వ సమానత్వాన్ని చాటేదే సాహిత్యం. కందుకూరి, గురజాడ మొదలగు కవులు తమ రచనల ద్వారా ప్రజా చైతన్యాన్ని కల్గించి సాంఘిక విప్లవానికి నాంది పలికారు.

అట్టి రచనలు అనేక రూపాలు కథలు, ప్రహసనాలు, నాటికలు మున్నగునవి అనేకం. " కావ్యేషు నాటకం రమ్యం" కావ్యాలలోనికి నాటకం రమ్యమైందన్నారు. అందువల్లనే భారతం మొత్తం నాటక రూపంలో వెలువరించారు తిరుపతి కవులు. "వరకట్నాల" గురించి "వరవిక్రయం","కన్యాశుల్కం" వెలువడినాయ్. తెలంగాణా పోరాటం, భూపోరాటాలు జరిగే రోజుల్లో " మా భూమి", " ముందడుగు" నాటకాలు ప్రాశస్త్యాన్ని పొందాయి. " మాలపిల్ల" సినిమా రూపంలో వెలువడింది.

దురదృష్టవశాత్తు ఈనాడు కళ కళ కోసం కాదు, సమాజ శ్రేయస్సుకు కాదు. అంతా డబ్బు కోసమే. కళా పిపాసపోయింది. ధన పిశాచి ప్రబలింది. భూస్వామ్య వ్యవస్థ, పెట్టుబడిదారీ వ్యవస్థలో దుడ్డు కొరకు ఏ గడ్డి నైనా కరుస్తున్నారు. సమాజాన్ని సర్వనాశనం చేస్తున్నారు.

ఇట్టి పరిస్థితులలో ఉపాధ్యాయులమైన మన కర్తవ్యమేమిటి? మనలో అనేక మంది కవులు, రచయితలు, గాయకులు, నటులు ఉన్నారు. వారిని ప్రోత్సహిస్తే సమాజ శ్రేయస్సు కోరే వారు తమని బిడీకృత కళా పాటవాన్ని ప్రదరిస్తారు. ఈ సమాజ హితమును చేకూరుస్తారు.

ఈనాడు దేశంలో మత కల్లోలాల, వల్ల సమాజానికి, వరకట్నాల వల్ల స్త్రీలకుకల్గే నష్టాలు, విధానాలు, నూతన ఆర్థిక రాజకీయ పరిస్థితుల వల్ల దేశ సార్వభౌమత్వానికి స్వావలంబనకు ఎలా గొడ్డలి పెట్టుగానున్నది. సార్వజనీనిక విద్య ఎలా ఆవేశ కుసుమంగా మిగిలిపోతున్నదీ, మొదలైన అనేక అంశాలు ఇతివృత్తాలుగా తీసికొని పాటల ద్వారా, నాటకాల ద్వారా సామాజిక స్పృహ కల్గించాల్సిన తరుణం ఇది.

అందుకనే ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ 6వవిద్యా వైజ్ఞానిక మహాసభ సందర్భంగా ఆగస్టు 8,9తేదీలలో ప్రదర్శనలను ప్రోత్సహించింది. ఔత్సాహిక రచయితలు, నటకులు, గాయకులు పాల్గొన్నారు.

8వ తేదీ రాత్రి 9 గంటలకు సాంస్కృతిక ప్రదర్శనలు ప్రారంభమయ్యారు. స్వాగతం, శివనాట్యంతో మొదలైయాయి. సెయింట్ జోసెఫ్ హైస్కూల్ గుంటూరు వారు చక్కని శాస్త్ర సంగీత నృత్యాలు మూడు ప్రదర్శించి ప్రేక్షకుల మన్ననలను పాత్రులయ్యారు.

తర్వాత " పల్లెటూరి బోగోతం" అనే నృత్యనాటిక తూర్పు గోదావరి జిల్లా ఉపాధ్యాయ బృందంచే ప్రదర్శించబడింది. గుబ్బల సత్యనారాయణ గారి రచనా నిర్వహణ బాధ్యత వహించారు. పాలేరు చదువుకోవాలని ఉంటే, అతని తల్లిదండ్రులు కూడా ప్రోత్సహిస్తూంటే భూస్వామి ఏ విధంగా అతని చదువుకోవటానికి చక్కని ఇతివృత్తంలో " వీధి భాగవత" పంథాలో శ్రావ్యంగా నడచింది. ప్రదర్శన, ప్రేక్షకుల దృష్టి నాకర్షించింది. లయతాళ నృత్య సరళిలో నియమబద్ధంగా ప్రదర్శించబడింది. ఆ పిదప శ్రీ"అబ్బ" రచించిన "Poison of India" ఏక పాత్రాభినయం శ్రీ రాజారావు గారు చక్కగా నిర్వహించారు. క్రీస్తు, అల్లా, రాం వేషములు మూడు ఒక్క ముఖలో చూపబడిన మేకప్ విశేషమైంది. ప్రస్తుత దేశ మత కల్లోలాలను దృష్టిలో నుంచుకొని మత సామరస్యం కోసం సాగిన రచనయింది. " కులం లేదు, మతం లేదు మనమంతా ఒకటే" అనే భావాన్ని స్పందింప చేసింది. గుంటూరు జిల్లా తెనాలి యు.టి.యఫ్. శాఖ తరపున నిర్వహించబడిన సామాజిక స్పృహనుకల్గించే చక్కని రచన. ఆఖరిగా నల్గొండ జిల్లా ఉపాధ్యాయ బృందం వారు ముగ్గురు "గొల్లసుద్దులు" ముద్దుముద్దుగా, జనాకర్షణగా, నవ్వించి కవ్వించాయి. ప్రస్తుత సామాజిక దుష్పరిస్థితులు తూర్పార పట్టాయ్. మధ్య మధ్య దేశభక్తి గేయాలాపన ఆంధ్ర ప్రజానాట్యమండలి వారు చేశారు. గొంతు, పాటలు మృదు మధురంగా జనాన్ని ఆకట్టుకున్నాయ్. ముఖ్యంగా దాశరధి రచించిన గేయం.

9వ తేదీ రాత్రి 10 గంటలకు సాంస్కృతిక ప్రదర్శనలు శ్రీ వేంకటగిరి సంస్థానాధీశుల మనుమడు శ్రీయాచేంద్ర "గేయావధానం" నూత్న ప్రక్రియా విశేషం. అష్టావధాన, శతావధానములవలెనే ఇదీ ఒక ఒక అవధానమే. 5గురు పృచ్ఛకులు ఉపాధ్యాయులున్నారు. ఒక్కొక్కరు ఒక్కొక్క విషయంపై ఒక్కొక్క రాగంలో అవధానిగారిని అడిగినప్పుడు అశువుగా, మాధుర్యంగా గేయాలాపన చేశారు. ముఖ్యంగా క్లిష్టమైనది "డంకెల్ ప్రతిపాదన"పై అశువుగా గేయాలాపన చేశారు. కష్టంగా అయినా కమ్మని గొంతుతో తర్వాత "రుద్రవీణ" నాటిక పశ్చిమగోదావరి జిల్లా ఉపాధ్యాయ బృందంచే కరుణ రసప్రాధాన్యంగా ప్రదర్శించబడింది. నీతి నియమాలకు కట్టుబడి తనవిధి నిర్వహిస్తే ధ్యేయంగా పెట్టుమన్న ఉపాధ్యాయుని జీవితం దుర్భరగాధగా, దుఃఖ మయం గాధగా తయారైందో, ఆబాధలో అతని జీవితం ఎలా అంతమైందో అద్భుతంగా ప్రదర్శించబడింది. ఆఖరి ఘట్టంలో శ్రీ సత్యనారాయణ గారి నటన కౌశలం నిజంగా ప్రశంసించదగింది. ఆఖరిగా ఖమ్మం జిల్లా ఉపాధ్యాయ బృందంచే సమస్య x సమస్య=ప్రశ్న అనే నాటిక ప్రదర్శించబడింది. సమస్యల వలయంలో చిక్కుకున్న జీవితాలకు సమస్యా పరిష్కారం కాకపోగా ఇక చివరకు మిగిలింది ప్రశ్న మాత్రమే. హావభావయుతంగా పదునుగా ప్రదర్శించబడింది. దీనిలో ప్రత్యేకత ఏమంటే మేకప్‌తో పనిలేదు. మ్యూజిక్ అసలు అవసరమే లేదు. కృష్ణాజిల్లా ఉపాధ్యాయ బృందంచే "అల్లూరి" బుర్ర కథ ప్రదర్శించబడింది. కథకులు వారి సహచరులు అనుభవజ్ఞులు. అభినయ పాటవం కల్గిన వారు. పిట్ట కథలు, హాస్యం ప్రస్తుత సామాజిక పరిస్థితుల దృష్టిలో పెట్టుకొని ప్రత్యేకంగా మధ్య మధ్య ప్రేక్షకుల కదలించారు.

"హాస్య నట చక్రవర్తి" శ్రీ అల్లు రామలింగయ్య ప్రముఖ సినీ నటుల ఈ కళా ప్రదర్శన ప్రారంభోత్సవంలో పాల్గొన్నందుకు, నవ్విస్తూ, కవ్విస్తూ ప్రేక్షకులకు చక్కని సందేశమిచ్చినందులకు, యు.టి.ఎఫ్. తరఫున తొలిగా వారికి హృదయ పూర్వక అభినందనలు తెలియపరుచుకుంటున్నాం.

నియమించబడ్డ ముగ్గురు న్యాయమూర్తులచే ఎంపిక చేయబడిన ఈ బహుమతి ప్రదానం వారికి ప్రత్యేకంగా జరుపబడునని తెలియపరచుకుంటున్నాం.

1.నృత్యములు శివనాట్యం ప్రథమ (గుంటూరు)
2. నాటికలు సమస్యxసమస్య =ప్రశ్న (నాటికకు) (ఖమ్మం)
3.ఏకపాత్రలు-"PoisonofIndia" ప్రథమ(రచనకు) (గుంటూరు)
4.నృత్యనాటికలు-"పల్లెటూరి బాగోతం"ప్రథమ (తూ.గో)
5.పాత్రలకు-"రుద్రవీణ" జి.సత్యనారాయణగారు ప్రథమ (ప.గో.)
6.పల్లెసుద్దులు-నల్గొండ జిల్లా వారికి ప్రథమ (నల్గొండ)
7.బుర్రకథ-"అల్లూరి" ప్రథమ (కృష్ణా)

# 6వ మహాసభ ఆమోదించిన తీర్మానాలు

## సంతాప తీర్మానాలు

మన సంఘం గత నూతన కౌన్సిల్ సమావేశాలను 1992 ఆగస్టు 22,23 తేదీలలో విజయవాడలో జరుపుకుంది. ఆనాటి నుండి నేటి వరకు జరిగిన మధ్య కాలంలో అంతర్జాతీయ, జాతీయ రాష్ట్ర స్థాయిలలో వివిధ రంగాలకు చెందిన పలువురు ప్రముఖులు మృతి చెందారు.

**(అ) అంతర్జాతీయ స్థాయిలో:**

ప్రముఖ చిత్రకారుడు డా.స్వవతోస్లావ్ రోరిచ్, ప్రఖ్యాత టెన్నిస్ క్రీడాకారుడు, మానవ హక్కుల పోరాట యోధుడు ఆర్థర్ యాషే, ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ నాయకులు రెవరెండ్ ఆలివర్ టాంబో,

దక్షిణాఫ్రికా కాంగ్రెస్ నాయకులు, ఆదేశ కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి క్రిస్ హనీ,

శ్రీలంక అధ్యక్షుడు రణసింఘే ప్రేమదాస,

శ్రీలంక మాజీ మంత్రి, ప్రతిపక్ష నాయకులు లలిత అతులిత మెదలి

ప్రముఖ ఇండో ఆంగ్లికన్ కవి, అనువాదకుడు, విమర్శకుడు భాషా శాస్త్రవేత్త శ్రీఏ.కె. రామానుజన్.

**(ఆ) జాతీయ స్థాయిలో:**

మాజీ ఉపరాష్ట్రపతి, సుప్రీం కోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీహిదయతుల్లా

ప్రముఖ పండితుడు, మేధావి, జాతీయవాది, పశ్చిమ బెంగాల్ గవర్నర్ ప్రొఫెసర్ నూరుల్ హసన్,కీర్తిశేషులు మాజీ ప్రధాని శ్రీలాల్ బహదూర్ శాస్త్రి సతీమణి శ్రీమతి లలితా శాస్త్రి,

ప్రముఖ తత్వవేత్త, చరిత్ర కారుడు శ్రీదేవీ ప్రసాద్ ఛటోపాధ్యాయ, స్వాతంత్ర్య సమరయోధులు శ్రీయుతులు ఎన్.జి.గోరే, గణేశ్ ఘోష్, బీరేన్‌దత్తా, గురుబచన్ సింగ్

భారత మాజీ సైన్యాధిపతి ఫీల్డ్ మార్షల్ జనరల్ కరియప్ప, ప్రముఖ చలన చిత్ర నిర్మాతలు తారాచంద్ బర్జాత్యా, సుందరలాల్ నహతా ప్రసిద్ధ హిందీ చలన చిత్ర నటుడు, దర్శకుడు కమల్ ఆమ్రోహి, విఖ్యాత మరాఠీ, హిందీ నటుడు సాహుమోదక్.

**(ఇ) రాష్ట్ర స్థాయిలో:**

రాష్ట్రమంత్రి శ్రీ ఎం. చంద్రశేఖర్, మన మహాసభల ఆహ్వాన సంఘంలో ముఖ్యులు, నైజాం వ్యతిరేక రైతాంగ పోరాటనాయకులు, మాజీ శాసన సభ్యులు శ్రీపుతుంబాక వెంకటపతి, స్వాతంత్ర్య సమరయోధురాలు, దేశంలోనే మొట్టమొదటి సారిగా మహిళా సంఘం స్థాపించినవారు, మాజీ శాసన సభ్యులు, ఆదర్శ మండల ప్రజాపరిషత్ అధ్యక్షురాలు శ్రీమతి మానికొండ సూర్యావతి మాజీ మంత్రి శాసన సభ్యుడు శ్రీనల్లపురెడ్డి శ్రీనివాసులరెడ్డి, మాజీ మంత్రి శాసన సభ్యుడు శ్రీ శివారెడ్డి, మాజీ మంత్రి శ్రీవీరమాచనేని వెంకటనారాయణ, ప్రముఖ సాహితీ వేత్త ఆంధ్ర సారస్వత పరిషత్ అధ్యక్షులు శ్రీదేవులపల్లి రామానుజరావు, ప్రసిద్ధ సాహిత్య విమర్శకులు, చరిత్ర కారుడు శ్రీదిగవల్లి వెంకటశివరావు ప్రముఖ సాహితీ పరిశోధకుడు, శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధిపతి ఆచార్య మద్దూరి సుబ్బారెడ్డి, ప్రముఖ జాతీయ వాది, ఉర్దూ దినపత్రిక సియాసత్ సంపాదకులు శ్రీఅబిద్ ఆలీఖాన్, ప్రముఖ నాటక ప్రయోక్త శ్రీ ఎ.ఆర్. కృష్ణ, ప్రసిద్ధకవి, రచయిత ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం అధ్యక్షులు శ్రీఅబ్బూరి వరద రాజేశ్వరరావు ప్రజానాట్య మండలి కళాకారుడు శ్రీమహమ్మద్‌సాలార్, తెలంగాణ సాయుధ పోరాట నాయకులు, మాజీ శాసన సభ్యులు శ్రీసర్వదేవభట్ల రామనాథం,

ప్రముఖ రచయిత, గాంధేయ వాది శ్రీఉమ్మెత్తల కేశవరావు, ప్రముఖ యువకవి శ్రీఅలిశెట్టి ప్రభాకర్

స్వాతంత్ర్య యోధుడు, విమర్శకుడు జీవిత చరిత్ర కారుడు శ్రీడి. రామలింగం, ప్రముఖ కర్నాటక సంగీత విద్వాంసురాలు డా శ్రీరంగం గోపాలరత్నం అనుబంధ కళాశాల అధ్యాపక సంఘం మాజీ అధ్యక్షులు శ్రీఎస్. సూర్యనారాయణ, ఈ సంఘం మాజీ నాయకులు శ్రీఆనందరావు తోట, స్వాతంత్ర్య యోధులు మాజీ శాసన సభ్యులు శ్రీకొరసాటి రామయ్య, పట్టాభి ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధులు శ్రీచలసాని సూర్య ప్రకాశరావు

**(ఈ) యు.టి.ఎఫ్. కార్యకర్తలు:**

మన సంఘం రాష్ట్ర కార్యదర్శి, తూర్పుగోదావరి జిల్లా శాఖ అధ్యక్షులు శ్రీవి. సూర్యనారాయణరాజు, తూర్పుగోదావరి శాఖ కార్యదర్శి, అక్షరదీక్ష కార్యకర్త శ్రీఎం.వి. ఏ.ఎల్. ఎన్. ఆచార్యులు హైదరాబాద్ జిల్లా కార్యకర్త శ్రీబాబూరావు, వరంగల్ జిల్లా గీసుకొండ మండల శాఖ అధ్యక్షులు శ్రీఆర్. మధుసూదన్‌రావు, నెల్లూరు జిల్లా వెంకటగిరి మండల శాఖ ప్రధాన కార్యదర్శి శ్రీసుబ్బయ్యశెట్టి -ఈ మధ్యకాలంలో మృతి చెందారు. ఇటీవలే మహబూబ్‌నగర్ జిల్లా బీచుపల్లి వద్ద కృష్ణానదిలో బస్సుపడిపోయి పలువురు మృతి చెందారు. వీరందరి మృతికి ఈ మహాసభ తన ప్రగాఢ సంతాపాన్ని వ్యక్తం చేస్తున్నది.

## జనరల్ తీర్మానాలు

**1. మతసామరస్యము:**

భిన్నత్వంలో ఏకత్వం భారతదేశపు ప్రత్యేకత. భిన్నజాతులు విభిన్న మత విశ్వాసాలు, విభిన్న తాత్విక చింతనలు గల దేశం మనది. అందుకే భారతదేశం, భారతీయసంస్కృతి భారతీయతత్వచింతనలు ప్రపంచ దేశాలన్నింటిని ఆకట్టుకున్నాయి

అన్ని విశ్వాసాలలోను మానవత్వ పరిరక్షణ ప్రధాన ధ్యేయంగా భావించబడేది. రానురాను యీ విశ్వాసాలు మూఢ విశ్వాసాలుగా దురహంకారమైనవిగా పరిణమించడంతో మత సంరక్షణ పేరుతో మత విద్వేషం చోటుచేసుకొంటున్నది.

బ్రిటిష్ ప్రభుత్వం తమ అధికారం కోసం భారత జాతిని హిందూ, ముస్లింలుగా విభజిస్తే, మత దురహంకారులు దానిని కొనసాగించి భారతదేశ విభజన వరకూ వెళ్ళారు. తెల్లవాడు పోతూ రగిల్చిన యీ చిచ్చు చల్లారకుండా ఆజ్యంపోసే శక్తులు ఉండనే వున్నాయి. ఆ శక్తులే తమ రాజకీయ స్వప్రయోజనాన్ని సాధించుకోవడానికి వేస్తున్న ఎత్తుగడలలో భాగంగానే 'మందిర్ మసీదు' ఉదంతాన్ని ముందుకు తెచ్చి, 92 డిశంబరు 6న బాబ్రీ మసీదు కూల్చివేతకు నేతృత్వం వహించినవి. దేశవ్యాపితంగా వివిధ మత విశ్వాసాలను పాటించే ప్రజలలో భయాందోళనలు కలగటానికి భద్రతా రాహిత్య వాతావరణం ఏర్పడటానికి యీ ఘటన హేతువైంది.

మనం మన దేశాన్ని లౌకిక ప్రజాస్వామ్య రాజ్యంగా మన రాజ్యాంగంలో నిర్వచించుకొన్నాము. దేశంలో ఏదైనా వివాదం తెలరేగినప్పుడు దానిని సంప్రదింపుల ద్వారాగాని, కోర్టుద్వారాగాని పరిష్కరించుకోవాలి. రాజ్యాంగ సూత్రాలు, కోర్టు నిర్ణయాలు మత విషయాలపై పనిచేయవని మత దురహంకారులు చేసే వితండవాదము అరాచకానికే దారితీస్తుంది. అందుచే లౌకిక ప్రజాతంత్ర భావాలను ప్రేమించేవారిని, విశ్వసించేవారిని, కర్తవ్యోన్ముకులను చేయవలసిన సమయము ఆసన్నమయింది.

ప్రజానీకంలో అట్టడుగుస్థాయివరకు నేటి పర్యవసానాల పూర్వాపరాలను గురించి ఉపేక్షిస్తే రానున్న ప్రమాద పరిస్థితిని గురించి వివరించవలసి వున్నది. భిన్న మత విశ్వాసాలుగల ప్రజలు ఒండొరుల భావాలను మన్నించి, గౌరవభావంతో సామరస్య విశ్వాసాన్ని దేశ ప్రజలలో కలిగించేందుకు కార్యక్రమాలు చేపట్టాలి. 1.సాహిత్య ప్రచారం 2. గోష్టులు 3. సంఘీభావ ప్రదర్శనలు 4. ఎగ్జిబిషన్లు యిందుకు ఉపకరిస్తాయి.

సామాజిక స్పృహ కలిగిన యు.టి.ఎఫ్. సభ్యులు తమ కర్తవ్యాన్ని గుర్తెరిగి యీ సమస్యపై స్పందించి పనిచేయవలసియున్నది. అందుకై చేపట్టే కార్యక్రమాలలో విస్తృత ప్రజానీకం పాల్గొనేలా కృషిచేయాలని ఉపాధ్యాయలోకాన్ని కోరుతూ, అందుకు అన్ని వర్గాల ప్రజలు కలసిరావలసిందిగా యీ మహాసభ విజ్ఞప్తి చేస్తోంది.

*2. ధరలను అదుపు చేయుట :*

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తమ వార్షిక బడ్జెట్‌ల సమయంలో విధిస్తున్న ప్రత్యక్ష, పరోక్ష పన్నుల కారణంగా వినిమయ వస్తువుల ధరలు నానాటికి పెరిగిపోతున్నాయి. అంతేగాక ఆర్థిక సంవత్సరం మధ్యలో ప్రభుత్వాలు దొడ్డిదారిన విధిస్తున్న యితర పన్నులవలన యీ ధరలు మరింత పెరిగి సాధారణ మానవుని జీవనాన్ని దుర్లభం చేస్తున్నాయి. ఉద్యమాలద్వారా మధ్యతరగతి ప్రజానీకం, ఉద్యోగులు తమ ఆదాయాలను మెరుగుపరచుకొంటున్నప్పటికీ, నిత్యమూ పెరుగుతున్న ధరలు వారి జీవన పరిస్థితులను అస్తవ్యస్తం చేస్తున్నవి. అందుచే వినిమయ వస్తువుల ధరలను అదుపుచేయుటకు తగిన చర్యలు తీసుకొనవలసిందిగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు యీ మహాసభ విజ్ఞప్తి చేస్తోంది. మరియు అధిక ధరల తాకిడికి యిబ్బంది పడుతున్న వ్యవసాయ కార్మికులు మొదలు మధ్యతరగతి ఉద్యోగులవరకు అందరికీ చౌక డిపోలద్వారా నిత్య జీవితావసర వస్తువులను ప్రభుత్వమే సరఫరా చేయాలని యీ మహాసభ డిమాండు చేస్తోంది.

*3. కార్మిక, ఉద్యోగ వర్గాల ఆందోళనకు మద్దతు :*

1986 నుండి భారత ప్రభుత్వం అనుసరిస్తున్న నూతన ఆర్థిక విధానం బహుళజాతి సంస్థలు మన ఆర్థిక, పారిశ్రామిక రంగాలపై పెత్తనం చెలాయించడానికి, మనదేశ సంపదను దోచుకోవడానికే దోహదపడుతున్నది. దాని పర్యవసానమే ప్రపంచ బ్యాంకు సూచనలు, ఐ.ఎం.ఎఫ్. షరతులు, డంకెలు ప్రతిపాదనలు వగైరా. ఈ అంతర్జాతీయ సంస్థల కనుసన్నలలో మెలుగుతున్న ప్రభుత్వం వ్యవసాయదారులు వాడే ఎరువులపైన, సామాన్య ప్రజానీకం వాడుకొనే నిత్యజీవితావసర వస్తువులపైన యిస్తున్న సబ్సిడీలపైన కోత విధిస్తున్నది. అంతేగాక ప్రభుత్వరంగ పరిశ్రమలను ప్రైవేటుపరంచేయడం అనివార్యమని చెప్పడానికి అవసరమైన పరిస్థితులను తానే కల్పించడంతోపాటు, కార్మికులను, ఉద్యోగులను ఎగ్జిట్, గోల్డెన్ హ్యాండ్ షేక్ వంటి పథకాలతో వీధులపాలు చేయడానికి ప్రయత్నం చేస్తున్నది. చైతన్యవంతులవుతున్న భారత కార్మికవర్గం, ఉద్యోగులు కేంద్ర ప్రభుత్వంయొక్క ఈ ద్రోహపూరిత పథకాల గుట్టును రట్టుచేస్తూ, దాని 'నూతన ఆర్థిక విధానం' చర్యను వ్యతిరేకిస్తూ ఐక్య ఆందోళనలను నిర్వహిస్తున్నారు. 92 నవంబరు 25వ తేదీన ఢిల్లీలో ఉద్యోగులు, ఉపాధ్యాయులు, కార్మికులు మొత్తం 10 లక్షలమంది చేసిన ప్రదర్శన అపూర్వమైనది. అందులో యు.టి.ఎఫ్. పక్షాన 75 మంది పాల్గొనడం జరిగింది. ఆక్రమములోనే 93 సెప్టెంబరు 9న వారు తలపెట్టిన జాతీయ సమ్మె జయప్రదం కావాలని ఆకాంక్షిస్తూ యీ మహాసభ ఆ సమ్మెకు తన సంపూర్ణ మద్దతును ప్రకటిస్తున్నది.

*4. సారా నిషేధాన్ని కట్టుదిట్టంగా అమలు జరపాలి*
*విదేశీ స్వదేశీ మద్యాన్నికూడా నిషేధించాలి*

ఆంధ్రప్రదేశ్ మహిళల అసమాన పోరాట ఫలితంగా ప్రభుత్వం సారా నిషేధాన్ని ప్రకటించింది. నెల్లూర్లో ఇప్పుడిది అమలులో వున్నది.

సారా నిషేధాన్ని ఈ సభ హృదయపూర్వకంగా సమర్థిస్తోంది. ఈ నిషేధం కేవలం చట్టాలతో సాధ్యంకాదు. చట్టాన్ని కట్టుదిట్టంగా అమలు పరిచే చర్యలతోపాటు, ప్రజాకమిటీల్లోకి మహిళలను, ఉద్యమ కారిణులను తీసుకొని వారికి చట్టబద్ధ అధికారం కల్పించి అమలు జరపాలని కోరుతుంది.

సారా నిషేధించి, బ్రాందీ విస్కీలను వెనుకదారిన తీసుకురావాలని ప్రభుత్వం పథకం రచిస్తున్నట్లు వార్తలు వస్తున్నాయి. ఇది కాకుల్ని గొట్టి గద్దలకు వెయ్యడమే.

కావున ప్రభుత్వం అన్నిరకాల స్వదేశీ విదేశీ మద్యాలనుకూడా నిషేధించాలని ఈ మహాసభ డిమాండ్ చేస్తోంది.

*5. అక్షరాస్యతా కార్యక్రమం :*

నిరక్షరాస్యత మానవుని ఆర్థిక, సాంఘిక పురోభివృద్ధికి అవరోధం. ప్రపంచంలోని నిరక్షరాస్యులలో సగంమంది మన దేశంలోనే వున్నారు. జనంలో జాగృతిని రేకెత్తించడానికి జ్ఞాన విజ్ఞాన సమితి ఆధ్వర్యంలో 1991సం||లో అక్షర కళాయాత్రలు దిగ్విజయంగా నిర్వహించబడినవి. అటుపై అనేక జిల్లాలలో సాక్షరతా కార్యక్రమం ప్రారంభమైనది. సామాజిక స్పృహ కలిగిన యు.టి.ఎఫ్. కార్యకర్తలు అప్పటికే జనవిజ్ఞాన వేదిక కార్యక్రమాలలో తలమునకలుగా వుండికూడా, యీ సాక్షరతా కార్యక్రమాన్ని జయప్రదం చేయడానికి అన్ని స్థాయిలలోనూ చిత్తశుద్ధితో పనిచేసినందులకు అభినందనీయులు. రాష్ట్ర సంఘ నాయకులు మొదలు సెంటరు శాఖ బాధ్యులవరకు వేలాదిమంది య.టి.ఎఫ్. కార్యకర్తలు మన రాష్ట్రంలో ఆహోరాత్రులు పనిచేసి సాక్షరతా ఉద్యమం మొదటి దశ పూర్తికావడానికి దోహదపడ్డారు. ఈ మొదటి దశలోనే ఉప్పొంగిన జన జాగృతిని చవి చూసిన దోపిడీ వర్గాలవారు యీ ఉద్యమంపై నీళ్ళు జల్లడంతోపాటు, యు.టి.ఎఫ్. కార్యకర్తలపై బురద జల్లడానికి కూడా పూనుకొన్నారు. వారి ప్రయత్నాల మేరకు సాక్షరతా ఉద్యమం మన రాష్ట్రంలో కొంత వెనుకపట్టు పట్టింది. ఈ స్థితిలో పట్టుదలకు, త్యాగాలకు మారుపేరైన యు.టి.ఎఫ్. కార్యకర్తలు సామాజిక స్పృహ కలిగిన యువకులను, విద్యార్థులను కలుపుకొని యీ సాక్షరతా ఉద్యమాన్ని ముందుకు తీసుకొని పోవడంలో కృషి చేయాలని యీ మహాసభ కోరుతోంది.

*6. విద్య-ప్రైవేటీకరణ :*

1986లో ప్రవేశపెట్టిన నూతన ఆర్థిక విధానంలో భాగంగానే నూతన విద్యా విధానాన్ని అమలు జరపడానికి కేంద్రప్రభుత్వం పూనుకొన్నది. దాని కారణంగా 14 సంలల లోపు వయస్సుగల బలబాలికలందరికి ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యగరపాలనే మన రాజ్యాంగ ఆశయం అడియాశయే అవుతుంది. విద్యారంగంలో వున్న లోపాలను సవరించడానికి పూనుకొనవలసిన ప్రభుత్వం "ఎలుకలున్నవని యిల్లు తగలబెట్టినట్లు" విద్యారంగాన్ని ప్రైవేటుపరం

చేయడమే ఏకైక పరిష్కార మార్గంగా ప్రచారం చేస్తున్నది. పాలకవర్గాల ప్రతినిధులు పనిగట్టుకొని ప్రభుత్వ సహాయంతో నడుస్తున్న పాఠశాలలపై దుష్ప్రచారం చేయడం, ప్రైవేటు యాజమాన్యములచే నడపబడుచున్న పాఠశాలలను ఆకాశానికెత్తడం చేస్తున్నారు. ప్రభుత్వ, స్థానిక సంస్థల పాఠశాలలకు ఏ వర్గాలకు చెందిన విద్యార్థులు వస్తున్నారు? వారి కుటుంబ నేపథ్యం ఏమిటి? అనే విషయాలను పరిగణనలోనికి తీసుకొనకుండా కేవలం ఫలితాలను చూపి వ్యతిరేక ప్రచారం చేయడం కావాలని చేస్తున్నదే తప్ప వేరుకాదు. ప్రైవేటు విద్యాసంస్థలు పుట్టగొడుగుల్లా పుట్టుకురావడానికి, అవి చేతనయినంత ఆర్థిక దోపిడీ చేయడానికి దోహదపడే అనేక ప్రక్రియలను ప్రభుత్వమే ప్రవేశపెడుతున్నది. ఈ విధానాల కారణంగా మొత్తం 80 శాతంగావున్న పేద, మధ్య తరగతి విద్యార్థులు క్రమేపి విద్యకు దూరమయ్యే ప్రమాదమున్నది. ఈ వర్గాలకు చెందిన విద్యార్థులకు ఉన్నత విద్య గగన కుసుమమే అవుతుంది. ఈ ప్రమాదాన్ని ఎదుర్కోవడానికి దేశవ్యాపిత ఉద్యమం అవసరమవుతుంది. అన్నివర్గాలకు చెందిన ప్రజలను యిందులో భాగస్వాములను చేయడానికి, వారి సహకారం పొందటానికి ఉపాధ్యాయులు ముందుగా తమపైనున్న అపప్రదను తొలగించుకొనే కృషి చేయాలి. ఉపాధ్యాయులు తాము చేయు ఉత్తమ కృషి ద్వారా మాత్రమే పాలకవర్గాల ఎత్తుగడలను త్రిప్పికొట్టి, ప్రజా విశ్వాసాన్ని పొందగలరని భావిస్తూ, అందుకు ఉపాధ్యాయులు తమ పని విధానాన్ని మెరుగుపరచుకొనే కృషి చేయాలని యీ మహాసభ కోరుతోంది.

ప్రభుత్వ, స్థానిక సంస్థల ఆధీనంలోని పాఠశాలల భౌతికవనరులను మెరుగుపరచడంద్వారాను, పాఠశాలల సక్రమ నిర్వహణకు యాజమాన్య పద్ధతుల్లో తగిన మార్పులు తేవడం ద్వారాను వాటి ఫలితాలను మెరుగుపరచడానికి పూనుకోవాలేతప్ప, విద్యారంగం లోపాలకు ప్రైవేటీకరణ పరమ సోపానమనే ప్రచారాన్ని విడనాడాలని కొఠారీ కమీషన్, రామమూర్తి కమీషన్‌లవంటి కమీషన్ల సిఫారసులను అమలు జరపడానికి పూనుకోవాలని యీ మహాసభ ప్రభుత్వాన్ని డిమాండు చేస్తున్నది.

**7. ఖేర్ కమిటీ సిఫారసుల అమలు :**

తగినన్ని భౌతికవసతులు, సదుపాయాలు కలిగివుండి విద్యార్థులను ఇంటినుండి పాఠశాలలకు ఆకర్షించే విధంగా పాఠశాలలు వుండాలి. అందుకు ప్రణాళికలలో తగినంత కేటాయింపు వుండాలి. 1952లో కేంద్ర ప్రభుత్వంచే నియమించబడిన ఖేర్ కమిటీ విద్యావ్యాప్తికై ప్రణాళికలో 10 శాతం నిధులను కేటాయించాలని సిఫారసు చేసింది. అయినా మొదటి పంచవర్ష ప్రణాళికలో విద్యకు 6% పైగా కేటాయించిన నిధులు క్రమేపి తగ్గించబడుతూ నేటికి 2% కంటే తక్కువకు కుదించబడినవి. నానాటికీ పెరుగుతున్న విద్యార్థుల సంఖ్యకు తగినన్ని పాఠశాలలను స్థాపించుటకుగాని, ఉపాధ్యాయులను నియమించటానికిగాని యీ నిధులు ఏవిధంగాను సరిపోవు. కనుక ప్రణాళికలలోను, బడ్జెట్‌లలోను విద్యకు కనీసం 10 శాతము నిధులను కేటాయించాలని యీ మహాసభ కేంద్ర ప్రభుత్వాన్ని కోరుతున్నది.

**8. రామమూర్తి కమిటీ సిఫారసుల అమలు :**

1986 నూతన విద్యా విధానంపై సమగ్రపరిశీలన చేయుటకు ఆచార్య రామమూర్తి కమిటీని శ్రీ వి.పి.సింగ్ ప్రభుత్వం నియమించింది. ఆ కమిటీ హర్షించదగిన కొన్ని సూచనలను చేసింది. 1. విద్యకు పెట్టే ఖర్చుని భవిష్యత్‌లో లాభాలనందించే పెట్టుబడిగా భావించాలి. 2. విద్యకు బడ్జెట్‌లో 6. శాతాన్ని విధిగా కేటాయించాలి. 3. ప్రాథమిక విద్యకు, వెనుకబడిన ప్రాంతాలకు నిధుల కేటాయింపును పెంచాలి. 4. ప్రాథమిక విద్యను ప్రతి పౌరుని ప్రాథమిక హక్కుగా గుర్తించాలి. 5. పాఠశాలల సాధారణ విద్య, అనియత విద్యలకు కేంద్ర బిందువుగా వుండాలి. 6. సెకండరీ విద్యలో వృత్తి విద్యకు ప్రాధాన్యతనివ్వాలి. 7. శాస్త్ర, సాంకేతిక విద్యతోపాటు సామాజిక శాస్త్ర పరిశోధనలకు తగు ప్రాధాన్యతనివ్వాలి. 8. వికేంద్రీకరణ, సామాజిక భాగస్వామ్యంవంటి విషయాలలో ఉపాధ్యాయునికి గౌరవనీయమైన పాత్రను కల్పించాలి అనేవి ముఖ్యమైన సూచనలు. ఇంత విలువైన సూచనలను అమలుపరచవలసిన కేంద్ర ప్రభుత్వం ఆ సూచనలను నీరుగార్చేందుకు జనార్ధనరెడ్డి కమిటీ పేరుతో మరో కమిటీని వేసి దానిచే అస్తవ్యస్తమైన సూచనలను చేయించింది. నేటి విద్యారంగం ఎదుర్కొంటున్న అనేక యిబ్బదులను అధిగమించడానికి అత్యంత స్పష్టంగా నున్న రామమూర్తి కమిటీ సిఫారసులను అమలుపరచడానికి కేంద్ర ప్రభుత్వం పూనుకోవాలని యీ మహాసభ డిమాండు చేస్తున్నది.

**9. ఇన్‌కం టాక్స్‌నకు ఆదాయపరిమితి పెంపు:**

1967 నుండి ధరవరలు విపరీతముగా పెరిగినవి. 1969, 1974, 1978, 1986లలో వేతన పునర్నిర్ణయాలు జరిగినవి. పెరిగిన ధరవరల కనుగుణంగా కరువు భత్యము హెచ్చింపు జరుగుచున్నది. ఇంటి అద్దె, ఇతర అలవెన్సు పెంపు జరిగినది. ఈ కారణంగా జీత భత్యముల మొత్తం రూపంలో పొందేసొమ్ము ఉద్యోగి వర్గాలలో కనీసం రు.2,000లుగా వుంది. రూపాయి విలువ ఒకనాటి పదిపైసలు. ఆదాయపు పన్ను చెల్లింపునకు ప్రస్తుతమున్న రు.28,000లు పరిమితి చాలా తక్కువ. కావున ఆదాయపు పన్ను చెల్లింపునకు పరిమితిని రు.50,000లకు పెంచవలసినదిగా ఈ మహాసభ కేంద్ర ప్రభుత్వాన్ని కోరుతున్నది.

**10. పంచాయతీరాజ్ బిల్లు– విద్య:**

అధికార వికేంద్రీకరణ ద్వారా క్రింది స్థాయి నుండి ప్రజల భాగస్వామ్యాన్ని పటిష్ట పర్చాలనే ఉద్దేశ్యంతో పంచాయతీరాజ్ వ్యవస్థ ఆవిర్భవించింది. కానీ ఆచరణలో పంచాయతీరాజ్ వ్యవస్థలకు ఎన్నికలు క్రమబద్ధంగా నిర్వహింపబడుటలేదు. వీటి ఎన్నికలను, పని విధానాన్ని క్రమ బద్ధంచేయాలనే దృక్పథంతో కేంద్ర ప్రభుత్వం పంచాయతీరాజ్ బిల్లును ప్రవేశపెట్టినది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కేంద్రశాసనాన్ని అమలు పరచుటకుగాను ఆంధ్రప్రదేశ్‌లో పంచాయతీరాజ్ వ్యవస్థ స్వరూప స్వభావ, పని విధానములను సూచించుటకుగాను ఒక త్రిసభ్య కమిటీని ఏర్పరచింది. ఆ కమిటీ నివేదిక ఆధారంగా బిల్లును రూపొందించుటకు ప్రయత్నించనున్నది. ప్రాథమిక, ప్రాథమికోన్నత, సెకండరీ పాఠశాలల ఏర్పాటు నిర్వహణ బాధ్యత పంచాయతీసమితులు, జిల్లా ప్రజాపరిషత్తులదనే అభిప్రాయం అనిపిస్తుంది. దీనిలో భాగంగానే ఉపాధ్యాయుల జీతాల చెల్లింపు, సెలవు, ఇంక్రిమెంటు మంజూరీలను, ఆయా స్థాయిలలో ఎన్నికైన ప్రతినిధులకిచ్చిన పరిపాలన పటిష్టవంతమవుతుందని ఆలోచన చేస్తున్నట్లు ప్రకటనలు వస్తున్నాయి.

ఈ పాఠశాలలకు భౌతిక వనరులను కల్పించే బాధ్యత వాటిని ఏర్పాటు చేసిన వారికి ఉండవలసినదే. వానిని పటిష్టత, అభివృద్ధిల విషయముల ఆయా స్థాయిలలో సమీక్షించుట, సూచనలు చేయుటలో వారు భాగస్వాములను చేయుటలో అభ్యంతరముండనవసరంలేదు. కానీ ఆ సంస్థలలో పని చేసే ఉపాధ్యాయుల నెల జీతములు, సెలవు, ఇంక్రిమెంట్ ఇత్యాధి సేవకులకు సంబంధించిన అధికారాలు వారి కప్పజెప్పాలనే ప్రయత్నం, ఆరోగ్యకరమైన అంశం కాదని ఆచరణ, అనుభవము తెలుపుచున్నది. అధికార వికేంద్రీకరణ వలన సాధించదలచిన సత్ఫలితాలకు బదులు వ్యతిరేక ఫలితాలు ఈ ఆలోచనా ధోరణి

వలన కలుగుతాయని ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ తన తీవ్ర వ్యతిరేకతను తెలియజేస్తోంది.

***11.ఫీజుల పెంపుకు నిరసన:***

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ఇంజనీరింగ్ మరియు పాలిటెక్నిక్ కళాశాల విద్యార్థుల ఫీజులను విపరీతంగా పెంచినది. ప్రభుత్వ ఇంజనీరింగ్ మరియు ప్రైవేటు ఇంజనీరింగ్ కళాశాలలోని మొదటి 50శాతము సీట్లలో విద్యార్థికి రు. 3,750/-, మిగిలిన 50 శాతము సీట్లకు విద్యార్థికి రు. 26,250/-లు ఫీజుగా నిర్ణయించారు. పాలిటెక్నిక్ కళాశాలలో కూడా విద్యార్థికి రు. 800/-, రు. 12,200/-గా ఫీజు నిర్ణయించారు. ఈ ఫీజు పెంపు కేంద్ర సాంకేతిక విద్యామండలి అంచనా, ప్రపంచ బ్యాంక్ సిఫారసు మరియు ఝా కమిటీ సిఫారసుల కనుగుణ్యంగా జరిగిందని సమర్థించుకుంటున్నారు.

ఈ రెండు రకముల పెంపు వలన తలసరి సగటు ఫీజు ఇంజనీరింగ్ కళాశాలలో రు. 1,500/-లు, పాలిటెక్నిక్ కళాశాలల్లో తలసరి సగటు రు. 6,500/- అవుతుందని అంగీకరిస్తున్నారు. యాజమాన్యాలు సీటుకు 35,000 ఫీజును నిర్ణయించాలని కోరినను తాము అంగీకరించలేదని సమర్థించుకుంటున్నారు. ప్రైవేటు యాజమాన్యాలు వసూలు చేసే క్యాపిటేషన్ ఫీజును క్రమబద్ధం చేసే చర్యగా దీనిని అభివర్ణిస్తారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తమ చర్యను సమర్థించుకొనుటకు చేసే వాదనలలోనే ప్రతిభ కలవారికి సాంకేతిక విద్యను అందించే బాధ్యత తాము స్వీకరించవలసిన అవసరము తమకు లేదని చెప్పకయే చెప్పుచున్నది. డబ్బున్నవారు మార్కెటులో కొనుగోలు చేయుటకు అభ్యమయ్యే వస్తువుగా విద్యను మార్చినారు.

ఈ చర్య దేశ ప్రగతి, పురోభివృద్ధులకు దోహదపడే చర్యకాదు. ఆర్థికస్థోమతలేని ప్రతిభకల విద్యార్థులు ఈ ఫీజుల పెంపు భారమును మోయగల స్థితిలో లేరు. పరోక్షంగా వారికి కూడా సాంకేతిక విద్య గగన కుసుమమే. కావున ఈ అసాధారణ ఫీజుల పెంపును ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ వ్యతిరేకిస్తోంది. వెంటనే ఈ ఉత్తర్వులను ఉపసంహరించ వలసినదిగా ఈ మహాసభ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తోంది.

***12.పి.ఆర్.సి.లోపాలను సవరించుట:***

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము శ్రీ డి. శంకరగురుస్వామి, ఐ.ఎ.ఎస్.(రిటైర్డ్) గారిని పే రివిజను కమీషనరుగా 16-8-1991న నియమించారు. ఆనాటికే కేంద్ర ప్రభుత్వ సర్వీసులలో వున్నవారికి వేతనములను శ్రీ చటోపాధ్యాయ కమిటీవారి నివేదిక వెలువడినది. దాదాపు 20 నెలల తదుపరి శ్రీ శంకర గురుస్వామిగారు తమ నివేదికను రాష్ట్ర ప్రభుత్వానికి సమర్పించారు. ఒక నెలలోనే రాష్ట్ర ప్రభుత్వము వారి సిఫార్సులను అంగీకరిస్తూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వోద్యోగుల, ఉపాధ్యాయుల వేతనాలను సవరిస్తూ 1993వేతన స్కేళ్ళ ఉత్తర్వునిచ్చారు. ఈ ఉత్తర్వులు గతంలో అనుభవిస్తున్న అనేక సదుపాయాలకు తిలోదకాలు ఇచ్చుటవలన ఉద్యోగులు, ఉపాధ్యాయులలో తీవ్ర అసంతృప్తి రగులుకుంటున్నది. వేతన పునర్విమర్శ, పూర్వ వేతన స్కేళ్ళను మెరుగులు దిద్దేదిగా శాస్త్రీయ పద్ధతులలో జరుగువలసియుండగా అశాస్త్రీయ పద్ధతులలో తిరోగమన మార్గాన్ని అనుసరించినది. ఉద్యోగ నియామక వయోపరిమితి 25 సం||లనుండి 34సం||లకు పెంపు చేస్తూ తీసికొన్న చర్యలకనుగుణముగా ఈ నూతన వేతన స్కేళ్ళ ఉత్తర్వులు లేవు. ఉద్యోగుల, ఉపాధ్యాయుల అసంతృప్తికి గల సహేతుకతను దృష్టిలో తెచ్చుకొని 1993 వేతన స్కేళ్ళ ఉత్తర్వులలో దిగువ పేర్కొన్న కనీస మార్పులను చేయవలసినదిగా ఈ మహాసభ ఏకగ్రీవంగా డిమాండ్ చేస్తున్నది.

1. వేతన స్కేళ్ళ నిడివిని పై 24 సంవత్సరాల నుండి 15 సంవత్సరములకు తగ్గించాలి.
2. 1-7-1992నాటి కరువు భత్యాన్ని పూర్తిగా మూలవేతనములో విలీనము చేసి రూపొందించిన స్కేళ్ళు కావున వీనిని 1-7-1992 నుండి ఆర్థిక లాభముతో సహా అమలు చేయాలి.
3. నూతన వేతనస్కేళ్ళలో ఆటోమేటిక్ అడ్వాన్సుమెంటు స్కేలుగా వున్న దానిని 7-14-21 సంవత్సరము స్కేలుగా మార్చాలి.
4. ఏ వేతన స్కేలులోనైనా గరిష్ఠ పరిమితి చేరినవారికి గతంలో వలెనే స్టాగ్నేషన్ ఇంక్రిమెంట్ల సౌకర్యాన్ని పునరుద్ధరించాలి.
5. అదనపు అర్హతలు సంపాదించిన వారికి అదనపు ఇంక్రిమెంట్ల సౌకర్యాన్ని పునరుద్ధరించాలి.
6. నూతన వేతన స్కేళ్ళలో ఇంటి అద్దె అలవెన్సులను 16 శాతము, 10 శాతము, 8 శాతమునకు బదులుగా పూర్వపు రేట్లు 20 శాతము, 12.5 శాతము, 10 శాతము ఇవ్వాలి.
7. రిటైర్మెంటు సందర్భంలో చెల్లించే గ్రాట్యూటీని లక్ష రూపాయల పరిమితితో 16 1/2 నెలల జీతముగా ప్రస్తుతమున్న ఉత్తర్వులనే 1993 వేతన స్కేళ్ళలో కూడా అనుమతించాలి. అదేవిధంగా క్రిందిస్థాయిలో చివరినెల జీతానికి 20 రెట్లుగానున్న గ్రాట్యూటీ సౌకర్యాన్ని రు. 75వేల పరిమితితో కొనసాగించాలి.
8. ఫ్యామిలీ ప్లానింగ్, ఇన్సెంటివ్, అదనపు అర్హతల ఇంక్రిమెంట్లు, స్పెషల్ పే, పర్సనల్ పే మొదలగు వానిపై 1993 వేతన స్కేళ్ళలో కూడా కరువు భత్యం, ఇంటి అద్దె అలవెన్సులను అనుమతించాలి.

***13.విద్య–కేటాయింపులు:***

విద్యపై పెట్టుబడి జాతీయ ఉత్పత్తికి దోహదకారి. ఉత్పత్తి సాధనాల ప్రమాణాల పెంపుదలకు ఉత్పత్తి శక్తుల సామర్థ్యం పెరుగుదలకు విద్య దోహదకారి. అట్టి విద్యపై ప్రణాళిక-ప్రణాళికేతర పెట్టుబడులను పెంచవలసియున్నది. అత్యధిక అక్షరాస్యతను సాధించిన రాష్ట్రాలలో విద్యపై పెట్టుబడి వార్షిక బడ్జెట్‌లో 40 శాతంకాగా ఆంధ్రప్రదేశ్ వార్షిక బడ్జెట్‌లో అది 25 శాతం మించుటలేదు. పశ్చిమబెంగాల్ వంటి ప్రభుత్వాలు విద్యపై గత 4 సంవత్సరాల కాలంలో ప్రణాళిక, ప్రణాళికేతర పెట్టుబడులను రెట్టింపుకంటే అధికంగా పెంచగా మన రాష్ట్రంలో పెట్టుబడుల పెరుగుదల నామమాత్రంగానే యున్నది. పశ్చిమ బెంగాల్ వంటి రాష్ట్రాలను ఆదర్శంగా తీసికొని మన రాష్ట్రంలో విద్యాభివృద్ధికి విద్యపై కేటాయింపు వార్షిక బడ్జెట్ 35 శాతం ఉండునట్లు చేయవలసినదిగా ఈ మహాసభ విజ్ఞప్తి చేస్తోంది. ప్రాథమిక, సెకండరీ, విశ్వ విద్యాలయాల విద్యలకు బడ్జెట్ కేటాయింపులు 3:2:1 నిష్పత్తి ఉండాలని కోరుతోంది.

***14.ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి:***

ప్రాథమిక, సెకండరీ స్థాయిలో విద్యా ప్రమాణాల పెరుగుదలకు, వ్యక్తిగత శ్రద్ధ చూపవలసియున్నది. తరగతి విద్యార్థుల సంఖ్య అధికంగానున్న వ్యక్తిగత అభిరుచులను వెనుకబడిన విద్యార్థులయెడ ప్రత్యేక శ్రద్ధ చూపుట సాధ్యంకాదు. కావున ఉపాధ్యాయినీ, విద్యార్థి నిష్పత్తి మైదాన ప్రాంతాలలో ప్రాథమిక, సెకండరీ స్థాయిలలో 1:20 మరియు 1:30 గాను, ఏజెన్సీ ప్రాంతంలో 1:10 మరియు 1:15 గాను ఉండాలని అనుభవము చాటి చెప్పుచున్నది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ఈ విషయాన్ని పరిశీలించి ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తిని పై సూచన మేరకు సవరించవలసినదిగా ఈ మహాసభ విజ్ఞప్తి చేస్తోంది.

*15. ఏకోపాధ్యాయ పాఠశాలలను బహుళ ఉపాధ్యాయుల పాఠశాలలుగా మార్పుట:*

ఆపరేషన్‌బ్లాక్ బోర్డు పథకం ప్రకారం ప్రతి పాఠశాలను బహుళోపాధ్యాయ పాఠశాలలుగా మార్చాలనేది లక్ష్యం. ఆచరణలో ఈ నాటికి అనేకం ఏకోపాధ్యాయ పాఠశాలలుగానే యున్నవి. ఈ పాఠశాలలో ఒకే ఉపాధ్యాయుడు 1 నుండి 5తరగతుల వరకు విద్యను గరపవలసియున్నది. ఇది అత్యంత నష్టదాయకము. ఈ స్థితి మారాలంటే ఏకోపాధ్యాయ పాఠశాలలన్నింటినీ బహుళోపాధ్యాయ పాఠశాలలుగా మార్చాలని ఈ మహాసభ పక్షాన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతున్నాము.

*16. మాతృభాషలోనే విద్యాబోధన:-*

విద్యాబోధన మాతృభాష ద్వారానే సులభమనే అంశం అందరూ అంగీకరించిన విషయమే. విద్యార్థి పాఠశాలలో బోధించే వివిధ అంశములను మాతృభాష ద్వారా బోధనలో త్వరలో ఆకళింపు చేసికొనగలడు. ఇంగ్లీషు మీడియం పాఠశాలల వ్యామోహంలో కొందరు కొట్టుకుపోతున్నారు. ఈ వైఖరి సరైనదికాదు. కావున ప్రాథమిక స్థాయినుండి విశ్వవిద్యాలయ స్థాయి వరకు మాతృ భాష ద్వారానే బోధన జరపాలని ఈ మహాసభ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతోంది.

*17. పాఠశాలల భౌతిక వనరులు:*

రాష్ట్రములో నున్న వివిధ యాజమాన్యాల క్రింద నున్న వేలాది పాఠశాలలు కనీస భవన వసతి, లైబ్రరీ, లేబరోటరీ, ఆటస్థలము, ఫర్నిచరు, త్రాగునీరు మొదలుగాగల భౌతిక వసతులు లేకుండా నడపబడుతున్నవి. సాంకేతిక పరిజ్ఞానం పెరిగిన ఆధునికయుగంలో కూడా పాఠశాలల దుస్థితి ఈ విధంగా నుండుట అత్యంత విచారకరమైన అంశము. కావున రాష్ట్ర ప్రభుత్వం పాఠశాలలో కనీస భౌతిక వనరుల కల్పనకు యుద్ధ ప్రాతిపదికపై చర్యలు చేపట్టవలసినదిగా ఈ మహాసభ కోరుతున్నది.

*18. పాఠ్య గ్రంథముల సరఫరా:*

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము పాఠ్య గ్రంథముల ప్రచురణను జాతీయం చేసింది. పాఠ్యపుస్తకముల సరఫరాను తానే స్వయంగా చేపట్టినది. పాఠశాలలో ఎస్.సి., ఎస్.టి., బి.సి., విద్యార్థులకు పాఠ్యపుస్తకాలను ప్రభుత్వ పుస్తక విక్రయశాలల నుండి పాఠశాలల ద్వారా వారి సొంత ఖర్చుపై సరఫరా చేయుచున్నారు. వారిలో కూడా ఆర్థిక స్థితిగతులు సరిగా లేక సకాలములో పుస్తకాలు కొనలేక ఇబ్బంది పడుచున్నారు.

రాష్ట్రంలోని అన్ని పాఠశాలలో చదువుచున్న బాల బాలికలకు పాఠ్యగ్రంథములు ఉచితంగా సరఫరా చేసినా అగు ఖర్చు 10-15 కోట్ల రూపాయలకు మించదు. వేసవి సెలవులకు పూర్వమే రాబోవు విద్యాసంవత్సరమునకు అవసరమైన పాఠ్యపుస్తకముల సంఖ్య అంచనావేసి, ముద్రించి నేరుగా అందరు విద్యార్థులకు ఉచితంగా సరఫరా చేయుటకు తగిన చర్యలు తీసుకోవలసినదిగా విజ్ఞప్తి చేస్తున్నాము.

*19.పాఠశాలలో బోధనావసరాల ప్రకారము ఉపాధ్యాయుల నియామకము:*

రాష్ట్రంలో నేడు పాఠశాలలకు వస్తున్న విద్యార్థుల కనుగుణంగా ఉపాధ్యాయుల నియామకము జరగుట లేదు. ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాలలో ముఖ్యమైన విషయములను ఉపాధ్యాయుల కొరత అధికంగా ఉన్నది. పాఠశాలలు పటిష్టముగా పనిచేయుటకు ఉపాధ్యాయులు నియామకము దిగువ పేర్కొన్న విధంగా జరగాలి.

1. ఏకోపాధ్యాయ పాఠశాలలో తక్షణమే రెండవ ఉపాధ్యాయుని పోస్టును మంజూరు చేయాలి.

2. 1నుండి 5 తరగతులు గల పాఠశాలలో తరగతికి 20మించి విద్యార్థులున్న కనీసము 5గురు ఉపాధ్యాయులను నియమించవలెను.

3. ప్రాథమికోన్నత పాఠశాలలో 5గురు టి.టి.ఐ ఉపాధ్యాయులు, ఇరువురు బి.ఇడిలు, తెలుగు, హిందీ రెండవ శ్రేణి పండితులు, ఒక పి.ఇ.టి.ని, స్వీపేటర్స్‌గా గుర్తించి పోస్టులు మంజూరు చేయాలి.

4. ఉన్నత పాఠశాలలకు స్టాఫ్ ప్యాటర్నును విధిగా పాటించాలి. 400 మంది విద్యార్థులకు మించి విద్యార్థులున్న ఉన్నత పాఠశాలలకు రెండవ పి.యి.టి.ని ఇవ్వాలి. 700కు మించి విద్యార్థులున్న పాఠశాలలకు ఫిజికల్ డైరెక్టర్ పోస్టులను మంజూరు చేయాలి.

*20. మధ్యాహ్న భోజన పథకం ప్రారంభించాలి:*

పేదరికము కారణంగా ప్రాథమిక పాఠశాలలో చేరిన విద్యార్థులలో 80శాతము పైగా సెకండరీ విద్యాస్థాయి వరకు కొనసాగుటలేదని గణాంక వివరాలు తెలియజేస్తున్నవి. దేశంలో 50శాతంపైగా ప్రజానీకము దారిద్ర్యరేఖ దిగువననే బ్రతకుతున్నారు. ఆ కుటుంబాల వారు తమ పిల్లలను పోషించజాలక వారి పోషణ నిమిత్తము ఏదో ఒక వృత్తిలో పెడుతున్నారు. ఈ కుటుంబాల నుండి బడికి వచ్చే పిల్లలలో పోషకాహార లోపము కొట్టవచ్చినట్లు కానవచ్చుచున్నది. నూటికి నూరు శాతము పిల్లలను బడికి ఆకర్షించేటట్లు పోషకాహార లోపాన్ని పిల్లలలో నివారించుటకు మధ్యాహ్న భోజనపథకం అవసరము. పొరుగు రాష్ట్రమైన తమిళనాడును ఆదర్శంగా తీసుకొని మధ్యాహ్న భోజన పథకాన్ని మన రాష్ట్రంలోని ప్రాథమిక, ప్రాథమికోన్నత, సెకండరీ పాఠశాలలో ప్రారంభించ వలసినదిగా ఈ మహాసభ కోరుతోంది.

*21. పాఠశాలల స్పెషల్ ఫీజు రీఇంబర్స్‌మెంట్ జరగాలి:*

ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాలలో కోకరిక్యులర్ ఎక్స్‌ట్రా కరిక్యులర్ కార్యక్రమాల నిర్వహణ నిమిత్తము విద్యార్థుల నుండి వసూలు చేయు స్పెషల్‌ఫీజును ఎస్.సి., ఎస్.టి., బి.సి., విద్యార్థులకు మినహాయిస్తున్నారు. వీరు పాఠశాల విద్యార్థుల సంఖ్యలో 60శాతం పైగా ఉంటున్నారు. ఈ కారణంగా ఆకార్యక్రమముల నిర్వహణకు వసూలయ్యే నిధులు గణనీయంగా తగ్గి ఆ కార్యక్రమాల నిర్వహణ కుంటుపడుతున్నది. ఎస్.సి., ఎస్.టి., బి.సి. విద్యార్థులకు ఇచ్చే మినహాయింపును విధిగా ప్రతి సంవత్సరము ఆగస్టు నెల చివరి నాటికి ప్రభుత్వము వారు తిరిగి చెల్లించుటకు సత్వర చర్యలు తీసుకోవలసినదిగా ఈ మహాసభ కోరుతోంది.

*22. కంటింజన్సీల చెల్లింపు రేటును పెంచుట:*

ప్రస్తుతము పాఠశాలలకు చెల్లిస్తున్న కంటింజెన్సీలు స్వల్పము. యాజమాన్యాలకు వేతనాలలో 6శాతాన్ని కంటింజెంటు గ్రాంటుగా ఇస్తున్నారు. పెరిగిన, పెరుగుతున్న ధరలలో ఈ కేటాయింపు అవసరాలను ఆదుకొనుటకు చాలదు. కావున కంటింజెన్సీలను 10శాతము వంతున విడుదల చేయాలని ఈ మహాసభ కోరుతోంది.

*23. రిఫ్రెషర్ కోర్సులు:*

సాంకేతిక పరిజ్ఞానము దిన దినాభివృద్ధి చెందుతున్నది. అనేక నూతనాంశములు సిలబస్‌లో చోటు చేసుకొంటున్నవి. ఆధునిక బోధనా పద్ధతులలో అనేక మార్పులు వస్తున్నవి. ఈ మార్పులు అన్నింటితో ఉపాధ్యాయుడు పరిచయము కావలసి

యున్నది. తాను నిరంతర అధ్యయనాల, పరిశోధన ద్వారా తన బోధనా పద్ధతులను పెంచుకొనవలసి యున్నది కావున, ప్రతి మూడు సంవత్సరములకొకసారి రిఫ్రెషర్ కోర్సును ఉపాధ్యాయులకు నిర్వహించాలని ఈ మహాసభ కోరుతోంది.

[illegible]

**24. బోనస్ చెల్లింపు:** ఉత్పాదనా కార్యక్రమములో పాల్గొనే పారిశ్రామికకార్మికులు కేంద్ర ప్రభుత్వోద్యోగులకు బోనస్ చెల్లిస్తున్నారు. కనీస బోనస్‌ను 81/3 శాతంగా నిర్ణయించారు. విద్యారంగాన్ని ఉత్పాదనా రంగంగానే పరిగణించాలి. ఉపాధ్యాయవృత్తిని సాంకేతిక వృత్తిగా పరిగణించాలి. ఇతర రంగాలలో బోనస్ చెల్లింపు నెల జీతము కంటే అధికంగా ఇస్తున్నారు. బోనస్‌ను వాయిదా పడిన వేతనముగా గుర్తించారు.

ఉపాధ్యాయులకు సంవత్సరమునకుఒక నెల జీతము బోనస్ ఇవ్వవలసిందిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని ఈ మహాసభ డిమాండ్ చేస్తున్నది.

**25. ఎల్.టి.సి. చెల్లింపు:**

ఉపాధ్యాయులు ఆధునిక విజ్ఞానాన్ని పెంపొందించుకోవాల్సి వుంది. ప్రాథమిక, సాంకేతిక, చారిత్రక స్థలాలను సందర్శించుట ద్వారా ప్రత్యక్షంగా సంపాదించే జ్ఞానమున్నది. పర్యటనల ద్వారా తాము సంపాదించిన విజ్ఞానము బోధనలో ఎంతో ఉపకరిస్తుంది. ఎల్.టి.సి. సౌకర్యాన్ని వినియోగించుకొనదల్చిన వారికి పాస్ పద్ధతి ద్వారా అమలు చేయవలసినదిగా ఈ మహా సభ కోరుతోంది.

**26. ఉపాధ్యాయుల పిల్లలకు ఉచిత విద్యా సౌకర్యము:**

ఉపాధ్యాయుల పిల్లలకు కాలేజీ, టెక్నికల్, ప్రొఫెషనల్ విద్యనుచితముగా అభ్యసించే సౌకర్యాన్ని కలుగజేయాలని ఈ మహాసభ కోరుతోంది.

**27. బస్ పాస్ సౌకర్యము:**

నాన్‌గెజిటెడ్ ఉద్యోగులకు వలె ఉపాధ్యాయులకు బస్ పాస్ సౌకర్యాన్ని కలుగ చేయాలని ఈ మహాసభ కోరుతోంది.

**28. ఎయిడెడ్ ఉపాధ్యాయులకు జీతాల చెల్లింపు:**

ఎయిడెడ్ పాఠశాలలో పని చేసే ఉపాధ్యాయ, ఉపాధ్యాయేతర సిబ్బంది జీతాల చెల్లింపుకు ప్రభుత్వము గ్రాంట్ విడుదల చేయాలి. గ్రాంట్ విడుదలలో జరిగే ఆలస్యం వలన వారు మిగిలిన ఉపాధ్యాయుల వలె ప్రతీ నెల జీతాలు సక్రమంగా పొందలేకపోతున్నారు. బడ్జెట్ కేటాయింపుతో నిమిత్తము లేకుండా ఎయిడెడ్ ఉపాధ్యాయులు ప్రతీ నెల మొదటి తేదీన జీతాలు తీసుకొనుటకు కేరళ పద్ధతిలో ఏర్పాటు చేయవలసినదిగా ఈ మహాసభ కోరుతున్నది.

**29. అప్ గ్రేడ్ పండితులకు ఎఫ్.ఆర్.22బి వర్తింపు చేయుట:**

జి.ఓ. 330 ప్రకారము గ్రేడు-టీలీ పోస్టులో పనిచేస్తూ గ్రేడ్-టీ అర్హతలను పండితులు 10-8-83 నుండి గ్రేడ్-I స్కేలు పొందుతున్నారు. వారు గ్రేడ్-I పోస్టులో అబ్జార్బు అయినప్పుడు అదనపు బాధ్యతలను నిర్వహించవలసి వుంటుంది. అందుచే వారికి కూడా ఎఫ్.ఆర్. 22బి ననుసరించి వేతన స్థిరీకరణ జరగడం సమంజసం. కనుక వారికి ఎఫ్.ఆర్. 22బి వర్తించు విధముగా ఉత్తర్వులివ్వాలని యీ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతోంది.

**30. ఆర్ట్, క్రాఫ్ట్, హైయ్యర్ గ్రేడ్ ఉపాధ్యాయులకు అదనపు ఇంక్రిమెంట్లు:**

ఆర్ట్, క్రాఫ్ట్ మొదలగు ఉపాధ్యాయులు సంపాదించిన అదనపు అర్హతలకు సబ్జక్టు రిలవెన్సీ లేదనే నెపంతో అదనపు యింక్రిమెంట్ల సౌకర్యం కల్పించబడలేదు. మిగిలిన క్యాడర్ల వారికిచ్చిన విధంగానే వీరికి కూడా కనీస ప్రోత్సాహకంగా అదనపు అర్హతలకు అదనపు యింక్రిమెంట్లను అనుమతించాలని, అందుకు అడ్డంకిగా వున్న సబ్జక్టు రిలవెన్సు అనే షరతును తొలగించాలని యీ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతున్నది. అదే విధంగా హైయ్యర్ గ్రేడ్ ఉపాధ్యాయులకు కూడా సరియైన కారణం లేకుండానే యివ్వకుండా వున్న అదనపు అర్హతలకు అదనపు యింక్రిమెంట్ల సౌకర్యాన్ని వర్తింప చేయాలని యీ మహాసభ కోరుతోంది.

**31. పదోన్నతికి సమాన అవకాశం అందిరికి కల్పించాలి**

ప్రభుత్వం, పంచాయతీ రాజ్ ఉపాధ్యాయుల సర్వీసు నిబంధనలను నిర్దేశిస్తున్న జి.ఓ. 40విద్య, తేదీ: 7-2-92 ప్రకారము క్రింది క్యాడర్లకు చెందిన ఉపాధ్యాయులకు ప్రాధాన్యతా క్రమములో ప్రమోషన్ అవకాశముంటుంది. ఆకారణంగా ఆచరణలో ప్రాధాన్యత క్రమములో పై నున్న క్యాడర్ల వారికి ఎప్పుడు ప్రమోషన్లు లభించడం, ఆక్రమములో అట్టడుగున వున్నక్యాడర్ల వారికి ఎంత సర్వీసు ఉన్నా ప్రమోషన్లు లభించకపోవడం జరుగుతున్నది. కనుక ఒక ప్రమోషన్‌పోస్టు యొక్క ఫీడర్ క్యాటగిరీలన్నింటికి చెందిన ఉపాధ్యాయులందరి కామన్ సీనియారిటీ ననుసరించి ప్రమోషన్ అవకాశం కల్పిస్తూ జి.ఓ. 40కు సవరణ ఉత్తర్వులివ్వవలసినదిగా యీ మహాసభ రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరుతోంది.

**32. మున్సిపల్ ఎయిడెడ్ ఉపాధ్యాయుల పి.ఎఫ్.పై వడ్డీ పెంపుదల:**

ప్రభుత్వ, ఎం.రాజ్ ఉపాధ్యాయులు యితర ఉద్యోగులతో సమానంగా తమ పి.ఎఫ్. ఖాతాలపై 12% వడ్డీ పొందుతుంటే, మున్సిపల్ మరియు ఎయిడెడ్ ఉపాధ్యాయులు తమ పి.ఎఫ్. నిల్వలపై కేవలం 4% వడ్డీని మాత్రమే పొందుచున్నారు. దీని వలన వారు ఆర్థికంగా చాలా నష్టపోతున్నారు. కనుక మున్సిపల్, ఎయిడెడ్ ఉపాధ్యాయుల పి.ఎఫ్. నిల్వలపై వడ్డీ రేటు జి.పి.ఎఫ్. వడ్డీ రేటుతో సమాన పరచడానికితగిన చర్యలు తీసుకొనవలసిందిగా యీ మహాసభ ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తోంది. అదే విధంగా మున్సిపల్ యాజమాన్యములోని ఉపాధ్యాయుల పి.ఎఫ్. నిల్వలను యితరత్రా వాడుకొనడం వలన వారు రిటైరైనప్పుడు సకాలంలో చెల్లింపులు జరగడంలేదు. అందుచే వారి పి.ఎఫ్. నిల్వలను ప్రత్యేకంగా వుంచే విధంగా తగినచర్యలను తీసుకొనవలసిందిగా యీ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతున్నది.

**33. డిపార్టుమెంట్ పరీక్షా ఫలితాల ప్రచురణ:**

ఆం॥ ప్ర॥ పబ్లిక్ సర్వీసు కమీషన్ నిర్వహిస్తున్న డిపార్టుమెంటల్ పరీక్షా ఫలితాలు సులభంగా తెలుసుకునే విధంగా ప్రకటించకపోవడం, వాటిని సంవత్సరాల తరబడి గజిట్‌లో ప్రచురించక పోవడం జరుగుతున్నది. దీని వలన అనేకమంది ఉపాధ్యాయులు తమ ప్రమోషను అవకాశాలను కోల్పోతున్నారు. మానసిక ఒత్తిడికి గురౌతున్నారు. కనుక డిపార్టుమెంట్ పరీక్షా ఫలితాలను అన్ని దినపత్రికలలో ప్రచురించడంతో పాటు వెంటనే పాస్ సర్టిఫికెట్లు యిచ్చే విధంగా తగిన చర్యలు తీసుకోవాలని రాష్ట్ర ప్రభుత్వాన్ని యీ మహాసభ కోరుతోంది.

**34. జీతాలపై బడ్జెట్ కంట్రోల్ తొలగింపు:**

మున్సిపల్ ఎయిడెడ్ ఉపాధ్యాయుల జీతాలపై బడ్జెట్ కంట్రోల్‌ను తొలగించి వారికి నెలనెలా జీతాలు సకాలంలో చెల్లించే లాగున చర్యలు తీసుకోవాలని యీ మహాసభ రాష్ట్ర ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తోంది.

**35. సెలవు నిబంధనల సవరణ:**

1. ఎయిడెడ్ ప్రాథమిక ఉపాధ్యాయులకు 1933 శెలవు నిబంధనలను

వర్తింపజేస్తూ ఉత్తర్వులు యివ్వాలని యీ మహాసభ కోరుతోంది.

2. మహిళా ఉపాధ్యాయులకు మెటర్నటీ లీవు సౌకర్యాన్ని కలుగజేయవలసిందిగా ఈ మహాసభ కోరుతోంది.

3. జీతభత్యములు పొందే సంపాదిత సెలవు, సగము జీతము సెలవు, ప్రైవేటు కారణముల సెలవును 300 దినముల వరకు ఒకేపర్యాయము వాడుకొనుటకు అవకాశము కల్పించాలని ఈ మహాసభ కోరుతోంది.

4. ఉపాధ్యాయులకు సంవత్సరానికి 20 రోజులు సంపాదిత సెలవు సౌకర్యాన్ని కలుగజేయాలి. ఈ అంశములో తమిళనాడు ప్రభుత్వము అనుసరిస్తున్న విధానాన్ని పరిశీలించి తగు ఉత్తర్వులీయవలసినదిగా ఈ మహాసభ కోరుతోంది.

5. సెకండరీ పాఠశాలలో ప్రధానోపాధ్యాయుడుకు, గుమాస్తా, అటెండరు, వాచ్‌మెన్ పోస్టులను నాన్ వెకేషన్ పోస్టుగా పరిగణించి సంపాదిత సెలవు సౌకర్యాన్ని కలుగజేయవలసిందిగ ఈ మహాసభ కోరుతోంది.

6. ఉపాధ్యాయులకు తమ సేవల కాలంలో వున్నత విద్యాభ్యాసమునకు కనీసము 2సం॥ల స్టడీ లీవు సౌకర్యాన్ని కలుగజేయవలసిందిగా ఈ మహాసభ విజ్ఞప్తి చేస్తోంది.

7. ఉద్యోగి సేవా కాలంలో 3సంవత్సరాల జీతభత్యములు లేని సెలవు పెన్షనుకు అర్హమైన సేవలుగా గుర్తించవలసినదని ఈ మహాసభ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తోంది.

### 36. పెన్షను నిబంధననలలో మార్పులు:

1. గ్రాట్యుటీ చెల్లింపునకు చివరి నెల జీతాన్ని పరిగణనలోకి తీసికొనిన విధంగానే ఉద్యోగి చివరి నెలలో పొందిన జీతము ప్రాతిపదికగానే పెన్షను ఇవ్వాలని ఈ మహాసభ కోరుతోంది.

2. పెన్షను కమ్యూనికేషను రేట్లు 50 సంవత్సరముల నాడు నిర్ణయించినది. ఈ 50 సంవత్సరాల కాలంలో రూపాయి విలువ దారుణంగా పడిపోయినది. ఈ నాటి రూపాయివిలువ 1962 నాటి విలువలో 8.పైగా అధికారిక లెక్కలే చెప్పుచున్నవి. కావున ప్రస్తుతము అమలులో వున్న పెన్షను కమ్యూనికేషన్ రేట్లను పెంచవలసిందిగా ఈ మహాసభ కోరుతోంది.

3. కనీస పెన్షను వెయ్యి రూపాయలుగా మార్పు చేయవలసినదిగా ఈ మహాసభ కోరుతోది.

4. 25 సంవత్సరముల సేవలను పూర్తి చేసి స్వచ్ఛంద పదవీ విరమణ చేయగోరు ఉద్యోగికి చివరి నెల జీతములో పెన్షను ఇవ్వాలని (పూర్తి) ఈ మహాసభ కోరుతోంది.

5. ఉద్యోగి మరణ కాలము నాటి జీతములో 40శాతమును ఫ్యామిలీ పెన్షనుగా నివ్వాలని ఈ మహాసభ కోరుతోంది.

6. రికగ్నైజ్డు పాఠశాలలో పనిచేసిన అన్ ఎయిడెడ్ సర్వీసును కూడా పెన్షను చెల్లింపు పరిగణనలోనికి తీసుకోవాలని ఈ మహాసభ కోరుతోంది.

7. విద్యా సంవత్సరంలో అక్టోబరు ముందు రిటైర్డు అగువారిని విద్యాసంవత్సరాంతము వరకు సేవలలో కొనసాగించాలని ఈ మహాసభ విజ్ఞప్తి చేస్తోంది.

8. ఉద్యోగి పదవీ విరమణ తేదీ నాటికి అతనికి చెల్లించవలసిన పదవీ విరమణ ఫలితాలను, పెన్షను మంజూరు చేయాలని ఈ మహాసభ కోరుతున్నది.

### 37. గిరిజన సంక్షేమ పాఠశాలల ఉపాధ్యాయుల సమస్యలు

1. గిరిజన సంక్షేమ పాఠశాలలో నియమించబడి సంవత్సరముపైగా సేవలను పూర్తి చేసిన ఉపాధ్యాయులందరి సేవలను క్రమబద్ధీకరణ చేయాలని ఈ మహాసభ కోరుతోంది.

2. శిక్షణ పొందని గిరిజన సంక్షేమ పాఠశాలల ఉపాధ్యాయులకు శిక్షణాసౌకర్యాన్ని కలుగజేయాలని ఈ మహాసభ డిమాండ్ చేస్తోంది.

3. గిరిజన సంక్షేమ పాఠశాలలో పనిచేస్తున్న ఉపాధ్యాయులకు సర్వీసు రూల్సు రూపొందించి పదోన్నతి సౌకర్య నిమిత్తము ఎడ్యుకేషన్ సబార్డినేట్ సర్వీస్ రూల్సులో పార్టు -సిగా చేర్చాలని ఈ మహాసభ డిమాండ్ చేస్తోంది.

4. గిరిజన సంక్షేమ పాఠశాలలో పనిచేస్తున్న అన్ని కేటగిరీల ఉపాధ్యాయుల సమగ్ర సీనియారిటీ జాబితాల ప్రకటనకు ఉత్తర్వులు ఇవ్వవలసిందిగా ఈ మహాసభ విజ్ఞప్తి చేస్తోంది.

5. గిరిజన సంక్షేమ పాఠశాలల్లో పనిచేస్తున్న ఉపాధ్యాయుల సమస్యలను - పాఠశాలల అభివృద్ధిని గూర్చి చర్చించి తగు చర్యలు తీసుకొనే నిమిత్తము జిల్లా రాష్ట్ర స్థాయిల్లో 3 నెలలకొక పర్యాయము సమన్వయ సంఘ సమావేశములను జరుపుటకు తగు చర్యలు తీసుకొనవలసిందిగా ఈ మహాసభ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తోంది.

6. గిరిజన సంక్షేమ ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాలల ప్రధానోపాధ్యాయులకు సిబ్బంది జీతము, అరియర్లు, కంటింజెన్సీలను నేరుగా ట్రెజరీలనుండే పొందే అధికారాలను (డ్రాయింగ్ పవర్స్) కలుగజేసే ఉత్తర్వుల నియ్యవలసినదిగా ఈ మహాసభ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతోంది.

7. ప్రభుత్వ ఉపాధ్యాయులకు వర్తించే అన్నిరకములైన సంక్షేమ పథకాలను గిరిజన సంక్షేమ పాఠశాలలకు వర్తింపచేయవలసినదిగా ఈ మహాసభ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతోంది.

8. గిరిజన ప్రాంతాలలో పనిచేసే ఇతర ఉద్యోగులకిచ్చే అన్నిరకాల సదుపాయాలను గిరిజన సంక్షేమ పాఠశాల ఉపాధ్యాయులకు కలుగజేయవలసినదిగా ఈ మహాసభ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతోంది.

### 38. సాంఘిక సంక్షేమ పాఠశాలల ఉపాధ్యాయుల సమస్యలు

1. సాంఘిక సంక్షేమ పాఠశాలలో 1984 నుండి నియమింపబడిన ఉపాధ్యాయులందరి సేవలను క్రమబద్ధం చేయవలసినదిగా ఈ మహాసభ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తోంది.

2. సాంఘిక సంక్షేమ పాఠశాలలో పనిచేస్తున్న అన్ని కేటగిరీల ఉపాధ్యాయుల సీనియారిటీ జాబితాలను వెంటనే ప్రకటించవలసినదిగా ఈ మహాసభ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతోంది.

3. సాంఘిక సంక్షేమ పాఠశాలలో పనిచేస్తున్న ఉపాధ్యాయులకు జి.పి.ఎఫ్., జి.ఎస్.ఐ. పథకాలను అమలు పరచవలసిందిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని ఈ మహాసభ కోరుతోంది.

4. సాంఘిక సంక్షేమ పాఠశాలలలో పనిచేస్తున్న ఉపాధ్యాయులకు ఆంధ్రప్రదేశ్ 1933 సెలవు నిబంధనలు వర్తింపచేస్తూ ఉత్తర్వులీయవలసినదిగా ప్రభుత్వాన్ని ఈ మహాసభ కోరుతోంది.

5. సంక్షేమ పాఠశాలల ఉపాధ్యాయుల జీతాల స్కేళ్ళల్లోనున్న అసంబద్ధాలను తొలగిస్తూ ఉత్తర్వులీయవలసిందిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని ఈ మహాసభ కోరుతోంది.

6.సాంఘిక సంక్షేమ పాఠశాలల్లో పనిచేస్తున్న ఉపాధ్యాయులకు ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీమును వర్తింప చేస్తూ ఉత్తర్వులీయవలసినదిగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని ఈ మహాసభ కోరుతోంది.

7. సాంఘిక సంక్షేమ పాఠశాలల్లో పనిచేసే ఉపాధ్యాయులకు ప్రభుత్వ ఉపాధ్యాయులకు వర్తింపచేసే అన్ని సౌకర్యాలను వర్తింప చేయాలనిఈ మహాసభ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతోంది.

### 39. ఫ్యాప్టో – జాక్టా ఒప్పందాలు

ఉపాధ్యాయుల మస్యలపై ఫ్యాప్టో-జాక్టాల ఆందోళన సందర్భంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు అంగీకరించిన అంశములనేకములున్నవి. వాటిపై ఉత్తర్వులనిస్తామని హామీలను ఇచ్చారు. ఆ సమస్యలన్నింటిపై సత్వరమే ఉత్తర్వులీయవలసినదిగా ఈ మహాసభ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారిని కోరుతోంది.



# 1993 పే స్కేలు-ఉపాధ్యాయుల ఆటోమేటిక్ అడ్వాన్స్ మెంట్ స్కీము - వివరణ



1981లో 1978 స్కేళ్ళనందు ఎన్.జి.జి.వో.లకు ప్రారంభించిన ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ పథకం తేది 1.12.182 నుండి ఉపాధ్యాయులకు కూడా వర్తింప చేయబడింది. ఈ పథకంలో 1986 పే స్కేళ్ళలోను, 1993 స్కేళ్ళలోను అనేక మార్పులు చేయబడ్డాయి. 1978 స్కేళ్ళలో 10,15 సంIIరముల స్కేళ్ళు అనగా స్పెషల్ గ్రేడ్ , స్పెషల్ ప్రమోషన్ పోస్టు స్కేళ్ళకే ఈ పథకం పరిమితమైంది. 1986 స్కేళ్ళలో22 సంIIరముల సర్వీసును పూర్తి చేసిన వారికి, స్పెషల్‌ప్రమోషన్‌పోస్టు స్కేలు II అను పేరుతో మరొక ప్రమోషన్ స్కేలు కూడా ఇవ్వబడింది. అలాగే ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీం సౌకర్యం అనుభవిస్తూ రెగ్యులర్ ప్రమోషన్ పొందినప్పుడు ఎఫ్.ఆర్22 బి సౌకర్యం కూడా వర్తింజేయబడింది. అలాగే ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీమ్‌లో ఫిక్సేషన్ జరిగిన తర్వాత పాత ఇంక్రిమెంట్లు తేదీకి యింక్రిమెంటు కూడా యివ్వబడింది. కానీ ఈ సౌకర్యాన్ని ఉపాధ్యాయేతర ఉద్యోగులకు 1986 సెప్టెంబర్‌లో రద్దు చేశారు. ఉపాధ్యాయులకు కూడా దానిని రద్దు చేసినా ట్రిబ్యునల్ తీర్పు, జి.ఓ. ఎం.ఎస్. నెం: 297 ఆర్థిక తే 3. 8. 93 ద్వారా యింక్రిమెంటు తేదీకి యింక్రిమెంటు కొనసాగించుటను సాధించుకున్నాం. తేది. 1-7-86న 22 సంవత్సరముల స్కేలు పి.ఆర్.సి. ఒకే తేదీన అమలు జరిపినప్పుడు పాత యింక్రిమెంటు తేదీ యధావిధిగా కొనసాగించబడింది.

1993స్కేళ్ళలో ఎన్.జి.జి.ఓ.లకు జి.ఓ.పి.నెం.290 ఆర్థిక శాఖ తేదీ 22-7-93 ద్వారాను, ఉపాధ్యాయులకు జి.ఓ.నెం. 311 ఆర్థిక శాఖ తేది. 20-8-93 ద్వారా యీ స్కీము తేది. 1.8.1993 నుండి వర్తింపజేయబడినది. గతంలో 10,15,22 సంII ల కిచ్చిన సౌకర్యం కొత్త స్కీములో 8, 16,24 సంIIలకు యిస్తారు. అయితే గతంలో 22సంIIలకు ప్రత్యేక స్కేలు యుండేడిది (ప్రమోషన్ పోస్టు II). కానీ 1993 స్కేళ్ళలో 22 సంIIల స్కేలు రద్దయి 24 సంIIల స్వీసుకు ఒక యింక్రిమెంటు అదనంగా యిస్తారు. ఉపాధ్యాయులకు సంబంధించినంత వరకు షరతులు, విద్యార్హతలు, 10, 15,22 సంIIలకు ఉన్నవే. 8, 16, 24 సంIIలకు కూడా ఉంటాయి.

**వివరములు:** 1. 1993 స్కేళ్ళలో 8, 16, 24 సంIIరముల స్కీము తేదీ 1-8-93 నుండి అమలులోనికి వస్తుంది.

2. తేదీ 1-1-93 నుండి కొత్త స్కేళ్ళు అమలు లోనికివస్తాయి. అందుచే తేదీ 1-1-93 నుండి తేదీ 31-7-93 వరకు గల మధ్య కాలంలో కొత్త స్కేళ్ళు అమలులోనికి వచ్చినప్పటికి పాత అడ్వాన్స్ మెంటు స్కీమే కొనసాగుతుంది. అందుచేత 1-1-93 నుండి కొత్త స్కేళ్ళలో ఆప్షన్ యిచ్చి తేదీ1-8-93కి ముందు కాలంలో 10,15,22 సంIIల సర్వీసు నిండినప్పుడు క్యాటగిరి III వారు 2075-4270స్కేలు, 15 సంII నిండిన వారు 2525-5390 స్కేలు క్యాటగిరి -II వారు 10 సంవత్సరములకు రు. 2600-5580 స్కేలు, 15 సంIIలకు 3110-6380 స్కేలు, క్యాటగిరి I వారు 10 సంIIలకు రు. 3310-6840 స్కేలు, 15 సంIIరములకు రు. 3640-7580 స్కేలు, అలాగే 22 సంIIలు నిండిన క్యాటగిరి III వారికి రు. 3110-5200లు, క్యాటగిరి II వారికి రు. 3640-7580లు, క్యాటగిరి I వారికి రు. 4400-8700స్కేళ్ళు ఇస్తారు.

తేదీ 1-8-93 తర్వాత పాత ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీము రద్దు అయింది. తేదీ 1-8-'93 తర్వాత తేదీ 31-12-93 మధ్యలో కొత్త స్కేళ్ళలో ఆప్షన్ ఇచ్చినప్పటికి పాత ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంటు స్కీము వర్తించదు. వారికి 8,16,24 సంIIరముల సౌకర్యమే వర్తిస్తుంది. ఉదా: గ్రేడ్ II భాషా పండితులు తేది 10-8-83 నుండి జి.ఓ. ఎం.ఎస్. నెం. 330 ప్రకారం అప్ గ్రేడేషన్ పొందారు. వారికి ఆ రోజు నుండి గ్రేడ్ I స్కేలు యిచ్చారు. వారిని గ్రేడ్ I పోస్టులో అబ్జార్బ్ చేసినా, చేయకపోయినా తేదీ 10-8-83 నుండి సదరు సర్వీసు గ్రేడ్ I గానే పరిగణించాలని, మెమో నెం 514 విద్య తేదీ 9-6-92 (ఐక్య ఉపాధ్యాయ (9/92) .లో పేర్కొన్నారు. వీరికి 10-8-93 నాటికి గ్రేడ్ I స్కేళ్ళలో 10 సంIIలు నిండుతాయి. వీరు 1-1-93 కొత్త స్కేలుకు ఆప్షన్ యిస్తే తేదీ 1-8-93న 8 సంIIలు స్కేలుగా రు. 2600-5580 స్కేలు తీసుకుంటారు.

2. తేదీ 1-1-93 కి ఆప్షన్ యిచ్చి అదే రోజు 10 సంIIలు పూర్తి అయితే ఆయన పాత స్కేళ్ళలో 10 సంIIలు స్కేలు తీసుకొని కొత్త స్కేళ్ళలోనికై న వెళ్ళవచ్చు. లేదా కొత్త స్కేళ్ళలో ఫిక్స్ చేయించుకొని 8 సంIIలు స్కేలు తీసుకొనవచ్చును.

3.ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీముకు గత జి.ఓ.ల లో పేర్కొనినట్లు యీ జి.ఓ.లో కూడా యింక్రిమెంటల్ సర్వీసునే పరిగణనలోనికి తీసుకుంటారు. 16 సంIIల స్కేలు ఇచ్చుటకు సర్వీసు రెగ్యులరైజేషన్ జరగాలని, అప్‌గ్రేడేషన్ వారికి క్యాడరు సర్వీసు కావాలని విద్యాశాఖ ఇచ్చిన వివరణ సరికాదని ఈ జి.ఓ. కూడా మరొకసారి వివరించబడింది. 8 సంIIల (స్పెషల్ గ్రేడ్) కు ఎట్టి అదనపు విద్యార్హతలు అవసరంలేదు. 16 సంIIల స్కేలుకు సర్వీసు రూల్సు ప్రకారం ప్రమోషన్ పోస్టు కు కావలసిన పూర్తి అర్హతలు కలిగి యుండవలెను. అయితేగతంలో మినహాయింపులు పొందియున్న కారణంగా క్యాటగిరి IIIఉపాధ్యాయులు పి.ఎ.టి. పరీక్షలోను, గ్రేడ్-I భాషా పండితులు ఎస్.ఒ.టి. పాసైనచో వారు 16 సంవత్సరముల స్కేలు పొందుటకు అర్హులు.

4. స్పెషల్ గ్రేడ్, స్పెషల్ ప్రమోషన్ పోస్టులలో ఫిక్సేషన్ ఎఫ్.ఆర్ 22 (a) (i) మరియు 31(2) ప్రకారం జరుగును. అనగా 16 సంవత్సరములు నిండిన రోజు పై స్కేలులో పై స్టేజీలో నిర్ణయించి ఆ తర్వాత 12 నెలలకు ఇంక్రిమెంట్లు ఇస్తారు. అయితే పాత స్కేలులోనే కొనసాగి వుంటే వచ్చేడి పాత ఇంక్రిమెంట్ తేదినాడు ఎఫ్.ఆర్. 31(2) ప్రకారం పై స్టేజిలో ఫిక్స్ చేయించుకొనవచ్చును.

24 సంIIనిండినప్పుడు ప్రత్యేక స్కేలు యివ్వరు కనుక ఎఫ్ఆర్. 31(2) రూలు వర్తించదు. 24 సంIIలు నిండిన రోజున ఒక యింక్రిమెంటు యిచ్చి సంII తరువాతనే వార్షిక యింక్రిమెంటు యిస్తారు. అయితే ఇంక్రిమెంటు రోజునాడే 24 సంIIలు కూడా నిండినవారికి నార్మల్ యింక్రిమెంటుతోపాటు 24 సంIIల సర్వీసుకు అదనంగా ఒక యింక్రిమెంటు యిస్తారు.

ఆటోమాటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కేలు ఫలితం తీసుకుంటూ రెగ్యులర్ ప్రమోషన్ పొందినప్పుడు ఎఫ్ఆర్ 22 (a)(i) ప్రకారం వేతనం నిర్ణయిస్తారు.

**అనెగ్జర్**

క్యాటగిరి ఆర్డినరీ స్పెషల్‌గ్రేడ్ ఎస్.పి.పి. క్యాటగిoI- 3110-6380, 3310-6840, 3640-7580

క్యాటగిరిII- 2525 -5390, 2600-5580, 3110-6380

క్యాటగిoIII-1975-4010, 2075-4270, 2525-5390.

# కథలు—గేయాలు

## స్వాగతగీతం

—కోణార్క

ఇదే ఇదే అలనాటి పలనాటి నేలరా
ఇదే ఇదే సిరులొలికే గుంటూరు సీమరా
యు.టి.ఎఫ్. సోదరా స్వాగతం
యు.టి.ఎఫ్. సోదరీ స్వాగతం ।ఇదే।
అమరావతి అందాలు కుప్పించిన దిచటనే
నాగమ్మ కరవాలం నాట్యమాడే నిచటనే
కరుణార్ద్రతకైనా—కదనార్భటికైనా
ఇది కన్నతల్లిరా—ఇది కల్పవల్లిరా ।ఇదే।
త్రిపురనేని కలంపాళి చెండాడిన దిక్కడే
మన జాష్వ గుండెకోత పుటమెక్కిన దిక్కడే
మాలపల్లి మహాఘోష వినదించిన సీమరా
కరుణశ్రీ కరుణామృత ఝరిపారిన నేలరా ।ఇదే।
కన్నెగంటి దుగ్గిరాల మాకినేని మైనేని
త్యాగధనుల తల్లిరా—కళల కాణాచిరా
పచ్చి బాలింతరా—కీర్తి మాగాణిరా
చదువులమ్మ కాలియందె ఝుళంఝుళుల సంతరా ।ఇదే।

## స్త్రీ

—ఎ.జి. యతిరాజులు

నవమాసాలు వినుమోసింది స్త్రీ
అష్టకష్టాలు పడి కన్నది స్త్రీ
గోరుముద్దలు తినిపించింది స్త్రీ
ప్రేమతోపెంచి పెద్ద చేసింది స్త్రీ
తీయటి కలలను నీలో కల్పించేది స్త్రీ
సాటిలేని ఆనందాన్ని అందించేది స్త్రీ
జీవితానికి దీపికయై భాసించేది స్త్రీ
జగతిలో నీకోవ్యక్తిత్వం యిచ్చేదిస్త్రీ
ముద్దుల బిడ్డను నీకందించేది స్త్రీ
అయితే నీకు పుట్టినది ఆడశిశువైతే
హడలిపోతావెందుకు?

## స్వాగతం

—వడ్లమాను వెంకటేశ్వర్లు

ఆకాశమంత పందిరి ఆహ్లాదంగా
జిలుగు వెలుగులతో జేజేలు పలికింది
కారుమబ్బుల ఫెళఫెళార్భటులు
శుభారంభ మేళతాళాల్లా
మహాసభలకు స్వాగతం పలికాయి

## యు.టి.ఎఫ్. పిలుస్తోంది

— ఆరేపల్లి రామారావు

పదవోయీ మున్ముందుకు సోదరా
వేవేగమె రాపోదము తమ్ముడా ।
సిద్ధాంతం లేని వారు
రాద్ధాంతం చేస్తారు
నీధ్యేయం వీడకోయి
నీగమ్యం చేరవేగ ।పదవోయి।
వారుణివాహిని వరదలో
బీరు బ్రాంది బారులలో
కూలి మొదులు జ్ఞాని వరకు
కూరుకుపోతూ వుంటే ।పదవోయి।
చిత్రసీమ అశ్లీలాలు
చౌకబారు సాహిత్యం
మతోన్మాద మత్తు మందు
మూఢ నమ్మకాలను మాపగా ।పదవోయి।
యు.టి.ఎఫ్. పిలుస్తోంది
వినలేదా కనరావా!
ఆశయాల కంకితమె
అడుగుముందుకేయ్ వేగ ।పదవోయీ।
యు.టి.ఎఫ్. పిలుస్తోంది
పదవోయి మునుముందుకు
లేవేగమె రా పోదము ।పదవోయి।

## స్వాగతం

—మురారి

ఉపాధ్యాయుల ఐక్య
ఉద్యమాలు నడుపుతున్న
గురువులార రారండని
గుంటూరు పిలుస్తూంది ॥
దేశ దాస్య శృంఖలాలు
తెంచగ దీక్షా దక్షులు
తెగువతో పోరిన వీరుల
దేశభక్తుల గుంటూరు ॥ ఉపా॥
తెలుగు సాహితికి గొప్ప
వెలుగులు సృష్టించిన
కరుణశ్రీ జాషువాల
కలలపంట గుంటూరు ॥
పెక్కు ఉద్యమాల నుండి
ఉక్కు ఉద్యమం దాక
విజయాలను సాధించిన
విద్యార్థుల గుంటూరు
బ్రహ్మన్న బాలచంద్రుడు
శ్రీనాథుడు త్రిపురనేని
ఆంధ్రరత్న ఉన్నవలు
ప్రభవించిన గుంటూరు
విద్యలకి స్రవంతిగా
విప్లవాల కూపిరిగా
విలసిల్లే గుంటూరు ॥ ఉపా॥

## యు.టి.ఎఫ్. వెలిగించిన అరుణ ప్రభలు! విద్యా వైజ్ఞానిక మహాసభలు!!

—అయినాల మల్లేశ్వరరావు

1993–6వ విద్యా మహాసభలకు శంఖారావం పూరించింది గుంటూరు
విద్య ప్రైవేటీకరణ రాజ్యాంగ విరుద్దమని ఘోషిస్తుంది ప్రతి పల్లెటూరు
లక్షలాది ఉపాధ్యాయులు ముక్త కంఠంతో ఆ భూతాన్ని
ఎదుర్కొంటారు
విద్యా వేత్తలు, ఉపాధ్యాయ సంఘాలు అందుకు ముందుగా
పూనుకుంటారు.
విద్యా వైజ్ఞానిక మహాసభలు ఉపాధ్యాయలోకానికి దివిటీలు
విధిగా సంయమనం పాటించితీరాలి అన్ని ఉపాధ్యాయ కమిటీలు
సమైక్య పోరాటానికి ఉద్యుక్తుల మవుదాము విస్మరించి పోటీలు
విధి నిర్వహణయే ఘనతకు మార్గమంచు నిర్వహిద్దాము డ్యూటీలు.
చరితగలిగిన "ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్" ప్రథమ శక్తిగా
వర్ధిల్లుగాక!
మరో విద్యా వైజ్ఞానిక మహాసభల కిది పూర్తి స్ఫూర్తి నిచ్చుగాక!
యు.టి.ఎఫ్. నాయకమన్యులు ఉత్తమ మార్గాన ఉద్యమాన్ని
నడిపింతురుగాక!
ప్రతి ఉపాధ్యాయుడు మైనేనియై సదా 'సహకారము' నందించుగాక!

## వొద్దమ్మతల్లే–ఓ సారాతల్లే

—ఏ.వీర్రాజు

వొద్దమ్మా తల్లే, ఓ సారా తల్లే!
నువొద్దమ్మా తల్లే ఓ సారా తల్లే!! ॥వొద్దమ్మ॥
నిన్ను నమ్మి ఇన్నాళ్ళు
ఇల్లూ ఒల్లు గుల్ల జేస్తి
పిల్లా జెల్లా సూడకుండ
అల్లాటప్పనైపోతి ॥వొద్దమ్మా॥
కైపు నెత్తి కెక్కినాకు
కట్టుకున్న దాన్ని తన్ని
అడ్డమొచ్చినోళ్ళనైనా నడ్డి విరగ తన్నబోయి
ఊరందరూ ఉమ్మివేయ
రోతబుట్టె ఈనాటికి ॥వూరందరు2॥ ॥వొద్దమ్మా॥
కూలినాలి జేసి పైసా
కొంపకీయ కుండానే
ఆలిమాట అమ్మమాట అసలే వినకుండానే
కంపుకొట్టు నిన్ను త్రాగి
కైలాసం అనుకుంటినె
రోతబుట్టె ఈ బతుకు నీ చలవె ఇది. తల్లే ॥వొద్దమ్మా॥
కూడులేక గూడులేక
వొంటిగట్ట బట్టలేక
కుమిలి ఏడ్చు నిరుపేదల
బతుకు బాగు సేయాలంటూ
ఇన్నాళ్ళకు ప్రభుత్వం విధించే నిషేధం
అందుకే నువ్వెళ్ళిపో నెల్లూరు దాటి
ఆంధ్రదాటి॥వొద్ద॥
అక్షరదీపం మనకు అందించిందే వెలుగు
దూబగుంట స్త్రీలు మనకు ఆదర్శం కావాలి
సారా ఉద్దెమమింకా చైతన్యంకావాలి
మహిళలంతా ముందుకురికి సారాక్షసితరమాలి
పేదల చీకటి బతుకులు వెలుగుతో నిండాలి ॥వొద్దమ్మా॥

## కట్నాల కళ్యాణం

—ఎన్.కె.నాగేశ్వరరావు

ఆడపిల్లలు
తల్లిదండ్రుల ఎదపై
బరువులుకాదు
కట్నాల కళ్యాణంలో
వాళ్ళ సమిధలుకాదు
విద్యా విజ్ఞానంతో
ఎదగాల్సిన దేశ
పరువు–ప్రగతి వారు.

## జీవితం

—ఎన్.నాగభూషణం

గతం
మనిషికి ఒక స్ఫూర్తి
వర్తమానం ఒకనీతి
భవిష్యత్తు ఒక జ్యోతి
అయినప్పుడే ఆ జీవితానికి
దక్కుతుంది ఖ్యాతి.

## విముక్తి కోసం

—అడిగోపుల వెంకటరత్నమ్

అనుకున్న అతిథులు రానే వచ్చారు.
అనుకోని అతిథులు రాకరాకవచ్చారు!
ఎసరు కాగుతూనే వుంది
కట్టెలు మండుతూనే వున్నాయి
వడ్డన జరుగుతూనే వుంది
క్షుధార్తి తీరిన వాళ్ళు
కృతజ్ఞతా పలుకు జమచేసి వెళ్తున్నారు
ఒళ్ళు గుల్లయిన భూదేవి
ఋణ ఖాతాకు రాసుకుంటూనే వుంది!

## ఉక్కు శిక్షణే మా ఊపిరి

—ఎం.భరతుడు

రాజ్యాలే కూలినా – రవి గమ్యం మారినా
ఆగదులే ఈ ఉద్యమం
యుగయుగాల ధర్మముకై–గుణాత్మక విలువలకై
మానేతల ఉక్కు శిక్షణే– ఊపిరి
చెన్నుపాటి సంఘము–నాదెళ్ళ వాసము
మైనేని మేమంతా అన్నదమ్ములం
వత్సవాయివారసులం–ఒరదీసిన కత్తులం
వసుధైకకుటుంబాన్ని సాధించి తీరుతాం ॥రాజ్యాలే॥
యు.టి.ఎఫ్. సంఘము–గురుదేవుల సగమం
అణగారిన జనానికి –ఆశాకిరణం
ఆచార్యుల కర్తవ్యం–అక్షర గోదావరితో
విశాలాంధ్ర జాతిని– వెలిగించి తీరుతాం ॥రాజ్యాలే॥



నిర్వహణ: కె. జోజయ్య

శ్రీ పి.వి. ఆంజనేయులు, నల్లజర్ల, ప.గో.

**ప్రశ్న: *కేటగిరి-III వారికి 22 సం॥ల స్కేలుగా 1550–3050 స్కేలును మంజూరు చేయుచూ యిచ్చిన జి.ఓ. 157 ప్రకారం 45సం॥ల వయస్సు నిండడంతోపాటు హెడ్మాష్టర్స్ అకౌంట్ టెస్టు పాస్ కావలసి వున్నదని అధికారులు అంటున్నారు. వారి అభిప్రాయం సరియైనదేనా?***

**జవాబు:** కేటగిరి-III ఉపాధ్యాయులకు 22 సం॥ల స్కేలుగా 1550–3050 స్కేలును అనుమతిస్తూ మొదట యిచ్చిన జి.ఓ. 133 తేది: 8-4-93లో "హెడ్మాష్టర్స్ అకౌంట్ టెస్టు, 45 సం॥ల వయస్సు నిండటం అనే రెండు అర్హతలుండాలి" అని పొరబాటుగా పేర్కొనబడిన దానిని సవరించమని కోరాము. దానిపై జి.ఓ. 157లో "Provided that those who passed the Headmasters Account test prior to 20-6-83 and who crossed 45 years of age need not pass the above tests" అని సవరణ యివ్వబడినది. ఇంగ్లీషు వ్యాకరణంలో బాగా పరిజ్ఞానం వున్నవారు పై వాక్యములోని రెండు "Who clause"లు 'and'తో కలుపబడినవి గనుక ఆ రెండు అర్హతలు కలిగి వుండనవసరం లేదని,ఏదో ఒక అర్హత కలిగియుంటే చాలునని అంటున్నారు. అయినా అధికారులనేకముంది 'and' స్థానములో 'or' వుండాలని, లేకపోతే అది మీకువర్తించదని అభ్యంతరం చెపుతున్నారు. ఈ నేపథ్యంలో ఉపాధ్యాయ సంఘాలు వివరణ ఉత్తర్వులకై ప్రభుత్వానికి ప్రాతినిధ్యము చేశాయి.

శ్రీ వి.వెంకటేశ్వర్లు, కొల్లాపూర్, ఎం.నగర్‌జిల్లా

**ప్రశ్న: *కేటగిరి III కి చెందిన 22 సం॥ స్కేలు తీసుకొంటున్న నాకు జూన్ 92 నాటికి 45 సం॥ల వయస్సు నిండడం వల్ల 1550–3050 స్కేలులో నా వేతనము ఎఫ్.ఆర్.–22 (ఎ) (ii) ప్రకారం రు. 1690+60 పి.పి.గా నిర్ణయమవుతుంది. 1–1–93 నాడు కొత్త స్కేళ్ళలో వేతన స్థిరీకరణ జరిగేటప్పుడు రు. 1690 తోపాటు రు. 60 పి.పి.ని కూడా పరిగణనలోకి తీసుకొంటారా?***

జవాబు: రు.60 పి.పి.ని కూడా పరిగణనలోకి తీసుకొనే కొత్త స్కేళ్ళలో మీ వేతన స్థిరీకరణ చేస్తారు. జి.ఓ. 162 తేది: 20-5-93(ఐక్య ఉపాధ్యాయ - జూన్ 93) నందలి రూలు 2 (2) (ఎ) (ii) ప్రకారము సదరు రు. 60 ల పి.పి.ని, రూలు2(2) (బి) (i) ప్రకారము సదరు రు. 60 ల పి.పి. పైన వచ్చే డి.ఎ.ని పరిగణనలోనికి తీసుకుని వేతన స్థిరీకరణ చేస్తారు.

**ప్రశ్న: *నా మిత్రునికి 1550–3050 స్కేలులో ఎఫ్.ఆర్. 22 (ఎ) (ii) ప్రకారమువేతన స్థిరీకరణ చేయడం వలన నష్టము వచ్చుచున్నది. కావునఅతడు 1550–3050 స్కేలులోనికి రాకుండా ప్రస్తుతమున్న 1330–2630 స్కేలులోనే కొనసాగుటకు అవకాశమున్నదా?***

**జవాబు:** అవకాశమున్నది. ఎఫ్.ఆర్. 23 ననుసరించి తదుపరి ఇంక్రిమెంట్ తేదీవరకుగాని లేక ఆ తదుపరి ఇంక్రిమెంట్ తేదీ వరకుగాని లేక ఆ పోస్టును విడిచిపెట్టేంత వరకు గాని ఆయన 1330-2630 స్కేలులో కొనసాగవచ్చును. అందుకుగాను ఆయన వ్రాతపూర్వకమైన 'ఆప్షన్'నుదరఖాస్తు రూపంలో మేనేజ్‌మెంట్‌కు యివ్వాలి.

శ్రీ ఎ. ఇజ్రాయేల్‌రాజు, భీమవరం, ప.గో.

**ప్రశ్న: *ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీము (10/15/22 సం॥ల) స్కేళ్ళను సబ్‌స్టాంటివ్ లేక అఫిషియేటింగ్ స్కేళ్ళుగా పరిగణించి 6 (జి) (i) నిబంధన మేరకు వేతన స్థిరీకరణ చేయు అవకాశమున్నదా?***

**జవాబు:** అట్టి అవకాశమున్నది. ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీమ్‌కు చెందిన 10/15/22 సం॥ల ఎస్.జి / ఎస్.పి.పి. I/ ఎస్.పి.పి. II స్కేళ్ళను సందర్భానుసారం సబ్‌స్టాంటివ్ లేక అఫిషియేటింగ్ స్కేళ్ళుగా పరిగణించవచ్చును. 1-1-93 నాటికి 10 సం॥ల స్పెషల్ గ్రేడు స్కేలు తీసుకొనేవారికి దానిని అఫిషియేటింగ్ స్కేలుగాను, అంతకుముందు తీసుకొంటున్న ఆర్డినరీ స్కేలును సబ్‌స్టాంటివ్ స్కేలుగాను పరిగణించవచ్చును. అదే విధంగా 1-1-93నాటికి 15సం॥ల స్కేలు తీసుకొంటున్నచో దానిని అఫిషియేటింగ్ స్కేలుగాను, అంతకుముందు తీసుకొంటున్న 10 సం॥ల స్పెషల్ గ్రేడు స్కేలునుసబ్‌స్టాంటివ్ స్కేలుగాను పరిగణించవచ్చును. సబ్‌స్టాంటివ్, అఫిషియేటింగ్ స్కేళ్ళు రెండింటిలోను 1993 పి.ఆర్.సి. స్కేళ్ళలో వేతన స్థిరీకరణ చేసినప్పుడు అఫిషియేటింగ్ వేతనము, సబ్‌స్టాంటిక్ వేతనము కంటే తక్కువగా గాని లేకసమానంగా వున్నచో అఫిషియేటింగ్ వేతనమును సబ్‌స్టాంటివ్ వేతనమునకు తదుపరి పై స్టేజీ వద్ద స్థిరీకరణ చేయవచ్చును. ఈ సౌకర్యము 93 పి.ఆర్.సి. స్కేళ్ళ జి.ఓ. 162 తేది:20-5-93 (ఐక్య ఉపాధ్యాయ జూన్93) నందలి రూలు 6(జి) (i) ద్వారా కల్పించబడినది 1986 స్కేళ్ళలో కల్పించబడిన ఇట్టి సౌకర్యమే 10/15 సం॥ల స్కేళ్ళలో కూడా వర్తిస్తుందని జి.ఓ. 217 (అధ్యాపకదర్శిని 10, పేజి 162) ద్వారా యివ్వబడినవివరణను కూడా పరిశీలించండి. అయితే యిట్టి సౌకర్యమును వినియోగించుకొనవలసి వున్నవారు సబ్‌స్టాంటివ్ మరియు అఫిషియేటింగ్ పోస్టులు రెండింటికి వేరువేరుగా ఆప్షన్‌లు యివ్వవలసి వుంటుంది.

శ్రీ వి.వి. సుబ్బయ్య, గూడూరు, కృష్ణాజిల్లా.

**ప్రశ్న: *1–7–83న బి.ఎ., బి.ఇ.డి. అర్హతలతో సె.గ్రే.గా నియమించబడిన ఒక ఉపాధ్యాయునికి అదనపు ఇంక్రిమెంట్‌లు మంజూరయినను 1–7–86న వేతన స్థిరీకరణలో మార్పు ఏమీ వుండుటలేదు. అటువంటప్పుడు కూడా అదనపు ఇంక్రిమెంట్ మంజూరు కొరకు దరఖాస్తు చేయాలంటారా?***

**జవాబు:** జి.ఓ. 135 తేది: 8-4-93 ననుసరించి అదనపు ఇంక్రిమెంటు మంజూరయినను 1-7-86 నాటి వేతనములో ఎట్టి మార్పులేనివారు అదనపు ఇంక్రిమెంట్ కొరకు దరఖాస్తు చేయవలసిన అవసరముండదు. అయితేకొందరికి జి.ఓ 186 (అధ్యాపక దర్శిని -1, పేజి-371) ప్రకారం 1-7-86న రావలసిన ఇంక్రిమెంట్‌ను కొత్త స్కేళ్ళలో తీసుకొనుట వలన వేతనములో పెరుగుదల వుంటుంది. ఉదాహరణకు పైన పేర్కొనిన ఉపాధ్యాయునికి 1-7-83న అదనపు ఇంక్రిమెంట్ మంజూరగుట వలన 1-7-86 నాటి వార్షిక ఇంక్రిమెంట్‌ను కలపకుండానే వేతన స్థిరీకరణచేసి కొత్త స్కేళ్ళలో అదేరోజున ఇంక్రిమెంట్ తీసుకొనుట వలన

వేతనములో పెరుగుదల వుంటుంది. పరిశీలించండి. అటువంటి వారు జి.ఓ. 186 ప్రకారం 86 స్కేళ్ళలో వేతనస్థిరీకరణ జరిగిన తదుపరి 1-7-86న ఇంక్రిమెంట్ మంజూరు చేయమని దరఖాస్తు చేయవలసి వుంటుంది.

**శ్రీ కె. శ్రీనివాసరావు, పోలేపల్లి, ఖమ్మంజిల్లా.**

**ప్రశ్న:** **82-86 మధ్య కాలములో అదనపు యింక్రిమెంట్లు పొందిన వారు గతంలో 1-7-86గా యిచ్చిన ఆప్షన్ తేదీని మార్చుకొను అవకాశమున్నదా?**

**జవాబు:** అట్టి అవకాశమున్నది. రీగ్రూపింగుస్కేళ్ళ కలంలో జి.ఓ.135ననుసరించి అదనపు యింక్రిమెంట్లు మంజూరయిన వారు 86 స్కేళ్ళకు గతంలో యిచ్చిన ఆప్షన్ తేదీని మార్చుకొనుట వలన ప్రయోజనం వుంటుందనుకొంటే వారి ఆప్షన్ తేదీని 1.7.86 తదపరి వచ్చే యింక్రిమెంటు తేదీకి యిచ్చుకొనవచ్చును. అదనపు యింక్రిమెంట్లు మంజూరు చేస్తూ మేనేజిమెంటు వారు యిచ్చేడి ఉత్తర్వులు అందిన నెలలోగ వారు 86 స్కేళ్ళకు రివైజ్డ్ ఆప్షన్ యిచ్చుకొనవచ్చును. అందుకు అవకాశం కల్పిస్తున్న జి.ఓ. 288 తేదీ: 17.11.86 (అ.ద.-1, పేజీ 348) నందలి రూల 4(8)ని పరిశీలించండి.

**శ్రీ ఎం. జగన్ మోహన్‌రావు, చెరుకుపల్లి, గుంటూరుజిల్లా.**

**ప్రశ్న:** *నాకు 14-8-93 కు 15 సం॥ల సర్వీసు నిండుతుంది. 15 సం॥ల స్కేలు తీసుకొన్న తరువాత నేను 93 పి.ఆర్.సి. స్కేళ్ళకు ఆప్షన్ యిచ్చుకొనవచ్చునా?*

**జవాబు:** పాత స్కేళ్ళలో కొనసాగినను 14-8-93న 15 సం॥ల స్కేలు తీసును అవకాశము లేదు. 1.8.93 నుండి పాత అటోమేటిక్ అడ్వాన్సుమెంటు స్కీము రద్దయి, క్రొత్త స్కీము అమలులోనికి వచ్చినది. కనుక 1-1-93కే ఆప్షన్ యివ్వవలసి వుంటుంది.

**శ్రీ కె. చంద్రశేఖర్‌రావు, బారువ, శ్రీకాకుళం జిల్లా.**

**ప్రశ్న:** ***10-8-83 నుండి గ్రేడు-I స్కేలు (జి.ఓ. 330 ననుసరించి)తీసుకొంటున్న పండితులకు 10-8-93కు 10 సం॥లసర్వీసు నిండుతుంది. వారు 10 సం॥ల స్కేలును ఎప్పటనుండి తీసుకొను అవకాశమున్నది?***

**జవాబు:** జి.ఓ. 330 ప్రకారం 10-8-83 నుండి గ్రేడు-I స్కేలుతీసుకొంటున్న పండితులు 1-1-93కు ఆప్షన్ ఇచ్చుకొని, కొత్త స్కేళ్ళలో జి.ఓ. 311ఆర్థిక, తేదీ:20-8-93 ననుసరించి 1-8-93 నుండి 8 సం॥ల స్పెషల్‌గ్రేడు స్కేలును తీసుకొనవచ్చును.

**శ్రీ బి.చంద్రశేఖరరెడ్డి, చాడేపల్లి, చిత్తూరు జిల్లా**

**ప్రశ్న:** ***1991 జనవరిలో రెగ్యులర్ సెకండరిగ్రేడుగా నియామకము పొందే నాటికి బి.ఎస్.సి., బి.ఇడి., ఎం.ఇడి. అర్హతలను కలిగియున్న నేను ఎన్ని అదనపు ఇంక్రిమెంట్లు పొందవచ్చును?***

**జవాబు:** జి.ఓ. 40 ఆర్థిక, తేది: 2-2-93 మరియు మెమో నెం. 22471 సర్వీసు -II-1/88-10 విద్య, తేది: 28-7-93ల ప్రకారం మీరు కలిగి యున్న అర్హతలలో బి.ఎస్.సి.,ఎం.ఇడిలను అదనపు అర్హతలుగా పరిగణించి రెండు అదనపు ఇంక్రిమెంట్లు మంజూరు చేయవలసి వుంటుంది.

**శ్రీ జి. శ్రీధర్, పొదిలి, ప్రకాశం జిల్లా**

**ప్రశ్న:** ***నేను 1984 ఫిబ్రవరిలో ప్రత్యేక భాషా పండితునిగా నియమించబడి, 1988 డిసెంబర్‌లో రెగ్యులర్ పోస్టులో అబ్జార్బు అయ్యాను. జి.ఓ.40 ప్రకారం నేను తీసుకుంటున్న అదనపు ఇంక్రిమెంట్లకు సంబంధించిన అదనపు అర్హతలను 1-7-86 పూర్వమే కలిగియున్నాను. గనుక జి.ఓ. 40 నాకు వర్తించదని ఆడిట్‌వారు అభ్యంతరం తెల్పారు. వారి అభ్యతరం సరియైనదేనా?***

**జవాబు:** ఆడిట్‌వారి అట్టి అభ్యంతరం సరియైనది కాదు. ప్రత్యేక భాషా పండితునిగా మీరు పనిచేసిన కాలము సర్వీసుగా పరిగణింప బడదు. మీరు గ్రేడు-II పండిట్‌గా రెగ్యులర్ నియామకము పొందినప్పటినుండి మాత్రమే మీ సర్వీసు పరిగణించబడుతుంది. కనుక సదరు రెగ్యులర్ నియామకమునకు పూర్వమే మీరు కలిగియున్న అదనపు అర్హతలకు అదనపు ఇంక్రిమెంట్లు మంజూరు చేయుట సక్రమమే. జి.ఓ. 40 ఆర్థిక, తేది: 2-2-93. (ఐక్య ఉపాధ్యాయ- ఫిబ్రవరి 93) నందలి పేరా 3 (డి)లో "This will be admissible to those recruted directly after 1st july 1986 if they possess the requisits additional qualifications at the time of their appointment" అని యున్న అంశమును పరిశీలించండి.

**శ్రీ ఎ సూర్యారావు, ఎ.అన్నవరం, తూ॥గో**

**ప్రశ్న:** *1993లో సంపాదించిన అదనపు విద్యార్హతకు అదనపు ఇంక్రిమెంట్ తీసుకొని, ఆ తదుపరి 93 పి.ఆర్.సి. స్కేళ్ళకు ఆప్షన్ ఇచ్చుకొను అవకాశమున్నదా?*

**జవాబు:** అట్టి అవకాశమున్నది. 1993 పి.ఆర్.సి. స్కేళ్ళకు ఇచ్చిన ఆప్షన్ తేది వరకు పాత స్కేళ్ళలో కొనసాగుతున్నట్లు పరిగణించబడుతుంది. కనుక సదరు తేదికిపూర్వం సంపాదించిన అదనపు అర్హతలకు పాత నిబంధనల ననుసరించి అదనపు ఇంక్రిమెంట్లు పొందవచ్చును. అయితే అట్టి ఆప్షన్ తేది 1993 డిసెంబర్ 31 లోపల వచ్చే ఇంక్రిమెంటు తేదీ అయి వుండాలి.

**శ్రీ వై. మోషే, పాలమూరు, ప॥గో॥**

**ప్రశ్న:** ***1981లో సె.గ్రేగానియమించబడిన నేను 1984లో ఒక ఎం.ఎ, 1986లో మరొక ఎం.ఎ పాసయ్యాను. నాకు రెండవ ఎం.ఎ అర్హతకు అదనపు ఇంక్రిమెంట్ వస్తుందా?***

**జవాబు:** మీరు 1984లో పాసైన ఎం.ఎ. అర్హతకు జి.ఓ.135 ఆర్థిక, తేది: 8-4-93 (ఐక్య ఉపాధ్యాయ మే 93) ననుసరించి ఒక ఇంక్రిమెంట్ మంజూరవుతుంది. కనుక రెండవ ఎం.ఎ. అర్హతకు అదనపు ఇంక్రిమెంట్ మంజూరు కాదు.

**శ్రీ కె.హరేరాం, పెండలవాడ, అదిలాబాద్ జిల్లా**

**ప్రశ్న:** ***1972 జనవరిలో గ్రేడ్-1 తెలుగు పండిట్‌గా నియమించబడిన ఒక మిత్రుడు 1977 జూన్‌లో ఎం.ఓ.ఎల్. పాసయ్యారు. అతనికి జి.ఓ. 135 ప్రకారము అదనపు ఇంక్రిమెంట్ మంజూరు చేయు అవకాశమున్నదా?***

**జవాబు:** బి.ఓ.ఎల్., పండిట్స్ ట్రెయినింగ్ అర్హతలతో గ్రేడు-1 పండిట్‌గా పనిచేస్తున్న ఉపాధ్యాయుడు 1977లో పొందిన ఎం.ఓ.ఎల్. అదనపు అర్హతకు ఆనాడే ఒక అదనపు ఇంక్రిమెంట్ మంజూరై వుండాలి. ఒక వేళ అప్పుడు మంజూరు కాకున్నట్లయితే ఆనాటి ఉత్తర్వులైన జి.ఓ. 928 తేది. 13-9-77 మరియు మె.మో.నెం. 2548- కె1/78-2 విద్య, తేది: 11-6-79 (అధ్యాపక దర్శిని-3, పేజీలు 38 మరియు 46)ల ననుసరించి ఇప్పుడైనా మంజూరు చేయవచ్చును. అంతేగాని జి.ఓ.135 అట్టివారికి సంబంధించినదిగాదు.

క్రీడాతరంగం

# ఆరోగ్యంకోసం నిత్యం వ్యాయామం

గుత్తా బాలశౌరి

బరువు తగ్గాలన్నా, సన్నబడాలన్నా, క్రమబద్ధమైన ఆకృతి కలిగి వుండాలన్నా ప్రతివారు తగు విధంగా తేలికైన మితాహారం తీసుకొని, నిత్యం వ్యాయామం చేయాలి. దేహదారుఢ్యం పెరుగుటకు వ్యాయామం బాగా దోహదపడగలదు. అది మంచి ఆరోగ్యానికి సానుకూలం కాగలదు.

వ్యాయామం మూడు రకాలు. అవి ఎయిరోబిక్ వ్యాయామం (Aerobic Exercise), దారుఢ్య వ్యాయామం (Strengthining exercise), సాగు వ్యాయామం (Stretching exercise). క్యాలరీలు క్రమబద్ధంగా వినియోగించుటకు హృదయ నాళములు బలవర్ధకంగా పనిచేయుటకు మంచి వ్యాయామం ఎయిరోబిక్ వ్యాయామం.

ఎయిరోబిక్, వ్యాయామం అంటే ఏమిటి? శ్వాసావయవములను ప్రాణవాయువుతో నింపు వ్యాయమం ఎయిరోబిక్. అధిక ప్రాణవాయువుతో నిండిన రక్తమును గుండెకు చేర్చి, దానిని శక్తివంతము చేయును. ప్రాణవాయువు నిండిన రక్తమును అన్ని కండరములకు సరఫరా చేయును. వ్యాయామం చేయునప్పుడు గుండె, శ్వాసాంగముల మీద ఒత్తిడి ఎక్కువగును. అవి బాగా పనిచేయును. తద్వారా రక్తప్రసరణ యంత్రాంగము శక్తివంతమగును. కండరములకు శక్తిని, ఆకారాన్ని ఇచ్చు దారుఢ్య వ్యాయామం, మృదుత్వంను పెంచు సాగు వ్యాయామంలతో ప్రాణవాయువు వ్యాయామం మిళితం చేసి ఆచరించవలెను. దాని వలన గుండె కండరములు గట్టిపడును.

బరువును తగ్గించుటకు ఎయిరోబిక్ వ్యాయామం సరిపోతుందని భావించడం తప్పు. మితంగా ఆహారం తీసుకొనక పోయినచో ఏ వ్యాయామం కూడా బరువును తగ్గించలేదు. మనం కోరుకున్నదల్లా, అవసరానికి మించి తినటం మంచిదికాదు. 1500 క్యాలరీల ఆహారాన్ని ఖర్చు చేయాలంటే కనీసం 21/2 గంటలు పరుగెత్త వలెను. అది ఆచరణ సాధ్యమైనను కోరదగింది మాత్రం కాదు.

మితాహారం, వ్యాయామం కలిసినప్పుడు బరువు తగ్గడం సానుకూలం కాగలదు. ఎయిరోబిక్ వ్యాయామం చేయునప్పుడు క్యాలరీల ఖర్చు ఎక్కువ కాగలదు. వ్యాయామం పూర్తి చేసిన తరువాత కూడా క్యాలరీల ఖర్చు అదే విధంగా వుండగలదు. మరొక విధంగా చెప్పాలంటే ప్రాథమిక జీవక్రియా సామర్థ్యంను అధికం చేయును.

ఒక రోజంతా వ్యాయామం చేయకుండా ఖర్చగు క్యాలరీల కన్నా, వ్యాయామం చేసిన తరువాత క్యాలరీలు త్వరగాను, ఎక్కువగాను ఖర్చగును.

నడవటం, జాగింగ్ చేయటం, ఈదటం మరియు సైకిల్ త్రొక్కటం వంటివి ఎయిరోబిక్ వ్యాయామానికి కొన్నిరూపాలు. శరీర అవయవాలు ఎంత శక్తివంతమగునో అంతే శక్తివంతముగ ప్రాణవాయువును గ్రహించగలవు. ఎయిరోబిక్ వ్యాయామం చేయునప్పుడు, ప్రాణవాయువుతో కూడిన రక్తము కండరములకు సులభంగా, ఎక్కువగా సరఫరా అగును. లోపలకు తీసుకొను ప్రాణవాయువుకన్నా ఎక్కువ శక్తి బయటకు పోవుచున్న సమయంలో కండరాలు ఎయిరోబిక్ స్థితిలో ఉండును. అందువలన ఎయిరోబిక్ వ్యాయామం నిలుపు చేయక కొనసాగించవలెను. తేలిక వ్యాయామం చేసిన ఎడల గుండె, ఊపిరితిత్తుల మీద ఒత్తిడి తక్కువై ఎక్కువ ప్రాణవాయువు అందదు. అవి వాటి శక్తి మేరకు పనిచేయవు. దీనివలనమన గుండె, ఊపిరితిత్తులకు పూర్తి మేలు చేకూర్చలేము.

గుండె తన సామర్థ్యంను పెంచుకొనిన ప్రాథమిక జీవన క్రియా సామర్థ్యం పెరిగి ఎక్కువ క్యాలరీలు ఖర్చగును. దానికిగాను ఎయిరోబిక్ వ్యాయామం నియమితకాలంలో, నియమిత గతిలో చేయవలెను. అకస్మాత్తుగా లేదా ఒక్క సారిగా వ్యాయామం తీవ్రంగా చేయుటకు ప్రయత్నించిన అసలు వ్యాయామం యొక్క ప్రయోజనం దెబ్బతినగలదు అందువలన మెల్లగా ప్రారంభించి నిలుపు చేయకుండా నిర్ణీతకాలం వరకు ఎయిరోబిక్ క్రియలను కొనసాగించవలెను. ఎయిరోబిక్ క్రియలను త్వరగా మొదలుపెట్టి త్వరగా పూర్తి చేయడం వలన మనం త్వరగా అలసిపోయి, వాటి ఫలితములను పొందలేము. ఎయిరోబిక్ క్రియల ఆశయం కూడా నెరవేరదు.

వ్యాయామంలో కాలగతి అనగానేమి? శిక్షణా శక్తినిబట్టి 60% నుండి 80% రేంజిలో పనిచేయుటకు పట్టు సమయాన్ని ఆదర్శకాలగతి అందురు. ఒక్క నిముషానికి నీ శిక్షణా శక్తిని ఈ క్రింది విధంగా లెక్కించ వచ్చును. 220 నుండి నీ వయస్సును తీసివేయుము. వచ్చిన దానికి పర్సంటేజి కట్టుము. దీనిని 6(ఆరు)తో భాగించుము. 10 సెకండ్లకు నీ శిక్షణా రేటు వచ్చును. ఈ శిక్షణా రేటు వాటి గతిని సులభతరం చేయును.

ప్రారంభ నాడీగతి తెలుసుకున్న తరువాత వ్యాయామం మధ్యలో ఒకసారి, చివర ఒకసారి నాడీగతిని తీసుకొనుము. దీనివలన ఏ రేంజ్‌లో నీవు శ్రమిస్తున్నది తెలుసుకొనగలవు. నీవు చేయు వ్యాయామానికి ఎంత శ్రమ అవసరమో దాని నుండి నీవు పొందు లాభాలు ఏమిటో తెలుసుకొనవచ్చును. నీ కాలగతి కన్నా తక్కువ శిక్షణ చేసిన ఎడల, మంచి ఫలితములను పొందలేవు. నీ కాలగతికి మించి వ్యాయామం చేసిన నిన్ను నీవు కృషింప చేసినటుల కాగలదు. నీ సాధారణ స్థితి తెలిసిన ఎడల దానికన్నా తక్కువ శ్రమించినచో, శ్రమించటం పెంచవచ్చును. నీవుఅనుకున్న స్థాయికి శ్రమను పెంచవచ్చును. వ్యాయామం చేయు సమయంలో శరీర అవయవములు నొప్పుల బాధ పెట్టినను, వాటి మీద ఒత్తిడి పెరిగినను, నీవు ఎక్కువ శ్రమ చేసినట్లు కాగలదు. వ్యాయామం చేయు సమయంలో నీవు సునాయాసంగా మాట్లాడాలి. మాటలాడటం నోటితో సైగలు చేయు వరకు వ్యాయామం చేయటం మంచిదికాదు. అది మంచి వ్యాయామం కాదు.

చాలామంది తమ వ్యాయామంను ప్రారంభంలో తీవ్రంగా చేస్తారు. అది చివరకు వ్యాయామం విరమించు స్థాయికి చేరగలదు. చలనరహితమైన కండరాలు అకస్మాత్తుగా పెంచిన వ్యాయామం యొక్క ఒత్తిడిని తట్టుకొనలేవు. మానసిక గ్లాని ఏర్పడి అనుకున్నది సాధ్యంకాదు. ఎక్కువ స్థూలకాయులు, దీర్ఘ వ్యాధులు గలవారు డాక్టర్ సలహాలు తీసుకొని వ్యాయామం చేయవలెను.

ప్రాథమిక జీవక్రియా స్థాయిని పెంచుటకు గుండె, కండరములు కదలికలు బాగుండాలి. దీనికి సుమారు 12 నిముషములు ఏరోబిక్ వ్యాయామములు అవసరం. దీనివలన నీవు నిద్రించు సమయంలో కూడా ఎక్కువ సంఖ్యలో క్యాలరీలు ఖర్చుకాగలవు. కావున ప్రాథమిక జీవక్రియాస్థాయిని పెంచుటకు 20 నిముషములు ఏయిరోబిక్ వ్యాయామం చేసిన యెడల అధిక లాభం పొందవచ్చును. అధికవ్యాయామం జీవక్రియను పెంచుననుట మంచి ఆలోచన కాదు. 80 నిముషాలు వ్యాయామం చేసిన, 20 నిముషాలు చేసిన వ్యాయామానికి నాలుగురెట్లు పెరుగుననుట పెద్ద పొరపాటు.

వివిధ రకాల ఎయిరోబిక్ వ్యాయామాలు వివిధ స్థాయిలలో క్యాలరీలను ఖర్చు చేయును. నిర్ణీతకాల వ్యవధిలో నడిచే వ్యాయామం చేయువారికన్నా, జాగింగ్ వ్యాయామం చేయువారు ఎక్కువ క్యాలరీలను ఖర్చు చేయుదురు. అందువలన నిలిచే వ్యాయామం చేయువారు జాగింగ్ వ్యాయామం చేసేవారికన్నా మరొక 10నిముషాలు ఎక్కువ చేయవలెను.

వ్యాయామం ఎంత సమయం చేయాలి? వ్యాయామం చేసిన తరువాత ప్రాథమిక జీవక్రియా స్థాయి 48గంటల వరకు వుండును. అందువలన వ్యాయామ ఫలితములు 48గంటల వరకును రెండవరోజు చివరసమయానికి వ్యాయామ ఫలితములు తగ్గిపోవును. అందువలన రోజు మార్చి రోజు వ్యాయామం చేయవచ్చును. ఇది శరీర ప్రాథమిక జీవక్రియా స్థానికి క్రమబద్ధం చేయును. జీవక్రియా స్థాయి నిల్వ వుండదు కాబట్టి, వారం చివర వారానికి సరిపడు వ్యాయామం చేస్తానంటే వీలు కాదు. ఒకే సారి ఎక్కువ వ్యాయామం చేయటం కంటే ప్రతిరోజూ వ్యాయామం చేసిన యెడల ఉత్తమ ఫలితములను పొందవచ్చును. వారానికి ఒకసారి వ్యాయామం చేయు పద్ధతి, చాలా సార్లు చేయకుండా వుండటానికి, అవకాశాలు ఎక్కువగా కలవు. ఆ సమయంలో నీవు ప్రయాణంలో వుండవచ్చు. ఏదైనా సాంఘిక కార్యక్రమంలో వుండవచ్చు లేదా అనారోగ్యం పొంది వుండవచ్చు.

20 నిముషాల ఎయిరోబిక్ వ్యాయామంలో వార్మింగ్ అప్ మరియు కూలింగ్ డౌన్ క్రియలను కలుపుకొన కూడదు. శరీరానికి నొప్పులు, బాధలు లేకుండా ఉండాలంటే వార్మింగ్ అప్ మరియు కూలింగ్ డవున్ వ్యాయామం చాలా అవసరం. వ్యాయామం చేసిన తరువాత నాడీగతి సామాన్య స్థితికి వచ్చు వరకు నిదానంగా నడవవలెను. ఎయిరోబిక్ వ్యాయామం తరువాత శరీరాకృతిని పెంచుకొనుటకు, వాటిని బలవర్ధం చేసుకొనుటకు సాగదీయు వ్యాయామములు చేయవచ్చును. సమయం లేదని సాగదీయు వ్యాయామం చేయక ఎయిరోబిక్ వ్యాయామంతో ఆపుచేస్తే అంత మంచి ఫలితములను పొందలేము.

జీవితాంతం ఎయిరోబిక్ వ్యాయామం చేసిన ఎడల వాటి ఫలితములను బాగా అనుభవించ వచ్చును. అందువలన ఆనందంగా, సంతోషంగా వ్యాయామం చేయటం మంచిది. అది నీ జీవిత నిత్యకృత్యంలో ఒక భాగం కావాలి.

మనలో చాలామంది ఇప్పటికి ఎయిరోబిక్ వ్యాయామం చేయని వారు కలరు. అయితే వారికి ఇప్పుడు ఎయిరోబిక్ వ్యాయామం చేయాలనే కోరిక కలగవచ్చు. వారికి నేనిచ్చేసలహా ఏమిటంటే? "కాలికి బూట్లు తొడుగు నడక ప్రారంభించు. అడుగు ముందుకు వేయి ఆరోగ్యం బాగు చేసుకో?

# ఉపాధ్యాయ దినోత్సవం-సెప్టెంబర్5

ఉపాధ్యాయుని స్థానం అత్యంత గురుతరమైనదనేది అందరూ అంగీకరించే సత్యమే. భావిభారత పౌరులుగా విద్యార్థులను తీర్చిదిద్దేది అయనే. అంత మాత్రాన అంతా ఆయన చేతిలో వుందనుకోవడము సరికాదు.

సమాజపరిణామ క్రమంలో విద్యా కూడా అనేక మార్పులు చెందుతూ వచ్చింది. గత కాలపు ఆశ్రమ పాఠశాల విద్యను అతిగా కీర్తించేవారు ఉన్నారు. ఆనాటి ఉపాధ్యాయునికి రాజులు కూడా ప్రణమిల్లేవారు అని ఘనంగా చెప్పుకునేవారు లేకపోలేదు.

కాని నాటి గురుకులాలు కొన్నివర్గాలకే పరిమితమని, కొందరినే పాలకులుగా, ఇతర విధాలైన నిపుణులుగా తయారు చేసేవని, మిగిలిన వారికి చదువు కోరాదనే నిబంధనలు కూడా వున్నాయనేది వారు గమనించరు. వాటిని కాదని ఎవరయినా ఏ విద్య నేర్చుకున్నా శిక్షింపబడేవారనడానికి చరిత్రలో చాలా ఉదాహరణలున్నాయి.

తర్వాత వచ్చిన బ్రిటిష్ పాలనలో మెకాలే ప్రవేశపెట్టిన వలసపాలకుల అవసరాల కోసం, గుమస్తాలను దుబాసీలను తయారు చేసుకొనే విద్య ప్రవేశపెట్టి వారి ప్రయోజనాలు నెరవేర్చుకున్నారు. అయితే వాటివల్ల కూడా చదవుకున్న మనవారు అనేక విషయాలు తెలుసుకొని, భారతదేశం స్వతంత్ర్యం పొందేదానిలో పాల్గొన్నారు.

భారతదేశం 1947 ఆగస్టు 15న స్వతంత్ర్యం పొంది 1950 జనవరి 26న రిపబ్లిక్‌గా అవతరించి, రాజ్యాంగంలో 45వ ఆర్టికల్‌లో 14 సం॥లలోపు వారందరికీ 1960లోగా అక్షరాస్యులను చేయాలని నిర్ణయించినా ఈనాటికి ఆ లక్ష్యం నెరవేరలేదు. ప్రపంచ జనాభా 500కోట్లలో చదువురానివారు 90కోట్ల మంది వుంటే అందులో సగం 45కోట్లు మంది మనదేశంలోనే వున్నారంటే బాధ కలగకమానదు.

చదువు గురించి మన పాలకులు ఎంత చెపుతున్నా నాటి బ్రిటిషు పాలకుల బాటలోనే విద్యారంగం నడుస్తుంది తప్ప, మరొక మార్పులేదు. జరిగే మార్పు కూడా విద్యనుండి బాధ్యత ఎలా తప్పించుకోవాలి అనే మార్గం వెదికే వైపు తప్ప, మరింత సమర్థవంతంగా దానిని అమలు జరిపే వైపులేదు.

**గురుపూజోత్సవం**

భారతదేశంలో మొదటి నుండి గురువుకు ప్రముఖ స్థానమున్నది. "గురుబ్రహ్మ, గురువిష్ణు, గురుదేవో మహేశ్వరః అని, మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ, అని కీర్తించిన చరిత్ర వున్నది.

గురువును కీర్తించవలసి వచ్చినపుడల్లా శ్రీరామచంద్రుని గురువైన వసిష్టుని, విశ్వామిత్రుని, శ్రీకృష్ణుని గురువైన సాందిపుని, శ్రీ కృష్ణదేవరాయలు గురువైన తాతాచార్యులను, శివాజీ గురువైన సమర్థరామదాసుని, వివేకానందుని గురువైన రామకృష్ణ పరమహంసను ఉదాహరణలుగా చెప్పేవారు.

అబ్రహాం లింకన్ తన బిడ్డకు చదువు చెప్పే గురువుకు "పాఠ్యపుస్తకాలలోని విషయాలు కంటే ఏ సంస్కృతి మనిషిని మనిషిగా చేస్తుందో మానవుల మధ్య ఉన్నత స్వభావం గలవారినిగా నిలుపుతుందో, ఆ చదువు కావాలని, మనసు కలుషితమయినప్పుడు నవ్వడం ఎలాగో నేర్పండి, నిరాశావాదుల్ని మార్చడం, తాను నిజమని నమ్మినదానికై నిలబడిపోరాడటం ఎలాగో నేర్పండి" అని ఉత్తరం వ్రాశారు.

భారతదేశంలో డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణన్ పుట్టిన రోజు అయిన సెప్టెంబర్ 5న టీచర్స్ డేగా నిర్ణయించారు. నెహ్రూ పుట్టిన రోజైన నవంబర్ 14 పిల్లల పండుగగా, గాంధీమరణించిన రోజు జనవరి 30 అమరవీరుల దినంగా, అలాగే మరికొన్ని రోజులు కూడా వున్నాయి.

డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ 5-9-1888 నాడు తిరుత్తణిలో పుట్టారు. ఆయన చదువ తిరుపతి, మద్రాసు, వెల్లూరులలో సాగింది. ఆయన మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలోను, మైసూరు విశ్వవిద్యాలయంలోనూ, కలకత్తా విశ్వవిద్యాలయంలోనూ ఆచార్యులుగా పని చేశారు. అనేక ప్రపంచ సంస్థలలో సభ్యుడై ఇంగ్లండు, చైనాలలో ఉపన్యాసాలు చేసి అనేక అవార్డులు అందుకున్నారు. 1913లో ఆంధ్ర విశ్వవిద్యాలయ కులపతిగా దానిని తీర్చిదిద్దారు. ఐరాస విద్యాసాంస్కృతి వ్యవహారాల సంఘ సభ్యునిగా, అధ్యక్షునిగా పని చేశారు. 1950లో రష్యాలో రాయబారిగా పనిచేశారు. స్టాలిన్‌తో కూడా సమావేశమయి చర్చలు సాగించారు. 1952లో భారత ఉపరాష్ట్రపతిగా, 1962లో భారత రాష్ట్రపతిగా పదవులు నిర్వహించారు.

అట్టి ఆదర్శ ఉపాధ్యాయుని పేరిట టీచర్స్ డే ఏర్పాటు చేయడం హర్షించదగ్గ అంశం. ఉపాధ్యాయుడిని గౌరవించేదానికి, అవార్డులు ఇవ్వడం, ఆపదలో ఉన్న ఉపాధ్యాయులను ఆదుకొనేదానికి టీచర్స్ వెల్ఫేర్ ఫండ్ కూడా ఏర్పాటు చేశారు. ఆదర్శ ఉపాధ్యాయులుగా జాతీయ స్థాయి, రాష్ట్రస్థాయి, జిల్లా స్థాయిలలో అవార్డులు ఇస్తున్నారు అయితే అవన్నీ సక్రమ పద్ధతిలో వస్తున్నాయా, అర్హులకు ఇస్తున్నారా? ఆశ్రితులకు ఇస్తున్నారా అనే విమర్శ లేకపోలేదు.

అలాగే ఉపాధ్యాయులు, వారి కుటుంబ సభ్యులు అనారోగ్యం పాలయినప్పుడు, పిల్లల వివాహాలకు, టీచర్స్ వెల్ఫేర్‌ఫండ్ నుండి రు.1500/-ల నుండి 25,000/-ల వరకు సహాయం అందజేస్తామంటున్నారు. అయితే అందుగురించి ప్రభుత్వం కేటాయించే నిధులకంటే ఉపాధ్యాయులకు "టీచర్స్ డే ఫ్లాగ్స్" సప్లయి చేసి వారి నుండి పిల్లల నుండి గోళ్ళూడగొట్టి వసూలు చేసే డబ్బే హెచ్చుగా వుంది అనే విమర్శ కూడా వుంది.

ప్రతి సంవత్సరం మార్చినెలలో ఉపాధ్యాయులనుండి వసూలుచేసే రు.10లు టీచర్ వెల్ఫేర్ ఫండుకు జమకట్టకుండా ఎంప్లాయీస్ వెల్ఫేర్ ఫండ్‌కు జమకట్టడం సరైందికాదనే ఉపాధ్యాయుల కోర్కెను ఇప్పటికీ ప్రభుత్వం పట్టించుకో లేదనేబాధవుంది.ఏదోరకంగా టీచర్స్ డేనాడు ఉపాధ్యాయులను గౌరవిస్తూ జాతిమొత్తం పాటిస్తూ అనేక స్వచ్ఛంద సంస్థలు కూడా దీనిని ఉత్సవంగా జరుపుతూ ఉపాధ్యాయులను సత్కరిస్తూ వుంటే ఆరోజుననే కొన్ని ఉపాధ్యాయసంఘాలు నిరసన దినాలని, నల్లబ్యాడ్జీధారణ అని పిలుపు యివ్వడం విజ్ఞత అనిపించుకోదు.

**ఉపాధ్యాయుడు- జాతి**

నేడు చెప్పే చదువులలో అనేక అసంబద్ధాలు వున్నాయి. ఉపాధ్యాయునిపై అనేక ఆరోపణలువున్నాయి. ఈసంవత్సరం 268 పాఠశాలల్లో 10వ తరగతిలో ఒక్కరుకూడా పాసుకాలేదని అంటున్నారు. నిజమే దానిని మనం గుర్తిస్తాము. రవీంద్రనాథ్ ఠాగూరు అన్నట్లు "వెలుగుతున్న దీపమే మరికొన్ని దీపాలనువెలిగించగలదు. నిరంతరం నేర్చుకొనే ఉపాధ్యాయుడే ఇతరులకు నేర్పగలడు"అనేది అక్షరాలా యు.టి ఎఫ్. గుర్తులో వుంచుకొనే అకడమిక్ సెల్ స్థాపించింది.

దీనిద్వారా వర్క్‌షాపులు, సైన్సుక్లాసులు, ప్రదర్శనలు నిర్వహిస్తూ ఉపాధ్యాయులను సంసిద్ధపరచి, అంకితభావంతో పనిచేసేలా చేస్తున్నది

"బ్రతికున్నవాడు చనిపోయినవాని కంటే ఎంత గొప్పవాడో, చదువుకున్నవాడు చదువురానివానికంటే అంత ఉన్నతుడు" అన్న అరిస్టాటిల్ వాక్యాన్ని నిత్యం జ్ఞాపకం వుంచుకొని అక్షరాస్యులను తయారుచేయవలసివుంది. కాని ప్రభుత్వం మూడు సంవత్సరాల నుండి 20వేల ఉపాధ్యాయుల పోస్టులు నింపక, పాఠశాలలలో సబ్జక్ట్ టీచర్లు లేక, అసలు టీచర్లు లేకకొన్ని పాఠశాలలు మూతపెట్టి, అన్నిరకాల కుటుంబాల నుండి వచ్చి నూటికి 80 మంది పిల్లలు చదివే పాఠశాలలను భ్రష్టుపట్టిస్తూ, కాన్వెంటులను పొగుడుతూ వున్న ప్రభుత్వ విధానాలు వ్యతిరేకించవలసి వున్నది. విద్యాసంస్థలను కూడా ప్రయివేటుపరం చేసే ఆలోచనలు గట్టిగా ఎదిరించవలసివున్నది. చదివి కష్టపడి వ్రాసి పాసయిన సర్టిఫికెట్స్‌కు విలువ లేకుండా అన్నిటికి ఎంట్రన్స్‌లు పెట్టి, రెసిడెన్షియల్ పాఠశాలలను ప్రారంభించి సామాన్యులు కూడా ఆపోటీలో అప్పుల వూబిలో కూరుకుపోతున్న స్థితికికూడా ప్రభుత్వం కారణమని గమనించాలి. ఈ టీచర్స్ డే నాడు ఈకొన్ని వాస్తవాలు పరిశీలించి, తగు పరిష్కారానికి పూనుకోవాలని, విద్యావేత్తలకు ప్రజలకు విజ్ఞప్తి చేస్తున్నాను.

# శాంతి రెసిడెన్షియల్ కాలేజి

బ్యాంక్ కాలనీ, ఖమ్మం–2.

| మా అధ్యాపకుల అవిరళమైన కృషి | మా విద్యార్థుల నిరంతర శ్రమ | అత్యధిక ఫలితాలు 'శాంతి' అద్భుత విజయం |
|---|---|---|

**విద్యార్థి విజయం–మా ఆశయంగా'** ప్రారంభించిన మొట్టమొదటి సంవత్సరములోనే తెలంగాణా జిల్లాలలో అన్ని రెసిడెన్షియల్ కాలేజిల కంటే అత్యధిక మార్కులు (419/470), అత్యధిక ఫలితాలు (96/108) సాధించి ప్రథమస్థానములో నిలిచిన ఏకైక విద్యాసంస్థ – **'శాంతి రెసిడెన్షియల్ కాలేజి'**

## మా విద్యార్థులు సాధించిన ఇంటర్ ప్రథమ సంవత్సర మార్కుల వివరాలు

| S.No. | Hall Ticket No. | Name | M.P.C. Group Max Maths 150 | Physics 60 | Chemistry 60 | Total Marks 470 | Percentage of Marks |
|---|---|---|---|---|---|---|---|
| 1. | 702826 | G.Subramanyam | 147 | 58 | 57 | 419 | 89 1 |
| 2. | 702812 | M Appa Rao | 148 | 55 | 59 | 416 | 88.5 |
| 3. | 702846 | D Krishna Reddy | 144 | 58 | 57 | 409 | 87.02 |
| 4. | 702819 | J.Ramesh | 143 | 58 | 57 | 404 | 85.95 |
| 5. | 702820 | A.Ravi Kumar | 135 | 57 | 58 | 397 | 84.4 |
| 6. | 702912 | G.Venugopal | 121 | 55 | 49 | 393 | 84.0 |
| 7. | 702855 | Syam Kumar | 141 | 53 | 50 | 391 | 83.19 |
| 8. | 702813 | T.Sharma | 121 | 57 | 58 | 386 | 82.12 |
| 9. | 702814 | T Rama Krishna | 137 | 51 | 52 | 386 | 82.12 |
| 10. | 702811 | D.Anil Kumar | 138 | 55 | 50 | 384 | 81.7 |
| 11. | 702915 | N.Shiv Shankar | 136 | 56 | 43 | 383 | 81.48 |
| 12. | 702845 | T.Mahesh | 129 | 54 | 45 | 374 | 79 57 |
| 13. | 702842 | B.Satheesh | 123 | 49 | 44 | 368 | 78 29 |
| 14. | 702911 | Ch Satyam Babu | 107 | 57 | 50 | 366 | 77.87 |
| 15. | 702816 | D.Raghupathi | 109 | 44 | 57 | 364 | 77.44 |
| 16. | 702848 | Ch.Lokesh Reddy | 126 | 47 | 46 | 361 | 76 8 |
| 17. | 702834 | K.Praveen | 121 | 55 | 49 | 360 | 76 59 |
| 18. | 702752 | N.Nagendra kumar | 128 | 44 | 43 | 360 | 76 59 |
| 19. | 702909 | V.L.N.Rao | 121 | 46 | 41 | 359 | 76.38 |
| 20. | 702818 | P.Nageswar Rao | 131 | 47 | 38 | 356 | 75.75 |
| 21. | 702913 | Y.Ram Mohan Rao | 118 | 47 | 37 | 354 | 75.31 |
| 22. | 702843 | N.Srinivasa Rao | 122 | 50 | 45 | 354 | 75.31 |
| 23. | 702827 | P.Mangilal | 124 | 54 | 45 | 352 | 74 89 |
| 24. | 702824 | N.V.Parthasaradhi | 119 | 37 | 50 | 349 | 74.25 |
| 25. | 702822 | M.AnilKumar | 109 | 45 | 49 | 347 | 73.82 |
| 26. | 702823 | M Ravi Kumar | 110 | 46 | 48 | 346 | 73.61 |
| 27. | 702838 | N.Anil Kumar | 116 | 50 | 44 | 341 | 72.55 |
| 28. | 702908 | M.Chandra Sekhar | 127 | 42 | 31 | 341 | 72 55 |
| 29. | 702743 | K.Rami Reddy | 123 | 39 | 50 | 333 | 70.85 |
| 30. | 702754 | Ch.Satheesh | 117 | 40 | 41 | 330 | 70.21 |
| 31. | 702844 | A.Madhava Chary | 90 | 41 | 44 | 330 | 70.21 |
| 32. | 702815 | Galib Khan | 106 | 44 | 51 | 327 | 69.57 |
| 33. | 702833 | Y Prathap Reddy | 100 | 53 | 42 | 327 | 69.57 |
| 34. | 702916 | N.Kishore Kumar | 75 | 52 | 39 | 325 | 69.15 |
| 35. | 702940 | N Satheesh Babu | 110 | 47 | 37 | 325 | 69.15 |
| 36. | 702828 | N.B.V.Reddy | 114 | 44 | 35 | 324 | 68 93 |
| 37. | 702836 | D.Ravi Kumar | 112 | 44 | 36 | 320 | 68% |
| 38. | 702753 | M Rajewar Rao | 108 | 42 | 41 | 319 | 67 87 |
| 39. | 702825 | Y.Ravi Kumar | 97 | 43 | 45 | 319 | 67.87 |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 40. | 702841 | Sd.Jakir | 105 | 46 | 39 | 318 | 67 65 |
| 41. | 702835 | A.Srinivasa Rao | 101 | 42 | 38 | 316 | 67.23 |
| 42. | 702821 | K.S.Bhattar | 93 | 41 | 39 | 314 | 66.8 |
| 43. | 702831 | A.Narasimha Rao | 103 | 40 | 45 | 309 | 65.74 |
| 44. | 702910 | K.Srinivas | 70 | 46 | 41 | 304 | 64.68 |
| 45. | 702742 | V.Nageswar Rao | 120 | 34 | 48 | 303 | 64.46 |
| 46. | 702747 | M.Srinivasa Reddy | 97 | 35 | 44 | 299 | 63.61 |
| 47. | 702830 | M.Madhav | 87 | 47 | 37 | 299 | 63.61 |
| 48. | 702840 | S.Yesu Reddy | 85 | 50 | 36 | 299 | 63.61- |
| 49. | 702817 | K.Ravi | 91 | 39 | 30 | 298 | 63.4 |
| 50. | 702962 | S.Srinivas | 56 | 34 | 40 | 295 | 62.76 |
| 51. | 702847 | G.Ajay Kumar | 80 | 42 | 34 | 294 | 62.55 |
| 52. | 702807 | Sk.Meera Hussan | 87 | 38 | 45 | 395 | 62.34 |
| 53. | 702744 | Ch.Bhaskar Reddy | 111 | 34 | 39 | 238 | 81 37 |
| 54. | 702750 | B.Venkanna | 94 | 29 | 44 | 285 | 60.63 |
| 55. | 702832 | A.Chandra Sekhar | 83 | 51 | 31 | 284 | 60.42 |
| 56. | 702739 | N.V.Narasimha Rao | 105 | 26 | 36 | 282 | 60 |
| 57. | 702740 | P.Naveen Kumar | 101 | 36 | 34 | 276 | 58.72 |
| 58. | 702914 | V.Vikram | 60 | 39 | 21 | 252 | 53.61 |
| 59. | 702741 | S.Naveen Kumar | 82 | 37 | 32 | 251 | 53.4 |
| 60. | 702837 | P.Ramesh | 76 | 23 | 31 | 250 | 53.19 |
| 61. | 702839 | V.Naveen Kumar | 82 | 36 | 28 | 249 | 52.97 |
| 62. | 702829 | D.G.K.Raju | 70 | 30 | 27 | 245 | 52.12 |
| 63. | 702917 | D.Jagadeeswara Reddy | 78 | 24 | 30 | 245 | 52.12 |
| 64. | 702755 | T.Sarath Babu | 71 | 28 | 35 | 229 | 48.72 |
| 65. | 702918 | P.Kiran Kumar | 46 | 34 | 25 | 223 | 47.44 |
| 66. | 702737 | N.Venugopal Rao | 45 | 30 | 24 | 186 | 39.57 |

## Failed in M.P.C.

| | | | Eng | Sanskrit | Maths | Physics | Chemistry | Total |
|---|---|---|---|---|---|---|---|---|
| 67. | 702746 | M.Srinivarsa Reddy | 25* | 82 | 95 | 37 | 42 | 281 |
| 68. | 702738 | N.Hanumantha Rao | 22 | 66 | 102 | 29 | 39 | 258 |
| 69. | 702751 | G.Sunil | 20* | 65 | 96 | 18* | 21 | 220 |
| 70. | 702748 | Y.Srinivasa Rao | 23* | 66 | 25* | 26 | 38 | 178 |
| 71. | 702919 | P.Kiran Kumar | 45 | 50 | 29* | 25 | 23 | 172 |

*Indicates fail in the subject

# ఖమ్మంజిల్లాలో ఇంతవరకు ఏ విద్యాసంస్థ ప్రకటించని విధంగా మా కాలేజీ విద్యార్థులందరి ఫలితాలను ప్రకటించుటకు సంతోషిస్తున్నాము

## Bi.P.C.

| S.No. | Hall Ticket No. | Name Max | Botany 60 | Zoology 60 | Physics 60 | Chemistry 60 | Total 440 | % of Marks |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | 702979 | N. Saidulu | 43 | 53 | 49 | 48 | 352 | 80.00 |
| 2. | 702983 | Sk. Firoz | 41 | 52 | 44 | 51 | 335 | 76.13 |
| 3. | 702982 | N VeerabhadraRao | 55 | 46 | 44 | 50 | 332 | 75 50 |
| 4. | 702987 | Sk. Marebabu | 39 | 49 | 44 | 52 | 327 | 74.31 |
| 5. | 702977 | K Anilkumar | 45 | 41 | 51 | 39 | 324 | 73.63 |
| 6. | 703065 | B. Ravi Kumar | 46 | 47 | 56 | 44 | 313 | 71.13 |
| 7. | 703067 | Ch Anil | 42 | 55 | 30 | 45 | 304 | 69 09 |
| 8. | 703246 | M.Kishore Kumar | 46 | 34 | 27 | 41 | 302 | 68.63 |
| 9. | 703002 | D .Upender Reddy | 39 | 39 | 35 | 50 | 301 | 68.40 |
| 10. | 702998 | S V. Rami Reddy | 42 | 38 | 39 | 47 | 300 | 68.18 |
| 11. | 702992 | M. Negeswara Rao | 37 | 48 | 39 | 44 | 286 | 65 00 |
| 12. | 702994 | E. Pulla Rao | 41 | 50 | 30 | 44 | 286 | 65 00 |
| 13. | 702990 | P Venugopala Rao | 39 | 49 | 31 | 45 | 284 | 64 54 |
| 14. | 703003 | V. Srikanth | 31 | 35 | 32 | 47 | 284 | 63.4 |
| 15. | 702996 | T. suresh Kumar | 38 | 36 | 26 | 35 | 278 | 63 18 |
| 16. | 703247 | Sk Shajahan | 38 | 28 | 29 | 39 | 277 | 62.95 |
| 17. | 702999 | G. Surendar Reddy | 46 | 37 | 29 | 42 | 276 | 62.72 |
| 18. | 702991 | G. Rajeswar Reddy | 31 | 49 | 30 | 45 | 274 | 62.27 |
| 19. | 702997 | R. Vikas Kumar | 32 | 40 | 36 | 42 | 270 | 61.36 |
| 20. | 703066 | D Mohan Krishna | 31 | 42 | 22 | 21 | 263 | 59.77 |
| 21. | 702988 | S. Murali Krishna | 29 | 34 | 18 | 41 | 254 | 57 72 |
| 22. | 702984 | Sd Ahmadulla | 25 | 42 | 23 | 39 | 250 | 56 81 |
| 23. | 703001 | P. Vijay Kumar | 33 | 33 | 27 | 35 | 243 | 55.22 |
| 24. | 702993 | T. Nageswar Rao | 28 | 23 | 26 | 48 | 237 | 53 86 |
| 25. | 703000 | S V. Ramana Reddy | 24 | 27 | 38 | 35 | 231 | 52.5 |
| 26. | 702985 | M. BabuRao | 23 | 28 | 22 | 33 | 214 | 48.63 |
| 27. | 703006 | K. Shobhan Babu | 27 | 23 | 25 | 37 | 202 | 45.9 |
| 28. | 703007 | T.S.M. Prakash | 25 | 24 | 26 | 30 | 202 | 45.9 |
| 29. | 702989 | V. Appi Reddy | 21 | 30 | 21 | 30 | 202 | 45.9 |
| 30. | 702981 | K. Nageswar Rao | 21 | 25 | 21 | 29 | 177 | 40.22 |

## Failed in Bi.P.C.

| | | | English | Sanskrit | Botany | Zoology | Physics | Chemistry | Total |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 31. | 702978 | Ch. Ramesh | 36 | 81 | 21 | 35 | 21 | 15* | 209 |
| 32. | 703068 | Ch. Sivarama Krishna | 60 | 83 | 21 | 13* | 15* | 17* | 209 |
| 33. | 702995 | Ch.V. Kishore | 21* | 71 | 24 | 24 | 28 | 30 | 198 |
| 34. | 702986 | B.S. Reddy | 25* | 75 | 21 | 22 | 21 | 25 | 189 |
| 35. | 702980 | D. Ranga Reddy | 35 | 63 | 15* | 25 | 22 | 22 | 182 |
| 36. | 703074 | S. Naveen | 44 | 42 | 21 | 28 | 16* | 25 | 176 |
| 37. | 703004 | Y. Shanmukha Reddy | 24* | 48 | 08* | 22 | 21 | 31 | 154 |

*Indicates Fail in that Subject

మా విద్యార్థులు సాధించిన గరిష్ట మార్కుల వివరాలు: Maths: 148/150, Physics: 58/60, Chemistry: 59/60, Botany: 55/60, Zoology: 55/60, Sanskrit: 95/100, English: 78/100.

అద్భుత ఫలితాలు, అఖండ విజయం సాధించినందుకు అధ్యాపక బృందానికి మా కృతజ్ఞతలు. విద్యార్థులకు మా అభినందనలు.

## సంస్మరణ: జాషువా

**–రాధారపు భిక్షపతి, నేలపట్ల**

(ఈనెల మహాకవి జాషువా జన్మదినోత్సవం సందర్భంగా వ్రాసిన వ్యాసం ఇది)

మహాకవి జాషువా 1895 సెప్టెంబరు 28వ తేదీన వినుకొండలో వీరయ్య లింగమాంబల దంపతులకు జన్మించారు. ఈయన తల్లిదండ్రులది వర్ణాంతర వివాహమే. ఆరోజుల్లో వీరి వివాహం వల్ల ఉభయపక్షాల నుంచి తీవ్రమైన నిరసన, నిరాదరణ ఎదురయ్యాయి. వీరిద్దరి కలయిక ఒక కొత్త తిరుగుబాటుకు నాందిగా పరిగణింపబడింది. వీరి వివాహానికి ఆనాటి సంఘ సంస్కరణోద్యమాల ప్రభావం పరోక్షంగా వున్నదని భావించవచ్చును.

జాషువా ఉభయ భాషా ప్రవీణులై చాలాకాలం వినుకొండలో ఉపాధ్యాయులుగా వున్నారు. తర్వాత మదరాసు ఆకాశవాణి కేంద్రములో ప్రయోక్తగా పనిచేశారు. కొంతకాలం శాసనమండలి సభ్యులుగా కూడా వున్నారు.

జాషువాను సంపూర్ణంగా అవగాహన చేసుకోవాలంటే ఈ క్రింది విషయాలపై ఆయన దృక్పథాన్ని తెలుసుకోవలసి వుటుంది.

### ఆధునిక కవిగా

మారుతున్న కాలంతోపాటు జాషువా వ్యక్తిగాను, కవిగాను పరిణామం చెందారు. తన నుంచి సమాజాన్ని ఎప్పుడు విడదీసి ఆయన చూడలేదు. ఆయన సామాజిక నిబద్ధతగల కవి. ఆయనలో నూతన వ్యవస్థ కోసం, సర్వజన సమానత్వం కోసం తపించే ఆశయం కన్పిస్తుంది. తెలుగు జాతి గర్వింపదగిన సాహిత్య మూర్తి. ప్రజల అభిరుచుల కనుగుణంగా ఉద్గ్రంథ రచనకు స్వస్తిచెప్పి, ఖండ కావ్యాలను అల్లిన నవ్యకవి. భారతీయ మహా పురుషులను గూర్చి, ప్రస్తుత సమాజంలోని కులాల హెచ్చు తగ్గుల నిర్మూలన లక్ష్యంగా రచించిన అనేక ఖండ కావ్యాలు సుప్రసిద్ధాలు.

### జాషువా రచనలు

వీరి కావ్యాలు, ఖండ కావ్యాలు దేశంలో అత్యాదరణ సంపాదించుకున్నాయి. ఫిరదౌసి, గబ్బిలం, స్వప్నకథ, క్రీస్తు చరిత్ర మొదలైన కావ్యాలు రచించారు. ఇవేకాకుండా ముంతాజ్ మహల్, కాందిశీకుడు మొదలైనవి అతని ఇతర రచనలు.

### కులదృక్పథం

అనాదిగా భారతదేశం కుల వ్యవస్థకు నిలయంగా వుంది. జాషువా అంటరాని కులంలో పుట్టడం వల్ల వర్ణ విచక్షణకు గురికావడమే కాకుండా ఆయన కవిత్వం కూడా నిరాదరణకు గురైంది. అయినా జాషువా ఈ అననుకూల వాతావరణాన్ని ఛేదించుకున్నాడే తప్ప కృంగిపోలేదు. వీరి కుల దృక్పథం విశాలంగా ఆలోచించడానికి, విశ్వ మానవుడిగా పరిణామం చెందడానికి దోహదపడిందని ఆయన జీవితం, సాహిత్యం స్పష్టం చేస్తున్నాయి.

### మతదృక్పథం

మతం మానవ జాతికి మేలుకంటే కీడే ఎక్కువగా చేస్తుందని జాషువా భావించాడు. ఒక అంటరానివాడు హిందూ మత గ్రంథాలను అపవిత్రం చేస్తున్నాడని కొందరు భావించారు. ఒక క్రైస్తవుడు హిందూ మత ప్రచారం చేస్తున్నాడని క్రైస్తవ మతాధిపతులు ఉగ్రులై సంఘం నుంచి వెలివేశారు. హిందువులు కూడా ఆయనను ఆదరించలేదు. జాషువా అనుభవించిన ఈ సంఘర్షణ మతం మీద ఆయనకొక అవగాహన, ఆవేశాన్ని కలుగజేసింది. ఈ ఆవేశమే గబ్బిలం కావ్యంలో బలంగా ధ్వనింపచేశాడు.

### హేతువాద దృక్పథం

జాషువా హేతువాదం మీద ఆసక్తి పెంచుకోవడం మాత్రమే కాకుండా ఆచరణలో కూడా పాటించాడు. తన కూతురిని గోరా కొడుకుకు ఇచ్చి పెళ్ళి జరిపించడం ఆయన జీవిత నిబద్ధతకు బలమైన గుర్తుగా పేర్కొనవచ్చు. హేతువాదం వల్ల కొన్ని నమ్మకాలు, కొన్ని సంఘ దురాచారాలు రూపుమాసిపోతాయని ఆయన విశ్వాసం. ఈ విశ్వాసమే ఆయనకు హేతువాదం మీద అభిరుచిని పెంచి ఉంటుందని భావించవచ్చు

### దళిత దృక్పథము

జాషువా కవిత్వంలో స్వీయానుభవ జీవిత వాస్తవికత ప్రతిబింబించింది. జాషువా వ్రాసిన గబ్బిలం కావ్యంలోని పద్య పంక్తులన్నీ హృదయ విదారమైన దళితుల దుర్భర జీవితాలకు సంబంధించిన వాస్తవిక దృశ్యాలు. వీరి కలం నుండి జాలువారిన ప్రతి అక్షరం హృదయ స్పందనం నుండి వెలువడినదే.

### బిరుదులు

జాషువాకు నవయుగ చక్రవర్తి, కవికోకిల, కవితా విశారద మున్నగు బిరుదులు కలవు. వీరిని గండపెండేరం, కనకాభిషేకం, గజారోహణం మొదలగు సత్కారాలతో తెలుగువారు గౌరవించినారు ఆంధ్ర విశ్వ విద్యాలయం కళాప్రపూర్ణ బిరుదంతో, భారత ప్రభుత్వం పద్మభూషణ బిరుదంతో సన్మానించింది. వీరి క్రీస్తు చరిత్ర కావ్యానికి కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి లభించింది. వారికెన్ని బిరుదులున్నా కూడా వాటిలో కవికోకిల అన్న బిరుదే సుప్రసిద్ధంగా సార్థకత్వం పొందింది.

భావాన్ని మనసుకు హత్తుకునే విధంగా వ్యక్తీకరించడంలో సిద్ధహస్తుడిగా సామాజిక విమర్శన దృష్టికలవాడుగా, తెలుగు పద్యాన్ని సార్వజనీనం చేసిన కవిగా ప్రసిద్ధిపొందిన కవికోకిల మహాకవి జాషువాగారు 1971 సంవత్సరంలో పరమపదించారు.

## రాత్రి వెలుగు

**–చెళ్ళపిళ్ళ శ్యామల**

ఆమె: సందకాడ సదవరా–సింతలన్ని మరవరా!
అతడు: సందేల సింతేల! సదువుగోల మనకేల!
ఆమె: రాత్రి బడికి ఎల్దామురా–సక్కని మావ
మనం రాత నేర్చుకుందాముర సందామావ
అతడు: ఇంత వోల్ల మయ్యాక ముద్దుల భామా
మనం సదివేమి సెయ్యాలే సక్కని భామా
ఆమె: అచ్చరాలు నేర్చుకొంటే ఒల్లరి మావ
మనం మోసపోక బతకొచ్చురా ముద్దుల మావ
అతడు: సరే తెలివిగలిగి వుందామే గడసరి పిల్లా
మనం సదువు నేర్చుకుందామే మరదలు పిల్లా
ఇద్దరూ: సదివి మనం మనవోల్లని సదివిద్దామూ
మన వాడోల్ల బతుకులను వెలిగిద్దామూ.

# మనమూ–మన ఆరోగ్యమూ

## పిల్లల్లో వృత్తి రుగ్మతలు

**డా॥ బ్రహ్మారెడ్డి**

పిల్లలు చేసేది వృత్తికాదు కదా, వారికేం వృత్తి రుగ్మతలు వస్తాయని మీరు అడగవచ్చు 14 సం॥రాల లోపు పిల్లలను పనుల్లో పెట్టరాదని పకడ్బందీగా చట్టమ ఒతే ఉందికాని దాన్ని పరిశ్రమాధిపతులు పకడ్బందీగా ఉల్లంఘిస్తూనే ఉన్నారు. ఈ పిల్లలకు ఎటూ ఆ వృత్తిని బట్టి వృత్తి రుగ్మతలు రాకతప్పదు.

స్కూలు కెళ్ళే పిల్లలకు వచ్చే వృత్తి రుగ్మతలు చూద్దాం. స్కూలు కెళ్ళడం వృత్తి కాదు. కాని కేవలం స్కూలు కెళ్ళడం అనేపని వలన కొన్ని జబ్బులు వస్తాయి. కాబట్టి వాటి గురించి చూడక తప్పటంలేదు.

### చర్మవ్యాధులు

ఫలానావాళ్ళు స్కూలు కెళ్లే పిల్లలని గుర్తించటానికి కొన్ని గుర్తులున్నాయి. యూనిఫాం, కాళ్ళకు బూట్లు, మెడలో టై వగైరాలవి. స్కూలు యూనిఫారం గురించి అంతగా అనటానికేమీ లేదుగాని, ఉష్ణ దేశాల్లో ఉండే మనం బాగా గాలి ఆడేట్లు చూసుకోవాలి. కాలికి నిండుగా బూటు, దానిలోపల సాక్సు వేయటం వలన కాలికి బొత్తిగా గాలి ఆడదు. ఆ సాక్సు కూడా ఎన్నాళ్ళకోసారి ఉతుకుతామో తెలియదు. ఉతికితే త్వరగా చినిగిపోతాయని భయం. ఉతక్కపోతే భరించలేని వాసన. గాలి ఆడని కారణంగా కాలి వేళ్ళమధ్య వాచిపోతుంది. దాని మీద క్రిములు చేరితే చీము పట్టవచ్చు.

మెడదగ్గర గుండీ బిగించి టై కడ్తాము. పై నుంచి ఇక గాలి దూరే సమస్యలేదు. వంటిమీద పట్టిన చెమట గాల్లో కలిసే అవకాశమే లేదు. చెమట ఎక్కువ నిలవ ఉన్నందున వళ్ళు పేలటం (చెమటకాయలు) జరుగుతుంది. దురద, మంట మొదలవుతాయి. దురద భరించలేక గీరితే పుండ్లు పడ్తాయి. చక్కగా యూనిఫాం, బూటు, టై కట్టుకుని ఎదురుగా నిల్చుడితే ఎంత ముద్దుగా ఉంటారో పిల్లలు అనుకుంటాం. అదీ ప్రక్కనున్నవాళ్ళతో చెప్తాము. వాళ్ళు బొమ్మలయితే అలాగే ఉండేది. పిల్లలయి పోతిరి. ఇంగ్లీషు వారిది చలి దేశం కాబట్టి ఇవన్నీ లేకపోతే చలికి బిగుసుకు చచ్చిపోతామని భావించారు వారిని కాపీచేయటం మన హక్కయితే కావచ్చు గాని మరీయింతగానా!

### గూనిబాబు

మూడడుగుల పొడవు కూడాలేని పిల్లవాళ్ళు 5-6 కిలోల బరువుండే పుస్తకాల సంచులు వీపుకు తగిలించుకొని కాన్వెంటులకు వెళ్ళటం అందరమూ రోజూ చూస్తూనేవుంటాము. అంతబరువు మోయాలంటే ముందుకువంగి నడవాల్సిందే. చిన్న పిల్లల్లో నడుంనొప్పులు, గూని సాధారణంగా వైద్యులకు ఎదురుకావు కాని ఈ పుస్తకాల సంచుల వలన అవి కూడా చూడాల్సిన పరిస్థితి వచ్చింది. ఎటూ ఈ పిల్లలకు ఉద్యోగాలు వస్తాయనే గ్యారంటీ ఎవరూ యివ్వటంలేదు. కనీసం మూటలు మోసయినా బ్రతకటానికి అవసరమైన తర్ఫీదు యిస్తున్నామని తృప్తిపడాలి మనం.

### పిల్లల్లో మానసిక వత్తిడి

ఆడుతూపాడుతూ బతకాల్సిన బాల్యం రోజు రోజుకూ కుదించుకుపోతూ ఉంది. భార్యాభర్త యిద్దరూ పని చేయాలి కాబట్టి ఎంత త్వరగా పిల్లలను ఇంట్లోంచి వదిలించుకుంటే అంతమంచిది. 3వ ఏడు రాగానే "కే-జి" క్లాసులో కేస్తేసరి కనీసం 5 సం॥రాలు దాకానయినా బాల్యాన్ని అనుభవించాల్సిన పిల్లలు రెండు-మూడేళ్ళు "కే-జీ" లకు ధారబోస్తున్నారు.

పిల్లలు రైమ్స్ చక్కగా చెప్తే తల్లిదండ్రులకూ, టీచర్లకూ ఆనందం. పిల్లలు ఆలోచించినా, ఆలోచించి ప్రశ్నలు వేసినా అందరికీ చిరాకు.

పిల్లల సృజనాత్మకతకు ఒక్క పరీక్షా ఉండదు పుస్తకాల్లో రాసింది భట్టీయం పట్టాలి సారాంశం అర్థమయినా, కాకపోయినా పరీక్షల్లో విదిలించాలి. బాగా విదిలించితే మంచిమార్కులు వస్తాయి. మార్కులను బట్టి పిల్లల తెలివితేటలను లెక్కగట్టే స్థితి వచ్చింది. ఎన్ని ర్యాంకులు, ఎంత పర్సంటేజీలనేదాన్ని బట్టి కాన్వెంటుల రేటు పలుకుతుంది. ఎన్ని సినిమాలు విజయవంతమైనాయనేదాన్ని బట్టి నటుడి రేటు పెరిగినట్లు! (నటనలో సరుకు ఉన్నా లేకపోయినా) మార్కులు ఎలా వచ్చాయని పరిశీలించటం కూడా పోయి, కాపీలు చేయటం హీరోయిజం క్రింద మారిపోయింది.

ఎన్నిసార్లు చదివాడనేది ముఖ్యం. ఎక్కువసార్లు చదివితే ఎక్కువ గుర్తుంటుందా అంటే జవాబు శూన్యం.

ఒక్క క్షణం ఆలస్యంగా స్కూలుకు పోయే పరిస్థితి వస్తే పిల్లలకు వల్లమాలిన భయం. టీచర్లు తంతారు. (నిజంగానే తంతారు) అందుకని స్కూలు ఎగ్గొట్టటానికైనా వెనుకాడటంలేదు. జుట్టు వంగలేదనీ, నూనె పూయలేదనీ, క్రాపు చేయించలేదనీ- యిలాంటివే చదువుకు సంబంధంలేని సవాలక్ష కారణాలకు పిల్లలను ఉతుకుతుంటాము.

పర్యవసానంగా పిల్లల్లో మానసిక ఆందోళన, మానసిక రుగ్మతలు వస్తున్నాయి. హిస్టీరికల్ లక్షణాలు చూస్తున్నాము. పిల్లల్లో తలనొప్పి, కారణం తెలియని ఎక్కిళ్ళు, కుడిచేయి నొప్పి, నిద్రలో మూత్రం విసర్జించడం - మన తర్వాతి తరాన్ని రోగిస్టులుగా మార్చుతున్నామేమో గమనించాలి

సృజనాత్మకతకు చోటులేని నేటి చదువుల వలననే పెద్దయిన తర్వాత కూడా శాస్త్రీయ దృక్పథం ఉండదు. దేశభక్తి ఉండదు. సైన్సును బ్రతుకుదెరువు సాధనంగా చూస్తారు కాని, బ్రతుకులో భాగంగా చూడరు. అందుకే చదువుకొన్న వారిలో మూఢ నమ్మకాలు పుష్కలంగా ఉన్నాయి. మూఢ నమ్మకాలకు శాస్త్రీయ వివరణ ఇచ్చే ధోరణి ప్రబలింది. దీన్నే "సూడో సైన్స్" అంటాము.

ఒకవైపు మానసిక రుగ్మతలు, మరోవైపు ఆలోచించని యంత్రాలుగా మారటం- దీనికి విద్య అనే "వృత్తి" బాధ్యత వహించాలి. ఇదోరకం వృత్తిరుగ్మతే!

## ప్రశ్నలు-జవాబులు

**ప్రశ్న: నాభార్యకు గొంతు మీద కణితి వుంది. అది ప్రమాదమా?**

**-గుణశేఖర్, బందర్.**

జవాబు: ఆమె వయస్సు ఎంతో రాయలేదు. గొంతు మీద కణితి ఎక్కువ సందర్భాలలో థైరాయిడ్ గ్రంధి యొక్క వాపు అయ్యుంటుంది అయితే అది ఏరకమైన వాపో డాక్టరు నిర్ధారించవలసి వుంటుంది. ఫైన్ నీడిల్ ఏస్పిరేషన్ బయాప్సీ అనే పరీక్ష ద్వారా కణితి స్వభావాన్ని నిర్ధారణ చేయవచ్చు నిర్ధారణ జరిగాక ఆపరేషన్ చేసి తొలగించాల్సి రావచ్చు. ఆపరేషన్ ప్రమాదకరమేమీ కాదు. కొన్నిసార్లు మనం గుర్తించలేకుండానే ఆ కణితి కాన్సర్‌గా మారే ప్రమాదముంది అందువలననే దాన్ని గురించి పట్టించుకోవడం మంచిది.

**ప్రశ్న: సీతాఫలం తింటే జలుబు చేస్తుందా? రంగప్రసాద్, బొమ్మిరెడ్డిపాడు.**

జవాబు: జలుబు చేయటానికి కారణం వైరస్. ఆ వైరస్ సీతాఫలంలో వుండదు. జలుబు రావటానికి కారణభూతమైన వైరస్ ఒకరకంకాదు. అనేక రకాలున్నాయి. ఒక రకంతో ఒకసారి జలుబు చేస్తే ఆరునెలల వరకూ ఆ రకంతోరాదు. కాని మరో రకంతో రాకూడదని లేదు. సీతాఫలంలో ఏ విటమిను లాంటి మంచి పోషక పదార్థాలున్నాయి. జలుబు చేస్తుందనే పేరుతో సీతాఫలాలు వదులుకోవటం మంచిపనికాదు

**ప్రశ్న: తులసి మొక్కకు ఎయిడ్స్ రోగాన్ని జయించే గుణాలున్నాయని అంటున్నారు. నిజమేనా? రంగరాయ శర్మ, జమ్మికుంట.**

జవాబు: అలాంటి గుణాలు తులసి కుంటే ఆహ్వానించే వారిలో నేమా ముందుంటాను ఎయిడ్స్ రోగులను ఎలా కనుక్కున్నారు? ఎంత మందికివాడారు? తులసి ఆకునా, గింజలనా, కాండాన్నా? దేన్ని వాడారు? ఏరూపంలో ఉపయోగించారు? ఎంత డోసులో వాడారు? వాడకముందూ వాడిన తరువాత కణాల స్థాయిలో రోగ లక్షణాల స్థాయిలో, జీవన ప్రమాణం పెరగటం విషయంలో గమనించిన లక్షణాలేమిటి? వాటిని ఎక్కడ రికార్డు చేశారు? వాటిని మనందరూ పరిశీలించవచ్చా? ఇలాంటివే అనేక ప్రశ్నలు వేయడం మనందరి హక్కు? వాటికి జవాబులు చెప్పటం ఔషధ గుణాలున్నాయని చెప్పేవారి బాధ్యత. ఇదంతా జరిగితేనే శాస్త్ర సమ్మతమవుతుంది కేవలం వ్యక్తుల అభిప్రాయాలకూ, వ్యక్తి అనుభవాలనబడే వాటికీ సైన్సుకు సంబంధంలేదు. నిరూపించబడే వరకూ ఏదీ సైన్స్‌కాదు.






హైస్కూలు, కళాశాల విద్యార్థులందరికీ

# కల్పతరువు

**విద్యార్థుల విజయానికి మెట్లు! వి.జి.ఎస్. ప్రచురణలు!**

10వ తరగతి : అన్ని సబ్జెక్టులకు టెస్ట్ పేపర్‌లు
(1985 నుండి 1993 వరకు పబ్లిక్ పేపర్లు సమాధానాలతో సహా)
10వ తరగతి : సులభతరమైన Question Banks
7వ తరగతి : క్రొత్త మోడల్స్‌లో అన్ని సబ్జెక్టులకు టెస్ట్ పేపర్లు
6వ తరగతి నుండి 10వ తరగతి వరకు : అన్ని సబ్జెక్టులకు గైడ్లు, Question Banks
2,3,4,5 తరగతులకు : ఆధునిక మూల్యాంకన దర్శినులు మా ప్రత్యేకత.

**తరగతి ఏదైనా ప్రథమ తరగతి ఉత్తీర్ణతకు మార్గదర్శనం మా లక్ష్యం!**

ఇంటర్ ప్రథమ & ద్వితీయ సంవత్సరములకు
మార్గదర్శకమైన గైడ్లు! మార్కులు తెచ్చే టెస్ట్ పేపర్లు!!
మరియు గ్రామర్లు, డిక్షనరీలే కాకుండా సెకండరీ గ్రేడ్ ఉపాధ్యాయుల
ఎంపిక కొరకు ప్రత్యేకముగా తయారు అయిన గైడ్లు

**అంతేనా...!**

డిగ్రీ ప్రథమ, ద్వితీయ & తృతీయ సంవత్సరాల విద్యార్థులకు
కామన్ కోర్ సిలబస్ ప్రకారం తాజా గైడ్లు

## వి.జి.ఎస్. పబ్లిషర్స్

ఫోన్ నెం: 66748

డోర్ నెం. 11-3-6, బ్రాహ్మిన్ స్ట్రీట్ విజయవాడ-520001



(93 స్కేల్స్‌లో ఉపాధ్యాయులకు 8/16 సం॥ స్కేళ్ళు)

GOVERNMENT OF ANDHRA PRADESH
ABSTRACT

Public Services - Revised Scales of Pay, 1993 - Automatic Advancement Scheme in the Revised Scales of Pay 1993 - Extension to Teachers - Orders - Issued.

---

FINANCE & PLANNING (FW.PC.II) DEPARTMENT
**G.O.(P) No.311. Dated: 20.8.1993**

Read the following:

1. G.O.Ms.No.117, Finance and Planning (FW.PRC.I) Department, Dated: 25.5.1981
2. G.O.Ms.No. 266, General Administration (Ser.A) Department, Dated: 25.5.91.
3. G.O.Ms.No.164. Finance and Planning (FW.PRC.I) Department, Dated: 1.6.1982.
4. G.O.Ms.No.78, Finance and Planning (FW.PRC.I) Department, Dated: 13.3.1984.
5. G.O.Ms.No.288, Finance and Planning (FW.PRC.I) Department, Dated: 17.11.1986.
6. G.O.(P).No.2, Finance and Planning (FW.PRC.I) Department, Dated: 4.1.1988.
7. G.O.Ms.No.151, Education (Ser.IV) Department, Dated 25.4.1989.
8. G.O.Ms.No.347, Finance and Planning (FW.PRC.I) Department, Dated: 17.11.1989.
9. G.O.(P).No.162, Finance and Planning (FW.PC.I) Department, Dated: 20.5.1993.
10. G.O.Ms.No.290, Finance and Planning (FW.PC.II) Department, Dated: 22.7.1993.

****

ORDER:

In the G.O. First read above, orders were issued introducing a Scheme of Automatic Advancement for the benefit of those State Government Employees who are drawing pay in the Revised Pay Scales of 1978 falling under Grades-I to XVIII other than teaching staff of the Schools, Junior and Degree Colleges who have put in ten or fifteen years of service in a scale without getting promotion to a higher post. In the Government Order 3rd read above, orders were issued extending this scheme to the teachers working in the Schools of Government, Municipalities, Municipal Corporations, Zilla Parishads and Panchayat Samithis and also Aided Managements. Consequent on regrouping the pay scales of Teachers vide G.O.Ms.No.1000(S) Education Department, dated 17.12.1982 and constituting a separate category of Head-masters vide G.O.Ms.No.883, Education Department, dated 5.11.1982. orders were issued modifying the Automatic Advancement Scheme pertaining to Teachers with effect from 1.12.1982. vide Government Order 4th read above. The pay Revision Commissioner 1986 among other things has recommended for the continuation of Automatic Advancement Scheme. In addition, he has recommended for extention of the scheme to the employees drawing pay upto Grade XVIII in the Revised Pay Scales 1986. He has also introduced another level of Advancement after completion of 22 years of Service. In the G.O. 6th read above, orders were issued revising the Automatic Advancement Scheme as recommended by the Pay Revision Commissioner, 1986. In the G.O. 8th read above, orders were issued extending the Revised Automatic Advancement Scheme as recommended by the Pay Revision Commissioner 1986 to the Teachers. Keeping in view the various situations that arose in the course of implemention of the scheme, various clarifications and amendments were issued from time to time.

2. In the G.O. 9th read above, orders were issued based on the recommendation of the Pay Revision Commissioner 1993 to the State Government employees with effect from 1.1.1993 with monetary benefit from 1.4.1993.

3. The Pay Revision Commissioner, 1993 has recommended for continuance of Automatic Advancement Scheme with the following modifications:

i) The extension of Automatic Advancement Scheme to Special Promotion Post II Level may be dropped.

ii) On completion of 24 years of service without promotion though fully eligible for promotion to Special Promotion Post I, benefit of one increment may be allowed. The benefit of one increment on completion of 24 years of service will not be available to those already in Special Promotion Post II/Special Adhoc Promotion Post II scale.

iii) Those in Special Promotion Post II/Special Adhoc Promotion Post II scale will continue to be in those scales.

iv) Provisions of G.O.Ms.No.297, Finance, dated 25.10.83 may be extended to similar cases which have arisen on acount of implementation of Special Promotion Post II/Special Adhoc Promotion Post II levels.

v) The FRs may be amended to limit the benefit of FR 22 (B) only to those who have not got any benefit from Automatic Advancement Scheme.

vi) Revised rules on Automatic Advancement Scheme may be implemented from the date of issue of these orders.

4. In the G.O. last read above, orders were issued modifying the Automatic Advancement Scheme as recommended by Pay Revision Commissioner 1993. While issuing the above orders, it was indicated that separate orders would be issued for implementation of the scheme in respect of Teachers. Accordingly, the following instructions are issued in Automatic Advancement Scheme as recommended by the Pay Revision Commissioner 1993.

(i) These orders shall come into force with effect from 1.8.1993.

(ii) These orders shall be applicable to all the teachers who are drawing pay in Grade I to XXI i.e., upto and inclusive of the Revised scale of Rs.3880-130-4400-160-5200-190-6150-230-7300-280-8140 working in the Schools of Government, Municipalities, Municipal corporations, Zilla Praja Parishads, Mandal Praja

Parishads and Aided Managements.

(iii) All amendments, clarificatory instructions and orders issued or to be issued in connection with the implementation of the scheme introduced through the Government Order first read above shall be applicable to this scheme, except where anything is specifically provided to the contrary.

(iv) Wherever orders are required to be issued in respect of employees other than Government employees, the Administrative Departments of Secretariat concerned with those employees shall issue necessary orders in this regard in consultation with Finance and Planning (FW) Department.

(v) The Pay scales of the Special Grade/Special Promotion Post/Special Adhoc Promotion Post for the Teachers shall be as indicated in the Annexure to this order.

(vi) On completion of eight years of service which counts for increments, a teacher is eligibe to be placed in the Special Grade Scale, in Revised Pay Scales 1993, notified in the G.O. last read above.

(vii) On completion of 16 years service which counts for increments, a teacher shall be eligible to be placed in the "Special Promotion Post Scale"/ "Special Adhoc Promotion Post Scale" as the case may be. For placing a Teacher to the Special Promotion Post, he has to be fully qualified to the promotion post as prescribed in the Service Rules. Teachers in Category-III shall be eligible to be placed in Special Promotion Post Scale Provided they pass the Professional Advancement Test prescribed in G.O.Ms.No.166, Education Department, dated 9.3.1984.

(viii) The Language Pandits Grade-I shall be eligible to be placed in Special Promotion Post Scale Provided they pass the simple Orientation Test prescribed in G.O.Ms.No.151, Education Department, dated 25.4.1989. However, they are entitled for appointment to Special Promotion Post Scale from the last date of the examination in cases where they passed the test after completion of 15 years of service.

(ix) Fixation of pay on appointment to special Grade/ Special Promotion Post Scale/Special Adhoc Promotion Post Scale shall be under F.R. 22(a)(i) read with FR 31(2).

(x) On completion of 24 years of service which counts for incements a teacher shall be sanctioned one increment in the existing scale i.e., Special Promotion Post Scale/Special Adhoc Promotion Post Scale, as the case may be. This is in addition to the normal increment. In respect of teachers whose date of normal increment is different from the date of completion of 24 years of service, the date of next increment shall accrue after completion of one year of servic from the date of drawal of increment allowed on completion of 24 years of service.

(xi) Consequent on the implementation of Master Scale, the fixation of pay on appointment to Special grade/ Special Promotion Post/Special Adhoc Promotion Post will accrue full increment as against half increment earlier, and if an employee is directly promoted to a post, his pay is fixed under FR.22(B) and the employee will be benefitted by two increments. As a result of introduction of Master Scales, the benefit would be more in respect of employees who are promoted while holding Automatic Advancement grades when compared to the benefit to those promoted directly without getting the benefit under Automatic Advancement Scheme. Government have decided that fixation of pay of a teacher who is holding Special grade/Special Promotion Post when he is promoted to the post under Service Rules, shall therefore be fixed under FR.22(a)(i) in modification of the orders issued in G.O. 8th read above.

(xii) The existing orders governing appointment to Special Promotion Post II/Special Adhoc Promotion Post II are withdrawn with immediate effect.

5.(i) teachers who are already enjoying 36the benefits of Special Grade on Completion of 10 years of service under existing scheme are not eligible for the benefit indicated in para 4(vi) above. They shall be eligible for appointment to the Special Promotion Post/Special Adhoc Promotion Post as the case may be on completion of 16 years of service in that particular category as ordered in para 4 (vii) above, To be more specific, if a teacher has completed 11 years of service on the date of issue of thse orders and enjoying Special Grade, the orders in para 4 (vi) do not apply. He shall be eligible for appointment to Special Promotion Post/Special Adhoc Promotion Post on completion of 16 years of service including the service rendered in Special Grade Post i.e., after 5 years.

(ii) teachers who are already enjoying the benefits of Special Promotion Post-I/Special Adhoc Promotion Post-I on completion of 15 years of service under existing scheme are not eligible for the benefit indicated in para 4 (vii) above. They shall be eligible for the benefit indicated in para 4 (x) above on completion of 24 years of service in that particular category. To be more specific, if a teacher has completed 17 years of service on the date of issue of these orders and enjoying Special Promotion Post/Special Adhoc Promotion Post-I the orders in para 4(vii) do not apply. He shall be eligible for benefit envisaged in para 4 (x) above on completion of 24 years of service including the service rendered in Special Promotion Post-I/Special Adhoc Promotion Post/I i.e. after 7 years.

(iii) teachers who are already enjoying the benefits of Spécial Promotion Post-II/Special Adhoc Promotion Post-II on completion of 22 years of service under existing scheme are not eligible for the benefit indicated in para 4(x) above.

6. The teachers who are already drawing Special Promotion Post-II/Special Adhoc Promotion Post-II scales shall continue to draw the scales as personal to them.

7. The teachers who are already enjoying Automatic Advancement Scales on promotion to the regular channel of posts or appointment to further automatic advancement post shall be governed by the new set of rules as the old scheme will no longer be in operation from the date the modified scheme comes into force. In respect of those who were eligible to be appointed to the Special Grade/Special Promotion Post-I/Special Adhoc

Promotion Post-I/Special Promotion Post-II/Special Adhoc Promotion Post-II, but not appointed so far, they shall be governed by the old rules on appointment to the above posts from the respective dates of eligibility and therefore, on their appointment their pay shall be regulated according to the rules in force at that time i.e., their pay shall be fixed under FR 22 a (i) on appointment to the Special Grade/Special Promotion Post-I/Special Adhoc Promotion Post-I/Special Promotion Post-II/Special Adhoc Promotion Post-II; on promotion from Special Grade/Special Promotion Post-I under regular channel of promotions shall be fixed under FR 22 (B) and on promotion from Special Promotion Post-II the pay shall be fixed under FR 22(a) (i).

(By Order and in the name of the Govenor of Andhra Pradesh)

A.R.JAYA PRAKASH,
Special Secretary to Government.

## ANNEXURE

| Category | Ordinary Grade Scale | Special Grade Scale | Spl. Promotion Post/Spl. adhoc Promotion Scale. |
|---|---|---|---|
| Category-I | Rs. | Rs. | Rs. |
| Head Masters of Secondary School | 3110-6380 | 3310-6840 | 3640-7580 |
| **Category-II** | | | |
| School Assistant Gr.I | 2525-5390 | 2600-5580 | 3110-6380 |
| School Assistant Grade-II (Special Category) | -do- | -do- | -do- |
| School Assistant Grade-I (Ordinary Category) | -do- | -do- | -do- |
| Post Graduate Assistant | -do- | -do- | -do- |
| Gr.I. Language Pandits (Special Category) | -do- | -do- | -do- |
| Gr.I. Language Pandits (Ordinary Category) | -do- | -do- | -do- |
| Physical Directors Gr. II. (Special Category) | -do- | -do- | -do- |
| Physical Directors Gr. II | -do- | -do- | -do- |
| Category-III | | | |
| Gr.II. Language Pandits (Trained/Untrained) | 1975-4010 | 2075-4270 | 2525-5390 |
| Grade.III Language Pandits | -do- | -do- | -do- |
| Secondary Gr. Trained Teachers (Special Category) | -do- | -do- | -do- |
| Secondary Gr.Trained Teachers (Ordinary Category) | -do- | -do- | -do- |
| Higher Grade and other similar categories to be specified | -do- | -do- | -do- |
| Lower Grad Teachers | -do- | -do- | -do- |
| Craft Instructors, Drawing Teachers Music Teachers (Gr.I), and other Similar categories to be specified | -do- | -do- | -do- |
| -do-Grade.II | -do- | -do- | -do- |
| Physical Training Instructors (Gr.I) | -do- | -do- | -do- |
| Physical Training Instructors (Gr.II) | -do- | -do- | -do- |

**(91జూన్‌కు పూర్వం రిటైరైన/మరణించిన గ్రేడు–1 పండితులకు యస్.ఓ.టి. నుండి మినహాయింపు)**

GOVERNMENT OF ANDHRA PRADESH
ABSTRACT

Public Services - Automatic Advancement Scheme in respect of Teachers - Orders - Issued.

FINANCE & PLANNING (FW.PC.II) DEPARTMENT

**G.O.Ms.No.312. Dated: 23.8.1993**

Read the following:

1. G.O.Ms.No.164, Finance and Planning (FW.PRC.I) Department, Dated: 1.6.1982.
2. G.O.Ms.No. 78, Finance and Planning (FW.PRC.I) Department, Dated: 13.3.1984.
3. G.O.Ms.No.151, Education (Ser.IV) Department, Dated: 25.4.1989.
4. G.O.Ms.No.347, Finance and Planning (FW.PRC.I) Department, Dated: 17.11.1989.
5. From the Director of School Education, Hyd. Lr.No. 1942/G2/90, Dated:20.10.1990.
6. G.O.Ms.No.189, Finance and Planning (FW.PRC.III) Department, Dated: 1.7.1991.

****

ORDER:

In the Government Order 3rd read above, orders have been issued prescribing a simple Orientation Test which shall be conducted by the Director of School Education, A.P. Hyderabad for the Language Pandits Grade-I of Category-II in lieu of the qualifications prescribed for the post of Head Master so that Grade-I Pandits may be appointed to the Special Promotion Post Scale-I under the Automatic Advancement Scheme but they are entitled for Appointment to Special Promotion Post Scale-I under the Automatic Advancement Scheme only after passing the test. This stand has been reitersated in the Government Order 4th read above in which the Revised Automatic Advancement Scheme is recommended by the Pay Revision Commissioner has been extended to the teachers. The Director of School Education in the letter 5th read above, has informed that one Sri Ch. Kondeswara Rao, Grade-I Hindi Pandit who has retired

